# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అడ్వెంచరస్ స్పిరిట్

రచన: వసుంధర

## మహా డోమనిషి

రచన: జి. వి. అమరేశ్వరరావు

## రహస్య సారంగం

రచన: భీమవరపు పురుషోత్తం

ఎడారి కోయిల — మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —167
నవంబరు, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్ రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1,

# అడ్వెంచరస్ స్పిరిట్

## వసుంధర

థియేటర్లో సినిమా నడుస్తోంది. లోపల జనం పల్చగా ఉన్నారు. అందరికంటే బాగా వెనుక సీట్లలో కూర్చున్నారు చంప, ప్రవీణ్. వారికి ముందు, పక్కల ఎవ్వరూ లేరు. అందుకే వాళ్ళు సినిమా చూడకుండా కబుర్లు చెప్పుకుంటున్నారు.

"చాలా థాంక్స్ చంపా! నీతో కలిసి సినిమా చూసే అవకాశమిచ్చావు—" అన్నాడు ప్రవీణ్.

"కానీ నువ్వు సినిమా చూడ్డం లేదు...." అంది చంప.

"అది థియేటర్ కానీ పూలతోట కానీ తాజ్ మహల్ కానీ నువ్వెక్కడున్నా నిన్ను చూడ్డం ఇష్టం నాకు—" అన్నాడు ప్రవీణ్.

ఎర్రబడిన కారణంగా చీకట్లో చంప బుగ్గలు మెరిశాయి—"నీ కందుకూ నేనంటే అంత యిష్టం!" అందామె.

"మాటల్లో చెప్పలేను. కానీ నాకు నువ్వంటే ఇష్టం

నువ్వంటేనే యిష్టం —" అన్నాడతడు.

చంప నెమ్మదిగా—"నాకూ నువ్వంటే యిష్టమే!" అంది.

"మెనీ మెనీ థాంక్స్!" అన్నాడు ప్రవీణ్.

"అందుకేనేమో మన యిష్టం ప్రేమగా మారడానికి వీల్లేదు—" అంది చంప.

"ఈ విషయం చాలాసార్లు చెప్పావు. నీ బాబయ్యకు నేనంటే యిష్టంలేదు. ఎందుకంటావ్?"

"బాబయ్యకు నేనంటే చాలా యిష్టం. ఎందుకో తెలుసా?"

అతడు తల అడ్డంగా ఊపాడు. చీకటికి అలవాటు పడ్డ కళ్ళు విశేషం చూశాయి.

చంప చెబుతూంటే అతడు వింటున్నాడు.

నారాయణరావు, మధుసూదన్ అన్నదమ్ములు. ఇద్దరికీ ఒకరంటే ఒకరికి ప్రాణం. ఆ కారణంగా పెళ్ళిళ్ళయ్యాక కూడా విడిపోకుండా కలిసే ఉంటున్నారు. నారాయణ రావు కూతురు చంప. చంపకు రెండేళ్ళవయసప్పుడు వారంతా తిరుపతి వెడుతూండగా ప్రమాదానికి గురయ్యారు. అందులో మిగిలినది చంప, మధుసూదన్. జరిగిందానికి మధుసూదన్ బాగా అప్సెట్టయ్యాడు.

ఇన్సూరెన్స్ వల్ల అతడికి లక్షరూపాయలు వచ్చాయి. ఉన్న ఆస్తి అమ్మితే మరో లక్ష వచ్చింది. ఆ డబ్బును బ్యాంకులో వేసి చంపను కన్నకూతురిలా చూసుకో సాగేడతడు. ఆమెకైదు సంవత్సరాలొచ్చేవరకూ ఇంట్లోనే ఉండిపోవడం కోసం — అంతకాలం తను చేస్తున్న ఉద్యోగం వదులుకున్నాడు. ఆమెను స్కూల్లో వేశాక తను మళ్ళీ ఉద్యోగంలో చేరాడు. వచ్చే జీతం అంతంత

మాత్రమైనా పట్టించుకోలేదు.

మళ్ళీ పెళ్ళిచేసుకోమని ఎందరో అతణ్ని బలవంత పెట్టారు. అతడిలో విరక్తిభావం ప్రవేశించడంవల్ల అందు కంగీకరించలేదు. క్రమంగా అతడికి చంప అంటే మమకారం ఏర్పడింది. చెప్పాలంటే ఆమె కోసమే అతడు జీవిస్తున్నాడు.

"బాబాయి నన్ను కన్నతల్లికంటె మిన్నగా పద్దెనిమిదేళ్ళు పెంచాడు. నా కోసమే జీవిస్తున్నాడు. ఆయనకు నేనంటే యిష్టముండదూ?"

అవునన్నట్లు తలూపాడతడు—"కానీ ఆయనకు నేనంటే ఎందుకిష్టంలేదు?"

"నా పేరున రెండు లక్షలున్నాయి. ఇప్పుడు బాబాయికి ఉద్యోగంమీద వచ్చే ఆదాయంకూడా బాగా ఎక్కువ. ఆయనకు నేనుతప్ప ఎవ్వరూలేరు. అందువల్ల నన్నాయన చాలా పెద్దింట్లో యివ్వాలని అనుకుంటు న్నాడు—" అంది చంప.

"పెద్దింట్లో అంటే!"

"నా ఆస్తిమీద ఆశపడకుండా—నా కంటే ఆస్తిలో గొప్పవారై ఉండాలి—"

"చంపా—నేను నిజం చెబుతున్నాను. నాకు నీ ఆస్తిమీద మోజులేదు...."

"నేను నమ్ముతాను. కానీ బాబాయి నమ్మడు...."

"ఎందుకని?"

"ప్రస్తుతం నీ జీతం నెల ఆరువందలు. స్వంతిల్లు లేదు. పెళ్ళి చేసుకుంటే భార్య కోరికలు తీర్చలేవు. అసహాయత నీలో ఉక్రోషాన్ని రెచ్చగొడుతుంది నా ఆస్తిమీద ఆశను పుట్టిస్తుంది ఉక్రోషం. ముందు

సఃఖుగుడుతో ప్రారంభమై తర్వాత శాసించడం మొదలు పెడతావు. ఆ తర్వాత నా ఆస్తితో నీకు దూరలవాట్లు—నాకు దుర్భర కష్టాలు....”

“చంపా—ఏమిటి నువ్వంటున్నది?”

“నేను కాదు—నా బాబాయంటున్నాడు....”

“అంటే నువ్వు నమ్మావా?”

“నేను నమ్మలేను. కానీ ఏం ప్రయోజనం?”

“చంపా—నువ్వుకూడా నీ బాబాయి మాటలు నమ్ముతున్నావు. లేకుంటే నిన్నింతగా ప్రేమించిన నీ బాబాయిని నమ్మించడం నీకసాధ్యం కాదు....”

“బాబాయి దగ్గర నేనేం మాట్లాడలేను. ఆయన మాట నాకు వేదవాక్కు....”

“అయితే మన ప్రేమ ఫలించదా?”

“అలాగే కనబడుతోంది—”

“చంపా—నా కోసం నువ్వేమీ చేయలేవా?”

“నీ కోసం నేను నా బాబాయిని వదులుకుందుకూడా సిద్ధమే! కానీ నువ్వే ఆలోచించు. పద్దెనిమిదేళ్ళపాటు నన్ను కంటికి రెప్పలా—కన్నతల్లికంటె మిన్నగా పెంచిన బాబాయిని కాదని నేనిల్లు వదిలి పెడితే-ఆయనేమైపోతాడు? ఆయన గురించి ఆలోచించాల్సిన బాధ్యత ఎంతో కొంత నాకుంది కదా!”

“నువ్వు చెప్పింది నిజం. అయితే ఇంకే ఉపాయమూ లేదా?”

“ఒక ఉపాయముంది. కానీ నీకు చెప్పడానికి సంకోచిస్తున్నాను—”

“చెప్పు చంపా! నీ కోసం నేనేమైనా చేయగలను!”

“ఏమైనా అంటే హత్య చేయగలవా?”

తెల్లబోయాడు ప్రవీణ్ —"హత్యా?"

"అవును. అందుకే నిజం చెప్పడంలేదు...."

"అసలు హత్య ఎందుకు చేయాలి?"

"అవన్నీ నీ కెందుకు?"

ప్రవీణ్ క్షణం ఆలోచించి—"ఎందుకో తెలుసుకుంటే నేను హత్యయినా చేస్తానేమో!" అన్నాడు.

"ఈ ఊళ్ళో శివరాజా తెలుసా నీకు?"

"తెలియదు...."

"శివరాజా పెద్దమనిషిగా చెలామణీ అవుతున్న సమాజ ద్రోహి—"

"ఊఁ"

"ఆ శివరాజాను నువ్వు చంపేయాలి—"

"ఎందుకు?"

"శివరాజా బ్లాక్ మెయిలర్. ఆయన నా బాబాయిని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు...."

"ఏమని?" అన్నాడు ప్రవీణ్ ఆశ్చర్యంగా.

చంప నెమ్మదిగా— "బాబాయి తప్పు చేశాడు—" అంది.

"తప్పంటే?"

చంప చెప్పసాగింది.

పెళ్ళయితే చేసుకోలేదు కానీ— వయసు రేపే కోర్కెల నణచుకోలేక మధుసూదన్ అప్పుడప్పుడు కాల్ గర్ల్సుని కలుస్తూండేవాడు. ఆయన వేశ్యావాటికకు వెళ్ళేదు. ఏ యువతిని కలుసుకుంటే—ఆ యువతి ఇంటికే వెళ్ళేవాడు. అందుకాయన శివరాజా సాయం తీసుకున్నాడు. అయితే శివరాజా మోసం చేస్తాడని ఊహించలేదు.

ఒక సంవత్సరం క్రితం శివరాజా మధుసూదన్‌కి కొన్ని ఫొటోలు చూపించాడు. ఆ ఫొటోలలో మధుసూదన్, ఓ యువతి ఉన్నారు. వారిద్దరికీ శారీరక సంబంధమున్నదన డానికి తిరుగులేని ఋజువా ఫొటోలు.

"ఏమిటీ ఫొటోలు?" అన్నాడు మధుసూదన్.

"మీ యిద్దరికీ అయిదేళ్ళ క్రితం సంబంధమేర్పడింది. ఈమె పేరు చరిత. ఈమె కిప్పుడు నాలుగు సంవత్సరాల కొడుకున్నాడు. ఆమెకు వేరే ఆధారమేమీ లేదు. నువ్వే తనని పెళ్ళిచేసుకుందుకు నిరాకరించేవట. అసహాయులకూ, అనాథలకూ, ఆడపిల్లలకూ నేనెప్పుడూ సాయపడతాను-" అన్నాడు శివరాజా.

"ఈమె నన్ను పెళ్ళి చేసుకోమని అడగలేదు...."

"ఇప్పుడడుగుతోంది...."

"అప్పుడే అడగాల్సింది. నేనామె జోలికి వెళ్ళి ఉండేవాణ్ని కాదు..."

"ఈ ఫొటోలు మీ యిద్దరికీ పెళ్ళిచేస్తాయి...."

మధుసూదన్ ఒప్పుకోలేదు.

"లేకపోతే నెలకు వెయ్యిరూపాయలు—ఆమెకు భరణంగా యిచ్చుకో—"

మధుసూదన్ అందుకూ అంగీకరించలేదు.

"అయితే మనం కోర్టులో కలుసుకుంటాం...."

మధుసూదన్ ఈ విషయం గొడవగా మారుతుందని భయపడ్డాడు.

"అవ్వాకావాలి, బువ్వాకావాలంటే ఎలా కుదురుతుంది?" అని విసుక్కున్నాడు శివరాజు.

"నేను పేదవాణ్ని. నెలనెలా డబ్బిచ్చుకోలేను—"

"పోనీ ఒక్కసారి యాభై వేలిచ్చుకోగలవా?"

"యూతై వేలా?" మధుసూదన్ చంప భవిష్యత్తు గురించి ఆలోచించాడు.

"అంతకంటే ఎక్కువే వస్తుందామె కోర్టుకి వెడితే!"

"ఆలోచించుకుందుకు వ్యవధి కావాలి...." అన్నాడు మధుసూదన్.

"వారం రోజులు గడువు. గుర్తుంచుకో — వారం రోజులే!"

మధుసూదన్ కి చరిత యిల్లు గుర్తుంది. అతడు ముందామెను కలుసుకున్నాడు. ఆమెను నానామాటలూ అన్నాడు.

చరిత మౌనంగా అన్నీ విని — "శివరాజు మీద కోపాన్ని మీరు నా మీద చూపిస్తున్నారు—" అంది.

"నీ స్వార్థమే శివరాజునింతగా పురిగొల్పింది... "

"నా స్వార్థం సంగతి మరిచిపోండి. శివరాజుని మీరేం చేయగలరు?"

"నేను వాడినేం చేయగలను? అసహాయుణ్ని...."

"మగాడిగా మీరు అసహాయులు. అదీ శివరాజు గొప్పతనం. నేను ఆడదాన్ని. నా అసహాయతను గుర్తించరేం?" అంది చరిత.

అంతవరకూ మధుసూదన్ విషయాన్నా కోణం నుంచి చూడలేదు.

"ఇందులో నీ అసహాయత ఏముంది?"

"పదేళ్ళప్పుడు శివరాజు నన్ను నా కుటుంబం నుంచి దూరం చేశాడు. ప్రయివేటుగా చదువు చెప్పించాడు. పదహారేళ్ళు రాగానే నా వయసును పెద్ద మనుషులపై ప్రయోగించసాగాడు. ఓ కంపెనీలో స్టెనోగా నా కుద్యోగమిప్పించాడు. ఇప్పుడు నాకు పాతికేళ్ళు. నేను

అందరికీలా హాయిగా జీవించాలనుకుంటున్నాను. శివరాజందు కంగీకరించలేదు.

మిమ్మల్ని నేను మోసం చేయను. నాకు పిల్లలు లేరు. నాలుగేళ్ళ కొడుకని శివరాజంటున్నది ఎవరో కూడా నాకు తెలియదు. కానీ అలాంటి పత్రాన్ని తెచ్చి— నా కొడుకని శివరాజు చెప్పమంటే చెప్పేస్తాను. మీరు నన్ను మోసం చేశారని చెప్పమంటే చెప్పేస్తాను. శివరాజుని నేనెదిరించలేను. మనమంతా ఈ సృష్టిలో భగవంతుడాడించే ఆటబొమ్మలం. నేను శివరాజు చేతిలో ఆటబొమ్మని"—అని చెప్పింది చరిత.

మధుసూదన్ కామె పరిస్థితి అర్థమయింది. తన నుంచి డబ్బు కోరుతున్నది శివరాజే కానీ చరిత కాదు. కానీ ఏమిటి చేయడం?

తనే శివరాజుని చంపేయాలని అతడనుకున్నాడు. అందువల్ల తనకు తాత్కాలికంగా ప్రమాదం తప్పుతుంది. చరితకు కూడా మేలు జరుగుతుంది.

కానీ చంప?

చంప జీవితంలో స్థిరపడాలి. ఆమె సుఖంగా కాపురం చేసుకుంటూంటే అది తను కళ్ళారా చూసి సంతోషించాలి. తను శివరాజును చంపితే—పట్టుబడి ఉరికంబ మెక్కితే—చంప ఏమైపోతుంది?

“శివరాజు పాపాత్ముడు. దుర్మార్గుడు. వాడినేదో ఒకరోజున ఎవరో ఒకరు చంపకపోరు. అంతవరకూ వేచి ఉండడం మినహా నేను చేయగలిగిందీ లేదు—” అనుకుని ఊరుకున్నాడు మధుసూదన్. అప్పట్నించీ నెల నెలా శివరాజు కాయన వెయ్యిరూపాయలు సమర్పించుకుంటున్నాడు.

"ఇదంతా నీకెలా తెలిసింది?" అన్నాడు ప్రవీణ్.

"తెలియడంలో ఆశ్చర్యమేముంది?" అంది చంప.

"ఆశ్చర్యమే! నీ బాబాయి నీ కిలాంటి కథ చెబుతా డనుకోను—"

"నాకీ కథ బాబాయి చెప్పలేదు—"

"మరెవరు చెప్పారు?"

"ప్రస్తుతానికి చెప్పలేను...." అంది చంప.

ప్రవీణ్ ఆమెనింకేమీ అడగలేదు. తను లేచి నిలబడి "నా ప్రేమను నిరూపించుకుంటాను. శివరాజును చంపే స్తాను—" అన్నాడతడు.

## 2

"మెనీ మెనీ థాంక్స్ చంపా!" అంటూ వెనక్కు వాలాడు సోఫాలో విజయ్.

"నాకు థాంక్స్ చెప్పి లాభంలేదు. నీ అదృష్టం బాగుండాలంటే—" అంది చంప.

"నీవు నా తరఫున కృషి చేయడమే నా అదృష్టం. ఇంకా వేరే అదృష్టమేముంది!" అన్నాడు విజయ్.

చంప సాలోచనగా— "పాపం—నీ కారణంగా నేను ప్రవీణ్ కన్యాయం చేస్తున్నానేమో ననిపిస్తోంది-" అంది.

"డియర్ చంపా! ఇలాంటి సున్నిత మనస్తత్వం ఆడ దానికి తగదు. ఆడదాని అందమంతా స్వార్థంలో ఉంది. తనకోసం తనవారి కోసం ఏమైనా చేయగల ఆడది— ఏ కుటుంబ విజయానికైనా మూలకారణం...."

"నిజమేకావచ్చు. కానీ ." అంది చంప.

"డియర్ చంపా! నీలో పసితనం పోలేదు. కమాన్- గివ్ మీ యే స్వీట్ కిస్...." అన్నాడు విజయ్.

"ఇలా మాట్లాడితే నాకు నచ్చదని చెప్పాను—" అంది చంప లేచి నిలబడి.

"అయాం వెరీసారీ! నువ్వు అన్నింట్లోనూ మరీ స్ట్రిక్ట్. పెళ్ళయ్యేదాకా వాయిదా వెయ్యడానికి నా వల్ల కాకుండా ఉంది. ప్లీజ్, కాస్త మోడ్రన్‌గా మారు..." అన్నాడు విజయ్.

"నాకు సంప్రదాయమంటే ఇష్టం. పెళ్ళి అయ్యేదాకా నువ్వు నన్ను తాకనైనా తాకకూడదు. అంతే!" అంది చంప.

"నీ రూల్సన్నీ నాకు తెలుసులే. నాకు నిన్ను తాకే అదృష్టమెప్పటికి కలుగుతుందో?" అంటూ వాపోయాడు విజయ్.

"నీకు నేను సహకరిస్తున్నాను. అది తప్పో ఒప్పో నాకే తెలియదు—" అంది చంప.

"శివరాజావంటి వాణ్ని అంతం చేయడం చాలా అవసరం. అందుకు నీకు బోలెడు పుణ్యం వస్తుంది...."

"నిజమే—మధుసూదన్ బాబాయి నేడిపించినవాడు బాగుపడడు...." అంది చంప.

"వాడు నీ బాబాయినే కాదు, నన్నూ ఏడిపిస్తున్నాడు. నన్నేడిపించినవాడూ బాగుపడడు—" అన్నాడు విజయ్.

"బాబాయికీ నీకూ తేడా ఉంది...."

"ఎందుకుండదూ—ఆయన తండ్రివంటివాడు. నేను నీకు ప్రియుణ్ని. కాబోయే భర్తను...."

"నేను చెబుతున్నదా తేడా కాదు...."

"మరింకేమిటి?"

"బాబాయి చేసింది తప్పుకాదు. నువ్వు తప్పు చేశావు."

"నీ బాబాయిది తప్పుకానప్పుడు నాది మాత్రం తప్పెందుకవుతుంది?"

"ఎందుకంటే—బాబాయి నా కోసం పెళ్ళి చేసుకోలేదు. తన సుఖం కోసం ఎవరితోటి అక్రమ సంబంధం ఏర్పరచుకోలేదు. న్యాయమైన పద్ధతిలో తన కోర్కె తీర్చుకున్నాడు...."

"న్యాయమైన పద్ధతి...." అని వెటకారంగా నవ్వాడు విజయ్.

"అవును—నా అభిప్రాయంలో అది న్యాయమైన పద్ధతే ...కానీ నువ్వు స్మగ్లరుతో వ్యవహారంలో ఉండి - శివరాజా కమేరాలో చిక్కడావు. బాగా డబ్బు సంపాదించాలన్న అత్యాశ కాకపోతే నీకు స్మగ్లింగ్ అవసర మేమిటి?"

"పెళ్ళి చేసుకోనివాడికి వ్యభిచారంలాగే—డబ్బు కావాలనుకున్నవాడికి స్మగ్లింగ్ అవసరం. నువ్వు నన్ను ప్రేమించావంటే డబ్బును చూసి కాదా?"

చంప నిట్టూర్చి—"అదంతా చెప్పలేను. నాకు నువ్వంటే ఎంతో యిష్టం. నీ రూపురేఖలు, నీ నడక, నీ పర్సనాలిటీ—వాటిలో ఏదో సంచలనాన్ని కలిగిస్తుంది. నువ్వేం చేసినా వండ్రఫుల్ అనిపిస్తుంది. నాకు అడ్వెంచరస్ స్పిరిట్ ఉన్న మగాళ్ళంటే ఆకర్షణ అనుకుంటాను. అటుపైన నాకు వైభవోపేతంగా జీవించాలని ఉంది. బాబాయి నా కోసం డబ్బు నిలవేస్తూ నన్ను సింపుల్ గా పెంచాడు....ఇలా ఎన్నో కారణాలు జతపడ్డాయను కుంటాను " అంది.

"నిజం చెబుతున్నాను. నాకు నీ అందం, అవయవాల పొందిక నచ్చింది. రోజుకొక్కసారైనా నువ్వు నా

కలలో కొస్తావు—" అన్నాడు విజయ్.

"కలలోనైనా సరే నన్ను తాకితే నే నొప్పుకోను. గుర్తుంచుకో...."

"మరి నీకు అడ్వెంచరస్ స్పిరిట్ ఉంటే యిష్ట మన్నావు. ఇప్పుడే అడ్వెంచర్ చేయనా?"

"నీ కంతగా అడ్వెంచరస్ స్పిరిట్ ఉంటే—శివ రాజుని నువ్వే చంపొచ్చుగా-" అంది చంప.

"అయాం సారీ, చంపా!" అన్నాడు విజయ్ వెంటనే.

అతడికి తెలుసు. ప్రవీణ్ చంపను ప్రేమిస్తున్నాడు. చంప తనను ప్రేమిస్తోంది. శివరాజును హత్య చేయడానికి ప్రవీణ్‌ని పురమాయించడం ద్వారా—ఆమెకు రెండు ప్రయోజనాలు. ఒకటి శివరాజుని వదుల్చుకోవడం. రెండు ప్రవీణ్‌ని వదుల్చుకోవడం.

రెండో ప్రయోజనం గురించి చంప బాధపడుతోంది. ఒక అమాయకుడు ఉరికంబమెక్కడం ఆమె కిష్టంలేదు.

"విజయ్! నీ కంటే అడ్వెంచరస్ స్పిరిటున్న ప్రవీణ్—ఎందుకో నన్నాకర్షించలేకపోయాడు. అతణ్ని మన పని కుపయోగించుకున్నాక—ఎలాగో అలా కాపాడాలి—" అంది చంప.

"తప్పకుండా! ఇప్పుడే నేను నీకు మాటిస్తున్నాను-" అన్నాడు విజయ్. అయితే మాటమీద నిలబడాలన్న పట్టింపతడికి లేదని చంపకు అనుమానముంది.

## 3

రాత్రి తొమ్మిదిగంటలకు వంటాయన కోటయ్య మధుసూదన్‌కీ, చంపకూ భోజనం వడ్డించాడు.

"ఈ రోజు చాలా ఆలస్యంగా వచ్చేవమ్మా!" అన్నాడు మధుసూదన్ ఆప్యాయంగా.

"అనుకోకుండా ఆలస్యమైపోయింది—" అంది చంప.

"శ్యామలరావుగారింటికి వెళ్ళి టైపిన్ స్టిట్యూట్ కి ఫోన్ చేశాను. నువ్వు వెళ్ళిపోయావన్నారు...." అన్నాడు మధుసూదన్.

"సంగీతం స్కూలుకి ఫోన్ చేయలేదా?" అంది చంప నవ్వుతూ.

"లేదు. అక్కడంత సేపుండవని నాకు తెలుసు...."

"బాబాయ్—నీకు నా మీద నమ్మకంలేదా?"

"ఎందుకు లేదమ్మా? అందుకేకదా?— ఆలస్యంగా ఎందుకొచ్చావూ—అనడిగాను. ఏమయ్యావోనని కంగారు పడ్డాను...."

ఇద్దరూ భోజనాలు చేశాక మధుసూదన్ ఆమెను తన గదిలోకి పిలిచి—"నీతో ముఖ్య విషయం మాట్లాడా లమ్మా—" అన్నాడు.

"చెప్పు బాబాయ్-" అంది చంప.

"నేను విజయ్ గురించి వాకబుచేశాను. అతడు జాలాయి మనిషి. చాలా ప్రమాదకరమైన వ్యక్తికూడా!"

చంప మాట్లాడలేదు.

"అనుభవంమీద చెబుతున్నాను. ఈ కళ్ళతో ప్రపంచాన్ని చూసి ఎన్నో తెలుసుకున్నాను. వయసు చాలా ప్రమాదకరమైనది. అందులోనూ ఆడపిల్ల వయసులో ఉన్నప్పుడు జాగ్రత్తగా ఉండాలి. నువ్వు తెరమీద నటుల్ని చూశావు. కానీ ఈ వయసులో నీ చుట్టూ తిరిగే వారందరూ మహానటులు. వారి నటన ఎంత గొప్పగా ఉంటుందంటే—వారి నిజ స్వరూపాన్ని కళ్ళారా చూసినా అది నిజంకాదని సరిపెట్టుకోవాలని పిస్తుంది. విజయ్ చాలా ప్రమాదకారి. నా మాట నమ్మూ...."

"అయితే ఏం చేయను బాబాయ్?"

"నేను నీ కోసం వెతికి వెతికి ఎన్నుకున్న ప్రవీణ్‌ని పెళ్ళి చేసుకో. అతడెంతో మంచివాడు. నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. అతడి జీతం తక్కువ కావచ్చు కానీ మానకున్నదాంతో హాయిగా బ్రతకొచ్చు. మీ యిద్దరూ సుఖంగా కాపురం చేసుకుంటూంటే చూస్తూ సంతోషించాలని నా కోరిక. అందుకే నేను నీ కతణ్ణి పరిచయం చేశాను. నిర్ణయం నీకే వదిలి పెట్టాలని—అతడికి నా మనసులోని ఉద్దేశ్యం తెలియనివ్వలేదు. నువ్వు నా మాటకు విలువియ్యి—" అన్నాడు మధుసూదన్.

"ప్రవీణ్ నర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తున్నాను. నా అడ్వెంచరస్ స్పిరిట్‌కీ అతడి మన స్తత్వానికీ సరిపోవడం లేదు...."

"పోనీ విజయ్‌తో ఎలా సరిపోయిందో చెప్పు!"

చంప చెబుతూంటే ఆమె కళ్ళలో మెరుపు.

విజయ్‌కు కారుంది. తనే ఆ కారును డ్రైవ్ చేస్తుంది. ఊళ్లో తనంత స్పీడుగా డ్రైవ్ చేసేవారు లేరని చెప్పుకోవాలి. విజయ్‌కి దురలవాట్లున్నాయి. తానతడి చేత అవి మానిపించి అతణ్ణదుపులోకి తీసుకుంటుంది. విజయ్ నేరస్థులతో చేతులు కలిపి నేరాలు చేస్తున్నాడు. తను విజయ్ మనసు మార్చి నేరస్థులకు వ్యతిరేకంగా మార్చుతుంది. నేరస్థులతో శత్రుత్వం కారణంగా జీవితం నిండా అడ్వెంచర్....

విజయ్ నేరాలు చేస్తున్నా, దురలవాట్లకు గురైనా, స్వార్థపరుడికిలా అగుపిస్తున్నా అతడి మనసు మంచిది. ఆ మంచి తనది. అతడికి ప్రేమించే హృదయముంది. ఆ ప్రేమ తనది.

"ఇదంతా సినిమాల ప్రభావం. నిజజీవితంలో మనుషులు—సినిమా హీరోల్లా ఉండరు. సినిమా హీరోలే నిజజీవితంలో అలాగుండరు...."

"అమితాబ్ బచన్ హిట్ పిక్చర్సన్నింట్లోనో విజయ్ పేరు పెట్టుకున్నాడు. ఆ పేరు మంచితనాన్నీ, జయాన్నీ సూచిస్తుంది...." అంది చంప.

మధుసూదన్ నిట్టూర్చి—"సాఫీగా నడిచిపోతున్న నీ జీవితంలోకి నేరస్థుల నెందుకమ్మా ఆహ్వానిస్తావు?" అన్నాడు.

"బాబాయ్—పరిస్థితుల ప్రభావంవల్ల కొందరు నేరస్థులవుతారు. అలాంటి పరిస్థితులే ఎదురైతే అందరూ నేరస్థులే అవుతారు ఉదాహరణకు ప్రవీణ్ నే తీసుకో. నన్ను తృప్తిపరచడంకోసం అతను హత్య చేయడానికైనా సిద్ధంగా ఉన్నాడు-" అంది చంప.

"నేను నమ్మను...."

"చరిత కథ అతడికి చెప్పాను. అతడు శివరాజును చంపుతానన్నాడు"

మధుసూదన్ ముఖం అదోలాగైపోయింది. అతడు నిట్టూర్చి- "నేనూ నేరస్థుణ్ణేనని గుర్తు చేస్తున్నావుకదూ!" అన్నాడు.

"విజయ్ నే నేరస్థుడనుకోని నేను నిన్ను నేరస్థుడని ఎందుకనుకుంటాను?"

"ఆ కథ నీదాకా రాకూడదని ఎంతో తాపత్రయపడ్డాను. కానీ కుదరలేదు. విజయ్ నిన్ను నాకు వ్యతిరేకంగా మార్చాలని ఈ కథ నీకు చెప్పాడు తప్ప - అది మన సంబంధ బాంధవ్యాలమీద ఎలాంటి దెబ్బతీస్తుందో

పట్టించుకోలేదు. తండ్రీ కూతుళ్ళమధ్య-కొన్ని విషయాలు రహస్యంగా ఉంచడమే మంచిది...." అన్నాడు మధుసూదన్.

"అవన్నీ యిప్పుడెందుకు బాబాయ్! నేను చెబుతున్న దల్లా ప్రవీణ్ హత్యకు సిద్ధపడ్డాడని!" అంది చంప.

"శివరాజు చావడం నా కిష్టమే! కానీ ప్రవీణ్ హంతకుడు కావడం నా కిష్టంలేదు. నేనతణ్ని వెంటనే కలుసుకుంటాను...."

"బాబాయ్-ఎవరి వ్యక్తిత్వాలోనూ జోక్యం చేసుకోకు. నువ్వు నేను చెప్పేదాకా ప్రవీణ్ తో మాట్లాడితే నామీదొట్టే!" అంది చంప.

## 4

డ్రాయింగ్ రూంలో ఒక్కడూ కూర్చుని విడియోలో బ్లూ ఫిల్మ్ చూస్తున్నాడు శివరాజు. అతడి ముఖంలో ఉద్రేకం లేదు. ఆవేశంలేదు. చాలా తాపీగా చూస్తున్నా డతడు.

"సర్!" అన్న పిలుపు విని గుమ్మంవైపు చూశా డతడు.

శివరాజు గుమ్మానికెదురుగా కనబడుతున్నాడు. గుమ్మం దగ్గరున్న వాళ్ళకి విడియో కనబడదు.

విడియో చూస్తూనే—"ఏమిటి?" అన్నాడు శివరాజు.

గుమ్మందగ్గరున్న పనివాడు-"మీకోసం ఎవరో వచ్చా రండి. లోపలకు పంపమంటారా?" అన్నాడు.

"పేరు?"

"ప్రవీణ్ ...."

"ఇదివరకెప్పుడైనా మనింటికొచ్చేడా?"

"లేదండి...."

"సరే - పంపించు-" అని రిమోట్ కంట్రోల్‌తో వీసీఆర్, టీవీ-ఆఫ్ చేశాడు శివరాజు.

కొద్ది క్షణాల్లో ప్రవీణ్ లోపలకు ప్రవేశించి శివరాజుకు నమస్కరించాడు. శివరాజతడికి ఆసనం చూపించాడు.

ఇద్దరూ ఒకరికొకరు - ఎదురెదురుగా కూర్చున్నారు.

"మీ రెవరో నాకు తెలియదు—" అన్నాడు శివరాజు.

"మీరు నాకు తెలుసు—" అన్నాడు ప్రవీణ్.

"ఎలా తెలుసు?" కుతూహలంగా అడిగాడు శివరాజు.

"మీరు చాలామందిని బ్లాక్ మెయిల్ చేస్తున్నారు."

శివరాజు ముఖం గంభీరంగా మారిపోయింది — "ఎవరున్నవ్వ?" అన్నాడు తీవ్రంగా.

"చాలా సామాన్యుణ్ని. నా జీతం నెలకారొందలు."

"ఎందుకొచ్చావ్?"

"నిన్ను హెచ్చరించడానికి—" అన్నాడు ప్రవీణ్ తనూ సంభాషణమార్చి.

శివరాజు నవ్వి—"నీ కంటే పెద్దవాళ్ళు నన్ను హెచ్చరించారు"— అన్నాడు.

"వాళ్ళకూ నాకూ తేడా ఉంది ...

"ఏమిటది...."

"నేను నీ శ్రేయోభిలాషిని...."

శివరాజు తెల్లబోయి — "శ్రేయోభిలాషివా?" అన్నాడు.

"అవును...."

"అయితే నువ్వు నాకు చెప్పదల్చుకున్న దేమిటి?"

"నీ ప్రాణాలు ప్రమాదంలో ఉన్నాయి...."

శివరాజు నవ్వి—"ప్రమాదాలకు నేను భయపడను. వాటితో ఆడుకుంటాను—" అన్నాడు.

"ప్రమాదాలతో ఆడుకోవడానికి బ్రతికుండాలి కదా!" అన్నాడు ప్రవీణ్.

"నన్ను చంపడం అంత సులభం కాదు...."

"ఉంగరపు రాయికి విషమంటించి షేక్‌హ్యాండిస్తే ఎవరు చంపారో ఎలా చంపారో తెలియకుండా ప్రాణాలు పోతాయి. అర్థరాత్రిపూట నీ గదిలోకి విష సర్పాన్ని వదిలిపెడితే పాము కరిచిందనుకుంటారు తప్ప హత్య అనుకోరు....మనిషిని చంపాలంటే యిలా ఎన్నో ఉపాయాలున్నాయి...."

"అయితే ఏం చేయమంటావ్?"

"నీ పద్ధతి మార్చుకో. ఇంతవరకూ సంపాదించింది దాంతో తృప్తిపడు. ఇకమీదట ఎవరినీ బ్లాక్ మెయిల్ చేయక....సుఖంగా నువ్వు జీవించి పదిమందిని సుఖపడనీ—" అన్నాడు ప్రవీణ్.

"నువ్వు నన్ను బెదిరిస్తున్నావా?"

"లేదు—హితవు చెబుతున్నాను...."

"నీ హితవు పాటించకపోతే?"

"చచ్చిపోతావు "

"ఇప్పుడే ఈ క్షణంలో నేను నిన్ను చంపేస్తే....!"

"అప్పుడు నిన్ను నా స్నేహితుడు బ్లాక్ మెయిల్ చేస్తాడు. నువ్వు సంపాదించిన దానికి రెట్టింపు గుంజడం మొదలు పెడతాడు...."

"ఎక్కడున్నాడు నీ స్నేహితుడు?"

"నేను చెప్పను...."

"చెప్పకపోతే ఇప్పుడే చస్తావ్! బ్లాక్ మెయిలింగు సంగతి తర్వాత చూస్తాను"

"నన్ను చంపడం ద్వారా నీ చావును తప్పించుకోలేవు...."

"ఏం—నీ స్నేహితుడు పగతీర్చుకుంటాడా?"

"నా స్నేహితుడు హత్యలు చేయడు. నువ్వు చచ్చే లోగా నిన్ను బ్లాక్ మెయిల్ చేసి నీ దగ్గర డబ్బు గుంజుతాడు!"

"మరి నేనెలా చస్తాను?"

"ఎలా చస్తావో యిప్పుడు చెప్పను...."

"ఎప్పుడు చెబుతావు?"

"నీ దగ్గర లక్షరూపాయలు తీసుకుని...." అన్నాడు ప్రవీణ్.

"నువ్వడిగితే నేనిస్తాననుకున్నావా?"

"నిన్ను చంపడానికి ముగ్గురు ప్రయత్నిస్తున్నారు. ముగ్గురూ మూడు రకాలుగా ప్రయత్నిస్తున్నారు. వాళ్ళెవరో—ఏ విధంగా ప్రయత్నిస్తున్నారో నాకు తెలుసు. నా ద్వారా నువ్వూ తెలుసుకోవచ్చు. అందుకు లక్ష రూపాయల ఫీజు ఇవ్వదల్చుకుంటే యివ్వవచ్చు. లేదా మూడే మూడు రోజుల్లో నీకు చావు రాసి పెట్టి వుంది."

"నేను నీకు పైసా కూడా యివ్వను"

"అయితే బ్లాక్ మెయిలింగ్ మానేసెయ్. నీ చేత బ్లాక్ మెయిలింగ్ కాబడుతున్న వారందరికీ ఆ విషయం చెప్పేసెయ్. నీ ప్రాణాలు రక్షించబడతాయి. నిన్ను చంపాలనుకుంటున్న వారు ముగ్గురూ కూడా నీ బ్లాక్ మెయిల్ కు గురైనవారే! అయితే వాళ్ళు నియమించిన మనుషులెవ్వరో నీ ఊహకు కూడా అందదు...."

"నీ కెలా తెలిసింది?"

"అనుకోకుండా తెలిసింది. హత్య చేసుకోవాలనుకుంటున్నాను...."

శివరాజు క్షణం ఆలోచించి— "నీకు నేను డబ్బిస్తాను. నీకు తెలిసిన ఆ రహస్యం నాకు చెప్పు...." అన్నాడు.

"ఇప్పుడు చెప్పను...." అన్నాడు ప్రవీణ్.

"ఎప్పుడు చెబుతావు? నా కింక మూడేరోజుల వ్యవధి ఉందన్నావు...."

"అర్ధరాత్రి ఒంటిగంటకు— నీ యింటికి దగ్గర్లోని— స్ప్రహా పార్కులో— నల్లగులాబి పొదలో లక్ష రూపాయలనూ— ఓ సంచీలో పెట్టి— ఉంచేయ్ ఆ తర్వాత ఆ ప్రాంతాల నువ్వుగానీ నీ మనుషులుగానీ ఉండకూడదు. ఇంటికి చేరేసరికి నీకా్కవలసిన సమాచారం అందుతుంది—"

"అందకపోతే?"

"నా చిరునామా నీకు తెలుసు. నేను సామాన్యుణ్ని. నా పని పట్టడం నీ కసాధ్యంకాదు ... "

"నీ చిరునామా నాకు తెలియదు ..."

"తెలుసంటే— నేను చెబుతానని అర్థం...."

ప్రవీణ్ శివరాజుకు తన చిరునామా యిచ్చాడు. శివరాజు నోట్ చేసుకుని జేబులో ఉంచుకున్నాడు.

"మరి— నాకు సెలవా?" అంటూ లేచాడు ప్రవీణ్.

శివరాజు తలాడించాడు.

## 5

థియేటర్లో జనం పల్చగా ఉన్నారు.

బాగా వెనకగా కూర్చుని ఉన్నారు ప్రవీణ్, చంప.

"శివరాజు మనుషులు నిన్ననుసరించి కనిపెడుతూంటా

లేమో—నీకు భయంగా లేదా?" అంది చంప.

"శివరాజు బ్లాక్ మెయిలర్. అలాంటివారికి అనుచరు లుండరు. ఒక్కడే పనిచేస్తాడు...."

"అయితే నీకు లక్షరూపాయలూ ఇస్తాడంటావా?"

"ఇస్తాడు...."

"ఇవ్వకపోతే?"

"ఇచ్చినా యివ్వకపోయినా—చస్తాడు—"

"ఎలా?"

"గులాబిపొదలో అతడికోసం విషనాగు—సిద్ధంగా ఉంటుంది. డబ్బుసంచీ పెట్టగానే కాటేస్తుందది...."

"పాము బుద్ధిగా ఆ పొదలోనే కూర్చుంటుందను కున్నావా?"

"అందుకు పద్ధతులున్నాయి. ఎవరైనా కదిపితే తప్ప చలనముండదు దానిలో."

చంప అతడివంక ఆశ్చర్యంగా చూసి— "నేరస్థుడిగా నువ్వు బాగా రాణిస్తావు. నీ గురించి ఏమో అను కున్నాను—" అంది.

"నేనేం చేసినా—అది నీ కోసమే...." అన్నాడు ప్రవీణ్.

"నేను నిన్ను మోసం చేస్తున్నాననుకో—అప్పుడు?" అడిగింది చంప.

"నేను నీ గురించాలోచించను. నా కోసమే నా ఆలోచనంతా. నాకు నువ్వు కావాలి....ఎలాంటి దాని వైనా సరే!"

"హత్యచేసి పట్టుబడితే నేను నీకు దక్కకుండాపోతాను. అందుకూ సిద్ధపడే ఉన్నావా?"

"నేను హత్యచేస్తే పట్టుబడను...."

"ఒకవేళ నేను నిన్ను పట్టిస్తే!"

"ఏం చేస్తానో తెలియదు కానీ నిన్ను ద్వేషించను."

చంప అతడివంక ఆశ్చర్యంగా చూసింది— "నేనంటే నీకెందుకూ—అంతిష్టం!" అనడిగిందామె.

"నువ్వడిగావు కాట్టి నీ ప్రశ్నకు—జవాబు తెలుసుకుందుకు ప్రయత్నిస్తాను—" అన్నాడు ప్రవీణ్.

"ఒక్క నిముషం—నేను బయటకు వెళ్ళొస్తాను—" అంది చంప.

"ఏం చేస్తాను? నువ్వొచ్చేదాకా సినిమా చూస్తూంటాను—" అన్నాడు ప్రవీణ్ నిరుత్సాహంగా.

చంప బయటకు వెళ్ళి—థియేటర్ మేనేజర్నోసారి ఫోన్ కావాలనడిగింది. అందమైన అమ్మాయికి ఫోన్ ఏమిటి? ఏమైనా యిచ్చి సహకరిస్తారెవరైనా?

మేనేజరామె ప్రయివేటుగా మాట్లాడుకునేందుకు వీలుగా గదిలోంచి బయటక్కూడా వెళ్ళిపోయాడు.

చంప విజయ్కి ఫోన్ చేసింది. విజయ్ వెంటనే లైనులోకి వచ్చాడు. స్వరం తగ్గించి ఆమె ప్రవీణ్ చెప్పిందంతా చెప్పింది.

"చాలా థాంక్స్...చంపా!" అన్నాడు విజయ్.

"ఇప్పుడు నువ్వేం చేస్తావు?"

"అటు శివరాజా, ఇటు ప్రవీణ్—ఇద్దరి అడ్డూ తొలగిస్తాను...."

"ప్రవీణ్ని పోలీసులు పట్టుకోరు కదూ!"

సమాధానంగా విజయ్ నవ్వాడు.

"నువ్వు నాకు సమాధానం కాదు...."

"ఒకే ఒరలో రెండు కత్తులిమడవని నువ్వు గుర్తుంచుకోవాలి—మైడియర్ చంపా!" అని ఫోన్ పెట్టేశాడు

విజయ్.

చంపకు కళ్ళు జలదరించింది.

ఆమె గది బయటకు వచ్చి మేనేజరుకు థాంక్స్ చెప్పుతుంది. తర్వాత హాల్లోకి వెళ్ళింది.

"క్షణం యుగంలా గడిచింది నాకు. ఇంతాలస్యం చేశావేం చంపా?" అన్నాడు ప్రవీణ్ దీనంగా.

"ఇప్పుడే యింత బాధపడుతున్నావు....హత్య చేయడంవల్ల నాకు దూరమైతే ఏం చేస్తావు?" అంది చంప నవ్వుతూ.

"నీకు దగ్గర కావాలని హత్యచేస్తున్నవాణ్ని.... హత్యచేసి నీకు దూరమవుతానని ఎలాగనుకున్నావు?" అన్నాడు ప్రవీణ్.

"నేరం రుజువు తప్పించుకోలేడు...."

"శివరాజాను చంపడం నేరంకాదు...."

"శివరాజాను చంపడం సులభంకాదు...."

"చంపా—ముందే చెప్పాను. నీ కోసం ఏమైనా చేయగలను...."

అతడి మాటలు చంప కేదోలాగనిపించాయి. ఒక అమాయకుణ్ని తానుగానీ అన్యాయం చేయడంలేదుగదా అనిపిస్తోందామెకు.

## 6

అర్ధరాత్రి ఒంటిగంటయింది.

శివరాజా నెహ్రూపార్కులో అడుగుపెట్టాడు.

అతడి భుజాన ఓ సంచీ వ్రేలాడుతోంది. ఆ సంచీ ఉబ్బెత్తుగా ఉంది.

శివరాజా తిన్నగా నల్లగులాబుల పొదవద్దకు చేరాడు.

ఆ సమయంలో పార్కు నిర్మానుష్యంగా ఉండ

డంలో ఆశ్చర్యంలేదు. అయినా శివరాజోసారి చుట్టూ చూశాడు.

అతడికి ప్రాణభయంలేదు.

అతడు చనిపోయిన మరుక్షణం—ఎందరో పెద్ద మనుషుల గుట్టు బయటపడుతుంది. అందుకతగ్గ ఏర్పాటతడు ముందే చేసుకున్నాడు. అతడి స్నేహితుడొకడి వద్ద లాకర్ కీ ఉంది. శివరాజు బ్లాక్ మెయిలింగ్ వ్యవహారాల ఒరిజినల్సన్నీ ఆ లాకర్లో ఉన్నాయి. ఆ లాకర్ కీ శివరాజు స్నేహితుడివద్ద ఉంది. లాకర్ శివరాజు పేరుంది.

శివరాజు చావగానే ఆ స్నేహితుడా లాకర్ కీ పోలీసుల కందజేస్తాడు. పోలీసులు పెద్ద మనుషుల గుట్టు తెలుసుకుంటారు. అందుకే ఎందరో పెద్ద మనుషులు శివరాజువల్ల నష్టపోతూ అతడి ప్రాణాలు కాపాడాలని కూడా అనుకుంటూంటారు.

శివరాజు స్నేహితుదెవరో తెలుసుకోవాలని చాలా మంది ప్రయత్నించారు. సాధ్యపడలేదు. శివరాజుకు లాకరెక్కడుందో తెలుసువాకోలన్న వారి ప్రయత్నాలూ విఫలమయ్యాయి. శివరాజుకు నాలుగైదు బ్యాంకుల్లో నాలుగైదు పేర్లతో అకౌంట్సున్నాయి. లాకర్సున్నాయి. ఆ విషయం చాలామందికి తెలియదు.

శివరాజు కనుక మరణిస్తే అందుకు సరైన కారణం నిరూపించబడాలి. అతడు హత్యచేయబడితే—హంతకుణ్ణి పట్టడానికి పెద్ద మనుషులందరూ కృషిచేయాలి. తను బ్లాక్ మెయిల్ చేస్తున్న వారి జాబితా శివరాజు స్నేహితుడి దగ్గరుంది. హంతకుడా జాబితాలో ఎవరికీ సంబంధించినవాడు కాకపోతే — హత్యకు సరైన ప్రత్యేకమైన కారణమేదైనా ఉంటే శివరాజు స్నేహి

తుడు లాకరు తాళాన్ని పోలీసుల కందించకుండా—తనే శివరాజుకు వారసుడై ఆ లాకర్లోని వస్తువులు తీసుకోగలడు. అతడు మంచివాడు. శివరాజు బ్లాక్ మెయిలరని కూడా అతడికి తెలియదు. తనవద్దున్న లాకరు కీ, పేర్ల జాబితా చరిత్ర అతడికి తెలియదు.

తన భుజాన సంచీ తీసి గులాబుల పొదలో వేశాడు శివరాజు. ఆ వెనువెంటనే అతడికి బుస్సుమన్న శబ్దం వినపడింది. శివరాజు కంగారుపడ్డాడు కానీ సమయం మించిపోయింది.

కాళ్ళమీద ఏదో గీరుకున్న అనుభూతి, ఆ వెనువెంటనే ఒళ్ళంతా భరించలేని బాధ.

శివరాజు నేలమీద చర చరా పాకిపోతున్న విషనాగును చూశాడు. ఎందరినో గడగడలాడించిన అతడు తన్ను కాటేసిన విషనాగును ఏమీ చేయలేని అసహాయుడయ్యాడు.

పాము చర చర పాకిపోతూంటే అతడు విరుచుకుని వెనక్కు పడిపోయాడు.

## 7

ప్రవీణ్ మంచి నిద్రలో ఉన్నాడు.

ఆ సమయంలో ఎవరో తలుపులు దబదబ బాదుతున్నారు.

విసుగ్గా లేచాడతడు. అదే విసురుతో తలుపు తీశాడు.

గుమ్మంబయట అతడెరుగని ఓ మనిషి. అతడి చేతిలో చిన్న సైజు తెల్లటి కవరు.

“చంపమ్మగారు-అర్జంటుగా మీకీ కవరిమ్మన్నారు” అంటూ ఆ కవరిచ్చి వెంటనే వెళ్ళిపోయాడతడు. కవరు చింపి ఉత్తరం తీశాడు ప్రవీణ్.

"ప్రవీణ్! నెహ్రూ పార్కులో శివరాజా పాముకాటువల్ల మరణించాడు. పోలీసులు నీకోసం బయల్దేరుతున్నారు. ఇంకేమీ ఆలోచించకు. వెంటనే పారిపో! ఎక్కడికో అక్కడికి..పారిపో. బ్రతికుంటే బలుసాకు తినొచ్చు. అదృష్టముంటే మళ్ళీ కలుసుకోవచ్చు. ముందు నీ ప్రాణాలు దక్కించుకో —నీ చంప."

ఇది చదివి తెల్లబోయాడు ప్రవీణ్. కానీ అతడు జాప్యం చేయలేదు. వెంటనే తన గదికి తాళం వేసి చంప యింటికి బయల్దేరాడు.

అతడామె యిల్లు చేరుకుందుకెంతో సేపు పట్టలేదు. కాలింగ్ బెల్ విని మధుసూదన్ తలుపుతీసి —"నువ్వా? ఈ సమయంలో వచ్చావేమిటి?" అన్నాడు.

"అర్జంటుగా చంపను కలుసుకోవాలి—" అన్నాడు ప్రవీణ్.

"ఇంత రాత్రిపూట వచ్చి పెళ్ళికాని ఆడపిల్లను కలుసుకుంటానంటున్నావు. దానికి సమాధానమేమిటో తెలుసా? గెటౌట్ ...."

"అయ్యా! నన్నపార్థం చేసుకోకండి. ఇది నాకు జీవన్మరణ సమస్య...." అన్నాడు ప్రవీణ్.

"లోపలకు రా!" అన్నాడు మధుసూదన్. ప్రవీణ్ లోపలకు రాగానే అతడు తలుపువేసి ఆసనం చూపించాడు.

ఇద్దరూ ఒకరికొకరు ఎదురుగా కూర్చున్నాక —"ఒక ఆడపిల్లను పెళ్ళికాకుండా నీబోటివాడిలా కలుసుకుందుకు వస్తే ఆడామెకు జీవన్మరణ సమస్య—నీక్కాదు—" అన్నాడు మధుసూదన్.

"అయితే మూడీ వుత్తరం చూడండి—" అన్నాడు ప్రవీణ్ తన జేబులోని కాగితాన్నతడి కందిస్తూ.

మధుసూదన్ ఆ ఉత్తరం చదివి—"శివరాజు చచ్చి పోయాడా—నిజంగానా?" అన్నాడు.

"ఏమో—నాకు తెలియదు.... ఈ ఉత్తరం ఓ అర గంట క్రితం చంప నాకు పంపింది-" అన్నాడు ప్రవీణ్.

మధుసూదన్ రిస్టువాచీ చూసుకున్నాడు. టైము రెండు దాటింది.

"చంప తొమ్మిదింటికల్లా నిద్రపోయింది. ఇంతవరకూ లేవలేదు. నువ్వేదో దాస్తున్నావు. మొత్తం జరిగినదంతా చెప్పు...."

"చెప్పడానికేంలేదు. నేనర్జంటుగా చంపను కలుసుకోవాలి...."

మధుసూదన్ విసుగ్గా "శివరాజు నెహ్రూపార్కులో పాము కాటువల్ల చనిపోతే—పోలీసులు నీకోసమెందుకు వెతకాలి?" అన్నాడు.

"ఒక్కసారి చంపను పిలవండి...."

"పిలవను. విషయమంతా నువ్వు నాకు చెప్పాలి...."

ప్రవీణ్ తప్పించుకోవాలని చూశాడు కానీ సాధ్యపడలేదు. చివరికతడు చంప తనను శివరాజును హత్య చేయడానికి ప్రోత్సహించినట్లు చెప్పాడు.

మధుసూదన్ చలించకుండా—"మగాడివి. దానికంటే విచక్షణ వున్నవాడివి. అది చెప్పినట్లల్లా చేస్తే నీ గతే కాదు.... దాని గతేం కాను.... రేపొద్దున్న అది ప్రధాన మంత్రిని హత్య చేయమంటుంది. చేసేస్తావా?" అన్నాడు.

"నేనామె చెప్పినట్లల్లా చేయడంవల్ల నాకు నష్టం. ఆమెకేం నష్టం?" అన్నాడు ప్రవీణ్ ఆశ్చర్యంగా.

"బాగుంది. నేను మీ యిద్దరికీ పెళ్ళి చేయాలనుకుంటున్నాను...."

ప్రవీణ్ ఆశ్చర్యంగా—"కానీ—మీకు లేనివాళ్ళంటే అపనమ్మకం. అసహ్యం. నేను లేనివాడినని మీకు తెలుసు..." అంది.

"ఇలాగని ఎవరు చెప్పారు?"

"చంప ..."

మధుసూదన్ క్షణకాలం ఆశ్చర్యపోయాడు-"చంప నీకు అబద్ధం చెప్పింది—"

"అది దేనికెందుకు చెబుతుంది?"

"ఆమె విజయ్‌ని ప్రేమిస్తుందిలే!"

"విజయ్ ఎవరు?"

"డబ్బున్న ఓ జులాయి వెధవ.... చంపకు వాడంటే ప్రాణం. నాకు వాడంటే అసహ్యం. అందుకే త్వరగా మీ యిద్దరికీ పెళ్ళిచేయాలని నేననుకుంటున్నాను. నువ్వేమో వాడికంటే జులాయిగా తయారై హత్యలకు పాల్పడుతున్నావు. ఇప్పుడు నీకంటే వాడే నయమని పిస్తోంది."

ప్రవీణ్ చటుక్కున—"మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకున్నారు. నేను హత్యచేస్తానని చంపకు చెప్పాను కానీ శివరాజును హత్యచేయాలనుకోలేదు.." అన్నాడు.

"మరేం చేద్దామనుకున్నావు....?"

"అతడినుంచి ఎలాగో బెదిరించి ఓ లక్షరూపాయలు సంపాదించి ఆ డబ్బుమీద వచ్చే వడ్డీతో మీ బ్లాక్ మెయిలింగు ఖర్చు సరిపెట్టాలనుకున్నాను."

"శివరాజంత తెలివితక్కువవాడా?"

"కాదు. కానీ నా తెలివి ఉపయోగించాలను

ఉన్నాను."

"ఏం చేశావు?"

చెప్పాడు ప్రవీణ్.

"అయితే శివరాజా లక్షరూపాయలూ తెచ్చి ఉంటా డంటావా?"

"తెస్తాడని నాకు నమ్మకంలేదు. తెల్లవారుఝామున వెళ్ళి చూడాలనుకున్నాను. ఆ తర్వాత శివరాజాను నమ్మించడానికీ బెదిరించడానికీ—ఇంకా పెద్ద నాటకం తయారుచేసుకున్నాను. కానీ యీలోగానే యీ కబురందింది."

"అయితే శివరాజు అనుకోకుండా పాముకాటుకు గురై వుంటాడు. కానీ పోలీసులు నీకోసమెందుకు వెతుకుతారు? శివరాజు ముందుగా పోలీసులకు చెప్పాడంటావా?" అన్నాడు మధుసూదన్.

"కాను. ఎక్కడో ఏదో మోసం జరిగింది—"

"అంటే?"

"నేను నల్లగులాబి పొదలో పామునుంచుతానని చంపతో చెప్పాను. కానీ నాకలాంటి ఉద్దేశ్యమేంలేదు. అసలు శివరాజలా అక్కడికి వస్తున్నట్లూ, అతణ్ని నేను పాము కాటుద్వారా చంపబోతున్నట్లూ నాకూ, చంపకూ తప్ప ఎవరికీ తెలియదు. నా పథకం మరొకళ్ళకి ఎలా తెలిసింది?" అన్నాడు ప్రవీణ్—"అందుకే అర్జంటుగా చంపను కలుసుకుని మాట్లాడాలను కుంటున్నాను...."

"శివరాజు మరణం విజయ్‌కు లాభిస్తుంది. చంప విజయ్‌ని ప్రేమిస్తోంది. ఇంతే నేను చెప్పగలను...." అన్నాడు మధుసూదన్.

ప్రవీణ్ తెల్లబోయి — "అయితే — చంప నన్ను పోలీసులకప్పగిస్తుందంటారా - నేను నమ్మను..." అన్నాడు.

"ఈ ఉత్తరం నీకు చంప పంపలేదు. బహుశా విజయ్ పంపి ఉండవచ్చు. నీ పథకాన్నుపయోగించుకుని శివరాజు ప్రాణాలు తీసివుండవచ్చు. పోలీసులకు నీ పేరు చెప్పొచ్చు. నువ్విప్పుడు పరారీ అయ్యావంటే నీమీద అనుమానం పెరుగుతుంది. నా మాట విని పోలీసులకు లొంగిపో—" అన్నాడు మధుసూదన్.

ప్రవీణ్ చటుక్కున వంగి మధుసూదన్ పాదాలకు నమస్కరించి— "నాకు మీ ఆశీర్వాదం కావాలి. మీరు చెప్పినట్లే చేస్తాను...." అన్నాడు.

"కళ్యాణమస్తు—" అన్నాడు మధుసూదన్.

# 8

ఇంకా తెల్లవారకుండానే తనింటికి వచ్చిన విజయ్‌ను చూసి తెల్లబోయింది చంప.

అప్పటికి మధుసూదన్ గాఢనిద్రలో వున్నాడు. చంప ముఖం కడుక్కుని కాఫీ తాగుతోంది. వంటాయన విజయ్‌కి కూడా కాఫీ తెచ్చిచ్చాడు.

"అనుకోని ప్రమాదం జరిగింది. ప్రవీణ్ నా ప్రాణం మీదకు తీసుకొచ్చాడు...." అన్నాడు విజయ్.

"ఏం జరిగింది?"

"ప్రవీణ్ పథకాన్ని నేనుపయోగించుకున్నాను. శివరాజు పాము కాటువల్ల మరణించాడు. నేను పోలీసులకు ఫోన్ చేసి ప్రవీణ్ ఒక పాములవాడి దగ్గర పాము కొని—శివరాజును హత్య చేసినట్లు — అజ్ఞాత వ్యక్తిగా చెప్పాను. పాములవాడిచేత తప్పుడు సాక్ష్యం కూడా సిద్ధం చేశాను. ఆ తర్వాత ప్రవీణ్‌ని పారిపొమ్మని

హెచ్చరిస్తూ ఉత్తరం రాశాను. ప్రవీణ్ పారిపోకుండా పోలీసుల్ని కలుసుకున్నాడు. జరిగింది తనకు తెలిసినంత వరకూ యథాతథంగా చెప్పేశాడు...."

"శివరాజు పాము కాటువల్ల చనిపోగానే తృప్తిపడి ఊరుకోక అందులో మళ్ళీ ప్రవీణ్ నెందుకిరికించావు?" అంది చంప కోపంగా.

విజయ్ ఆమెకు శివరాజు స్నేహితుడి గురించి చెప్పి- "హత్య ప్రవీణ్ వల్ల జరిగితే మా కిద్దరికీ ప్రమాద ముండదు. లేకుంటే నేనతన్నెప్పుడో చంపించి వుండే వాణ్ని...." అన్నాడు.

"కానీ ప్రవీణ్ నింగులో ఇరికించడం అన్యాయం.."

"అన్యాయమే కానీ—స్వార్థం కోసం కొన్ని అన్యాయాలు తప్పవు. ఒక ఒరలో రెండు కత్తులిమడవని నీకెప్పుడో చెప్పాను. నువ్వు లేకుండా ప్రవీణ్ ఎలాగూ జీవించలేడు. నీ ప్రియుణ్ని రక్షించడంవల్ల అతడికెంతో తృప్తిగా వుంటుంది."

చంప నిట్టూర్చి—"ఇప్పుడీ సమయంలో ఇలా ఎందుకొచ్చావ్?" అంది.

"నిన్న రోజంతా నేను నీతో ఉన్నట్లు నువ్వు పోలీసులకు చెప్పాలి. మనం కాబోయే దంపతులమని నేను పోలీసులక్కూడా చెబుతాను. నీ సాక్ష్యముంటే నాకు ఎలిబీ ఇవ్వగలదు."

"నీకు ఎలిబీ అంటే—అది ప్రవీణ్ కి ప్రాణాంతకం-అవునా?" అంది చంప తీవ్రంగా.

"అవును ..."

"హంతకుడికి రక్షణ ఇచ్చి—అమాయకుణ్ని శిక్షించ

దానికి నీకు నా సాక్ష్యం కావాలి....అవునా?"

"అవును—"

"ఇది నావల్ల కాదు...."

"నీ సాక్ష్యం లేకపోతే నేను నీకు దక్కను....నిన్నే నమ్ముకున్నాను. నా ప్రాణాలు రక్షించుకో. సతీసావిత్రి పెళ్ళయ్యాక భర్త ప్రాణాలు రక్షించుకుంది. నీవు పెళ్ళికి ముందే భర్త ప్రాణాలు రక్షించుకుని ఆమెకంటే ఓ మెట్టు పైకెక్కు....ఇక నేను నా యింటికి వెడుతున్నాను.... నేను చెప్పింది గుర్తుంచుకో...." ఆ పేసి హడావుడిగా వెళ్ళిపోయాడు విజయ్.

చంప అతడికి వీడ్కోలు కూడా చెప్పలేదు. ఆమె మనసులో తీవ్ర సంచలనం ఆరంభమయింది.

"నేనిప్పుడేం చేయాలి?"

ఆలోచిస్తూ కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకుందామె. అలా ఎంతసేపుందో తనకే తెలియదు. నిద్ర పోతున్నావా—అన్న మధుసూదన్ పలకరింపుతో— ఆమె ఉలిక్కిపడి కళ్ళు తెరిచి—"లేదు బాబాయ్!" అంది.

మధుసూదన్ ఆమె ఎదురుగా కూర్చుని— "నువ్వు చేసిన పనేం బాగోలేదమ్మా—ఒక రాత్రివేళ ప్రవీణ్ వచ్చాడు—" అంటూ జరిగింది చెప్పాడు.

"అంటే అతడికి నేను విజయ్‌ని ప్రేమిస్తున్నానని తెలిసిపోయిందన్నమాట...." అంది చంప.

"నువ్వు విజయ్‌ని ప్రేమించడంలేదు. ప్రేమిస్తున్నాననుకుంటున్నావు—" సవరించాడు మధుసూదన్.

చంప మాట్లాడలేదు.

"ప్రవీణ్‌ని నువ్వే రక్షించాలి. నిన్న రోజంతా

అతడు నీతో నీ ఉన్నట్లు సాక్ష్యమివ్వాలి .... అదే అతడికి తిరుగులేని ఎలిబీ అవుతుంది ...."

"ప్రవీణ్ కి ఎలిబీగా ఉంటే—విజయ్‌ని వదులుకోవడమే అవుతుంది—"

"హంతకుడి ఉరికంబం తగిన శిక్షేకదా!"

"బాబాయ్—శివరాజాను చంపడం నేరమంటావా?"

"మనిషి మనిషిని చంపడం నేరం. శివరాజా మనిషి కాదని నువ్వంటే సరిపోదు. చట్టం ఒప్పుకోవాలి. చట్టాన్ని నిరసిస్తే—అది దేశద్రోహం.... శివరాజాను చంపకముందే విజయ్ దేశద్రోహి...." అన్నాడు మధుసూదన్.

"బాబాయ్—చిన్నప్పట్నించీ నీ చేతుల్లో నన్ను పెంచావు.... కానీ నీ దురదృష్టమో నా దురదృష్టమో! నేను నీ ఆత్మీయత అర్ధం చేసుకోగలను. నిన్నభిమానించగలను. కానీ నీ అభిప్రాయాలు వేరు. నా అభిప్రాయాలు వేరు. ఇది నాకు బాధగానే వుంది. అయినా నిజం!" అంది చంప.

"అయితే ప్రవీణ్ కి ఎలిబీ యివ్వవా?"

"ప్రవీణ్ కిచ్చినా, విజయ్ కిచ్చినా ఎలిబీ యివ్వడమంటే—అబద్ధమే అవుతుంది. అంటే నేను తప్పు చేస్తున్నాను. నువ్వు నన్ను తప్పుకు ప్రోత్సహిస్తున్నావు. తప్పు చేసేటప్పుడు నాకు ప్రయోజనకరంగా ఉండే అబద్ధమెందుకు చెప్పకూడదు?"

"అయితే నీ నిర్ణయమేమిటి?"

"నేను విజయ్ కి ఎలిబీ యిస్తున్నాను...."

"విజయ్ కా?"

"అవును. విజయ్ కే!"

మధుసూదన్ ముఖం ఎర్రబడింది—"అయితే నేను నీ ఎలిబీని ఖండిస్తాను. విజయ్ స్థానంలో ప్రవీణ్ ఉన్నాడంటాను...." అన్నాడతడు.

చంప తెల్లబోయింది.

# 9

కోర్టులో కేసు ప్రవీణ్ కి బలంగా తయారయింది.

ప్రవీణ్ కీ, శివరాజుకీ మధ్య జరిగిన సంభాషణ తను విన్నట్లు శివరాజు పనివాడు చెప్పాడు. ఆ సంభాషణ నిజమేనని ప్రవీణ్ ఒప్పుకున్నాడు.

ప్రవీణ్ కి తనో పెంపుడు పామును వందరూపాయలకు అమ్మినట్లు పాములవాడు సాక్ష్యమిచ్చాడు. ప్రవీణ్ కాదని ఎంతగా ఆక్రోశించినా ఎవరూ పట్టించుకోలేదు. పాములవాడు చెప్పే సమయంలో తను చంపతో పాటు థియేటర్లో ఉన్నట్లతడు చెబితే—చంప—తనూ విజయ్ ఉన్నట్లు చెప్పింది. మధుసూదన్ ఎందుకో ఆమె మాటలు ఖండించలేదు. ఆ విధంగా విజయ్ కు పూర్తి ఎలిబీ వుంది.

ప్రవీణ్ కి ఎలిబీలేదు. అతడు చెబుతున్నదంతా కట్టు కథలాగుంది. కోర్టులో అతడి మాట ఒక్కటీ నిలబడ లేదు.

"నా మాట లెవరూ నమ్మడంలేదు. నాకు శివరాజును చంపాల్సిన అవసరమేమిటి?" అన్నాడు ప్రవీణ్.

"చంపకోసం...." అన్నది ప్రాసిక్యూషన్ లాయర్ జవాబు.

ప్రవీణ్ నిస్సహాయుడైపోయాడు. నిర్వీర్యుడై పోయాడు.

ఆ సమయంలో—ఓ కొత్తసాక్షి పుట్టుకవచ్చింది. ఆమె పేరు చరిత!

ప్రవీణ్ ఆ రోజంతా తనతో గడిపాడనీ—ఆ విషయం పదిమంది ముందరా బైటపెట్టడం అతడికిష్టం లేదనీ ఆమె చెప్పింది.

ఇటీవలే చరితకు వివాహం నిశ్చయమయింది. వరుడామె గత చరిత్రను పూర్తిగా తెలుసుకున్నాకనే వివాహానికి అంగీకరించాడు. అతడిది విశాల హృదయం.

ప్రవీణ్‌ని చరిత స్వంత తమ్ముడికిలా అభిమానిస్తోంది. అతడికీ ఆమెకూ విచిత్ర పరిస్థితుల్లో పరిచయమయింది. మనసు బాగోలేక ఆ రోజతడామె ఇంట్లోనే ఉన్నాడు. ఎంతటి విశాలహృదయుడైనా దీన్ని అపార్థం చేసుకోవచ్చని ప్రవీణ్ విషయం దాచిపెడుతున్నాడు. చంపనైతే తనెలాగూ వివాహం చేసుకుంటాడు కాబట్టి—ఆమెపై ఎటువంటి అపవాదూ ఉండదనుకుని ఆమె పేరు చెబుతున్నాడు. ఒక అమాయకుడి ప్రాణాన్ని ప్రమాదంలో వదిలి పెట్టలేక చరిత తానిప్పుడు ముందుకువచ్చింది.

ప్రాసిక్యూషన్ లాయర్ ఈ సాక్ష్యాన్ని దారుణంగా పరిహసించాడు. అది ప్రవీణ్‌కి సహకరించడం కంటే—చరితకే అవమానకరంగా పరిణమించింది. ఆమె సాక్ష్యాన్ని ప్రవీణ్ కూడా అంగీకరించలేదు.

అప్పుడు మధుసూదన్ బోనెక్కాడు.

“చరితను వివాహం చేసుకోబోతున్నది నేనే! ఇప్పటికీ నేనామె సచ్ఛీలతను నమ్ముతున్నాను. మా ఇద్దరికీ వయోభేదం ఎక్కువే.... కానీ మా పరిచయం వయసూ ఎక్కువే.... ఇంతవరకూ ఆమె జీవితంలో అబద్ధం చెప్పలేదు...”

ప్రాసిక్యూషన్ లాయర్ మధుసూదన్‌ని క్రాస్

ఎగ్జామిన్ చేస్తూ—"మీరు చంప వివాహం విజయ్‌తో కాక ప్రవీణ్‌తో జరగాలనుకుంటున్నారు. అందుకే మీరిప్పుడు సాక్ష్యాలన్నీ సృష్టిస్తున్నారు. మీ సాక్ష్యం నిలబడదు. కానీ ఒక్క విషయం తెలుసుకోవాలనుకుంటున్నాను. మీరు విజయ్‌నెందుకు ద్వేషిస్తున్నారు?" అన్నాడు.

"విజయ్ దేశద్రోహి—" అన్నాడు మధుసూదన్.

"వివాహం చేసుకోకుండా ఓ అవివాహిత యువతితో అక్రమ సంబంధం పెట్టుకున్న మీకు విజయ్‌ని దేశద్రోహి అనే అర్హత వుందా?" అన్నాడు లాయర్.

"దేశద్రోహిని దేశద్రోహి అనడానికి అర్హతుండాలా?"

"అర్హతలేకపోతే—కనీసం సాక్ష్యముండాలి...."

"అయితే వినండి.... నేను చరితను పెళ్ళిచేసుకుందామని కొన్నేళ్ళ క్రితమే అనుకున్నాను. కానీ శివరాజే పెళ్ళికి ఒప్పుకోలేదు..."

"ఎందుకని?"

మధుసూదన్ శివరాజు కథ చెప్పి— "పదిమంది దృష్టిలో—ముఖ్యంగా సమాజంలో నేరాలు చేస్తూ పెద్ద మనుషులుగా చెలామణీ అవుతున్న వారి దృష్టిలో—నేనతడి శత్రువుగా పరిగణించబడాలని అతడి ఉద్దేశ్యం. కానీ అతడి లాకర్ తాళాన్ని దగ్గరుంచుకున్న అసహాయ స్నేహితుణ్ని నేనే! తను బ్రతికుండగా నేనీ విషయం బైటపెడితే నన్నూ, నా ప్రాణానికి ప్రాణంగా పెంచిన చంపనూ కాలరాస్తానని బెదిరించడంవల్ల ఇంత కాలం నోరెత్తలేకపోయాను. ఇప్పుడు నా కారణంగా

విజయ్‌ది మాత్రమే కాదు—ఎందరో పెద్దమనుషుల చరిత్రలు బైటపడతాయి.

విజయ్‌కి హత్యకు మోటివ్ వుంది. అతడు చంపనుపయోగించుకుని శివరాజును తనదారి నుంచి తప్పించాలనుకున్నాడు. పిచ్చి వ్యామోహంలోపడి చంప అతడికి సహకరిస్తోంది. నేను మీ కివ్వగల సాక్ష్యం - ఈ లాకర్ తాళం" — అంటూ ఓ తాళాన్ని లాయరు కందించాడు.

కోర్టులో పెద్ద సంచలనం...

ఆ తర్వాత ప్రవీణ్ బైటపడ్డానికీ—విజయ్‌కి శిక్ష పడ్డానికీ ఎంతో కాలం పట్టలేదు...

"విజయ్‌ని నేను ప్రేమిస్తున్నానని తెలిసీ నాకాకుండా చేసిన ప్రవీణ్ అంటే నేనింకా ఎందుకిష్టపడాలి!" అంది చంప బాబాయితో.

"అదే అతడి గొప్పతనం. అతడికి నిదానముంది. ఆ నిదానం నీ ఆవేశాన్ని సరిచేస్తుంది. నువ్వు హత్య చేయమన్నావు. అతడు నిదానించాడు. నువ్వు విజయ్‌ని తప్పు చేసినా రక్షించాలనుకున్నావు. తెలిసి తెలిసి అలాంటి వాడి బారికి నిన్నొదలడాని కతడిష్టపడలేదు. నీ సుఖం విజయ్ దగ్గర కాదు. ప్రవీణ్ దగ్గరుంది... నీ వతడి ప్రాణాలతో ఆడుకున్నావు. ఇంకా నిన్నతడు ప్రేమిస్తూంటే నువ్వతణ్ణే పెళ్ళి చేసుకో—" అన్నాడు మధుసూదన్.

చంప ప్రవీణ్‌ని కలుసుకుని క్షమించమని అడిగింది.

"నువ్వేం చేసినా భరిస్తాను. నువ్వు నన్ను చంపేస్తానంటే తలవంచుతాను. క్షమించమని మాత్రం అడక్కు. భరించలేను" అన్నాడు ప్రవీణ్.

## 40

చంప అతడి మాటలు విని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఆ ఏడుప్వు ఆమెలోని అడ్వెంచర్ స్పిరిట్‌ని కడిగేసి—సామాన్య యువతిగా మార్చింది. ఆ స్పిరిట్ తప్పుదారి పడితే ఏమవుతుందో విజయ్ ద్వారా ఆమెకు తెలిసింది.

కొంతకాలానికి మధుసూదన్ చరితను వివాహం చేసుకున్నాడు. ఆ దంపతుల ఆధ్వర్యంలో ప్రవీణ్, చంపల వివాహం జరిగింది.

— అయిపోయింది —

# మూడో మనిషి

జి.ఎ. అమరేశ్వరరావ్

కోటీ సెంటర్లో ఆంధ్రా బ్యాంక్ ప్రక్కగా నా కొక పాత పుస్తకాల షాపుంది.

నేను పుస్తకాల్ని కొనడం, అమ్మడమే కాక వీక్లీలు, మంత్లీలు, నవల్స్ అద్దెకు కూడా ఇస్తూ వుంటాను.

ఆసలు మా తాత రోడ్డుపక్కన చిత్తుకాగితాలు పోగుచేసి అమ్ముకుంటూ వుండేవాడట. ఆ తరువాత మా నాన్న పేవ్ మెంటు మీద పాత పుస్తకాల్ని వరస్సగా పేర్చి అమ్ముతూ వుండేవాడు. వాటిల్లో ఎక్కువగా స్కూలు, కాలేజీ పుస్తకాలూ వుండేవి. వాటిని మూడోవంతు రేటుకుకొని అఫ్ రేటుకు అమ్ముతూ వుండేవాడు.

నాకు ఊహ తెల్సేసరికి మా అమ్మ చనిపోయింది. నేను బి.కాం. చివరి సంవత్సరంలో వుండగా మా నాన్న చనిపోయాడు. మా నాన్నకు నన్ను ఐ.ఎ.యస్. చదివించాలని వుండేది. దానికి భిన్నంగా నేను పుస్తకాల

వ్యాపారాన్ని, దొంగతనాన్ని వృత్తిగా స్వీకరించాను.

మా నాన్న చనిపోయేనాటికి మా షాపు ఒక బడ్డీ కొట్లోకి మారింది. నా యాజమాన్యంలో రెండు గదుల షాపు అద్దెకు తీసుకుని వ్యాపారాన్ని విస్తృతి పరిచాను. ఒక స్నేహితుడి సలహామీద పబ్లిక్ టెలిఫోన్‌కి అప్లయ్ చేశాను. నా షాపు మంచి సెంటర్లోవుంది. కాబట్టి అప్లయ్ చేసిన ఆరు నెల్లకల్లా పబ్లిక్ ఫోన్ శాంక్షన్ అయింది.

ఫోన్ వచ్చింతర్వాత నా ఇన్‌కం బాగా పెరిగింది. ఫోన్ చేయడానికి వచ్చినవాళ్ళు ఏదో ఒక పుస్తకాన్ని అద్దెకు తీసుకుంటూ వుండేవాళ్ళు. దగ్గర్లోవున్న ఉమెన్స్ కాలేజీ అమ్మాయిలు కూడా నా షాపులో పుస్తకాలు అద్దెకు తీసుకునేవాళ్ళు. అదే విధంగా ఆంధ్రాబ్యాంక్ ఎంప్లాయీస్ కూడా నా దగ్గర ఖాతా పెట్టారు.

కానీ పుస్తకాలు అద్దెకు ఇవ్వడం, పాతవి అమ్మడం కొనడం మీదవచ్చే లాభం నాకు సంతృప్తికరంగాలేదు. నాకు చాలా కోర్కెలు వున్నాయి. కారూ, ఇల్లూ, కలర్ టి.వి. ఫ్రిజ్, వి.సి ఆర్ కావాలని. అవన్నీ కావాలంటే ప్రస్తుతం వచ్చే ఆదాయం చాలదు. అందుకే దొంగతనాలు మొదలుపెట్టాను.

మా నాన్న పేవ్‌మెంటు స్థాయిలో వున్నప్పుడు ప్రక్కనే సీతారాములు అనే వ్యక్తి చెడిపోయిన తాళాలు బాగుచేయడం, తాళంచెవులు పారేసుకున్నవాళ్ళకు నకిలీ తాళంచెవులు తయారుచేసి ఇవ్వడం చేస్తూవుండేవాడు.

శలవుల్లో వాడిదగ్గర నేను మంచి తర్ఫీదు పొందాను. ప్రస్తుతం నేను ఎలాంటి తాళాన్నయినా ఇట్టే తీసి పారేయగల్ను.

నేను దొంగతనాలు చేయడం మొదలుపెట్టి రెండు సంవత్సరాలయింది. సంవత్సరం క్రితం నేను చేసిన నేరం ఒకటి రుజువుకావడంతో పాత కేడీల లిస్టులోకి చేరి పోయాను. ఒకసారి పాత కేడీల లిస్టులోకి ఎక్కిన తర్వాత సిటీలో ఏ దొంగతనం జరిగినా పోలీసులు పిలుస్తూనే వుంటారు. ప్రస్తుతం నా పరిస్థితి అది.

అయితే ఈ మధ్య నా క్లాస్‌మేట్ రాంబాబు ఎస్సైగా సిటీకి రావడంతో నామీద పోలీసుల వేధింపు తగ్గింది. రాంబాబు పనిచేసే సుల్తాన్ బజార్ పోలీసు స్టేషన్ పరిధిలోకే నేనూ వస్తాను.

ఈ రోజు దాగా వాన కురవడం మూలాన వ్యాపారం ముందకొడిగావుంది. ఎనిమిదిన్నరకల్లా షట్టర్స్ క్రిందకు దించి భుజాన చిన్న ప్లాస్టిక్ బ్యాగ్ వేసుకుని షాపు లోంచి బయటపడ్డాను. ఆ బ్యాగ్‌లో ఈ రోజు రాత్రికి నేను చేయబోయే పనికి అవసరం అయే సామాను వున్నాయ్. ఈమధ్య ఊళ్ళో దొంగలభయం వుండటాన క్యాష్ బాక్స్‌లోని డబ్బంతా ప్యాంటు జేబులో పెట్టు కుని బయలుదేరాను. చిల్లరమాత్రం బాక్స్‌లోనే వదిలే శాను.

చిల్లర మొత్తం కలిపితే పాతికరూపాయలు వుండ వచ్చు. ఎవరన్నా దొంగ వెధవలు షాపు తలుపులు బద్దలు కొట్టి లోపలకు ప్రవేశించి ఖాళీగావున్న క్యాష్‌బ్యాగ్ చూసి కోపంతో షాపు అంతా చిందర వందర చేసే ప్రమాదం వుంది. అందుకని చోర సోదరులకు కోపం రాకుండా వుండేందుకు కాస్తంత చిల్లర వదిలేశాను.

పదినిమిషాల్లో 'సిల్వర్ కాయిన్' బార్ అండ్ రెస్టా రెంట్‌కి చేరుకున్నాను.

ప్రతిరోజూ సిల్వర్ కాయిన్‌లో మందుకొట్టడం నా అలవాటు. సిల్వర్ కాయిన్లో అప్పారావ్ స్టివర్డ్ గా పని చేస్తున్నాడు. ఈ పని చేయకముందు అప్పారావ్ కేబులు కొడుతూవుండేవాడు. ప్రస్తుతం మానేశా నన్నాడు. ఎంతవరకు నిజమో మరి.

టిప్పుగా నేను వాడికి నెలకు ఓ పాతిక రూపాయలు మామూలు క్రింద ఇస్తూవుంటాను. అలా ఇవ్వడంవల్ల మందు ఎక్కువపోసినా బిల్లు తక్కువ వేస్తాడు. నిజానికి అప్పారావ్ గాడు ముందు కౌంటర్లో తను సర్వ్ చేసే మందుకు సంబంధించిన మొత్తాన్ని చెల్లించి కస్టమర్లకు సప్లయ్ చేయాలి. వాడు నాకు ఎక్కువపోసిన మందు తాలూకు బిల్లు బాగా తాగిన వేరే కస్టమర్ నెత్తిన రుద్దుతాడు.

వాడో విషయం చెప్పాడు. మందుకొట్టిన కస్టమర్లు తిట్టినా పైకి నవ్వుతూనే చాలా వినయంగా ఉంటార్ట. కానీ వాళ్ళకు సప్లయ్ చేసే పదార్థాల్ని ఎంగిలి చేస్తార్ట. ఆ విధంగా వాళ్ళమీద కచ్చ తీర్చుకొంటార్ట. అప్పటి దాకా మందు నిషాలో నేను కూడా వాణ్ని తిడుతూ వుండేవాణ్ని. విషయం తెల్సిన తర్వాత వాణ్ని తిట్టడం మానేశాను.

బార్లో ఓ మూల కూర్చొని అప్పారావ్ గాణ్ని ఓ పెగ్గు 'కిడ్డుమాంక్' తెమ్మన్నాను.

వాడు రెండు పెగ్గులు తెచ్చి ఆర్డరివ్వకపోయినా చిప్స్ పొట్లం ప్రక్కన పెట్టాడు. నా కళ్ళు బాగు నాలుగు ప్రక్కలకూ తిరిగిపై. నేను కూర్చున్న టేబుల్ కి రెండు టేబుల్స్ అవతల ఓ బట్టతలవ్యక్తి మందు ఎక్కువై టేబుల్ పైన తల పెట్టి పడిపోయి వున్నాడు.

ఈ చిప్స్‌పొట్లం ప్లస్ ఓ పెద్ద ఓల్డుమాంక్ రేటు ఆ బట్ట తలమీద పడబోతోందన్న మాట. ఎందుకంటే ఆ బట్టతల వాడి టేబుల్‌కు కూడా అప్పారావ్ గారే సర్వ్ చేసేది.

అరగంటకల్లా మందు ఫినిష్ చేసి బయటకొచ్చాను. దొంగతనం చేయాలనుకున్న రోజున నేను ఎక్కువతినను. తిన్నప్పుడు పరిగెత్తాలంటే పొట్ట హెవీగా వుంటుంది. అందుకని (పట్టుబడితే పరిగెత్తాలిగదా!)

రోడ్డుమీదకు వచ్చిన నాకు హఠాత్తుగా ఒక విషయం గుర్తుకు వచ్చింది. నా దగ్గిర బోరిక్ పౌడరు లేదు అని.

ఫింగర్ ప్రింట్స్ పడకుండా దొంగతనం చేసేటప్పుడు చేతులకు 'గ్లవ్స్' తొడుక్కోవటం నాకు అలవాటు. గ్లవ్స్ తేలిగ్గా ఎక్కాలంటే బోరిక్ పౌడరు పూసుకోవాలి.

వెంటనే నేను రోడ్డు క్రాస్ చేసి ఎదురుగా వున్న సర్జికల్ షాపులో ఒక చిన్న ప్యాకెట్ 'బోరిక్ పౌడర్' కొనుక్కొని బ్యాగ్‌లో వేసుకుని, టైం చూసుకున్నాను.

తొమ్మిదిగంటల నలభై నిమిషాలు అవుతోంది.

ఇంకా మూడు గంటలు గడపాలి.

రాయల్లో 'బెన్‌హర్' సినిమా ఆడుతోంది. అది చాలా పెద్ద సినిమా. నాకు కావల్సిందీ అదే. ఈ పాటికి బిగిన్ అయ్యేవుంటుంది.

రిక్షాఎక్కి రాయల్ టాకీస్ దగ్గర దిగి ఏడు రూపాయల టికెట్ ఒకటి కొన్నాను. సినిమా విడుదలయి చాలా రోజులు అవడంవల్ల జనం అంతగా లేరు. ఒక్కొక్కరే వచ్చి టిక్కెట్లుకొంటున్నారు. లోపలికి వెళ్ళి కార్నర్ సీట్లో కూర్చున్నాను. టిక్కెట్లమీద సీట్ల నెంబర్లులేవు. అప్పటికే సినిమా బిగిన్ అయింది.

నా ధ్యాస సినిమామీద లేదు. నిన్న సాయంత్రం నా షాపు ప్రక్కనుంచి తన స్నేహితురాలికి ఫోన్ చేసిన మిసెస్ శంభూప్రసాద్ సంభాషణ గుర్తుకు వచ్చింది.

ఇక్కడ మిసెస్ శంభూప్రసాద్ గురించి కొంత చెప్పాలి. మిసెస్ శంభూప్రసాద్ భర్త పేరు శంభూ ప్రసాద్. మిసెస్ శంభూప్రసాద్ అసలు పేరేంటో నాకు తెలియదు. ప్రతిరోజూ నా దగ్గర పుస్తకాలు అద్దెకు తీసుకుంటుంది. నెలాఖరుకల్లా ఎమౌంటు ఒకేసారి పే చేస్తుంది. ఈ విధంగా నెలపద్దులు పెట్టేవాళ్ళకు ఒక రిజిష్టర్ వుంది. అందులో వాళ్ళు వాళ్ళ పేరు అడ్రస్ వ్రాయాలి.

అడ్రస్ వ్రాయించడంవల్ల రెండు లాభాలున్నాయి. ఎవరన్నా పుస్తకాలు తీసుకువెళ్ళి తిరిగి తెచ్చి ఇవ్వక పోతే అడ్రస్ ప్రకారం వాళ్ళ ఇంటికి వెళ్ళి పుస్తకం తిరిగి తెచ్చుకోవచ్చు. మరొక లాభం ఏంటంటే వాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు ఇంటినిబట్టి వారి వారి ఆర్థిక స్తోమతల్ని అంచనావేసి దొంగతనం చేయవచ్చు. మాటల సందర్భంలో శంభూప్రసాద్ దంపతులకు పిల్లలు ఎవరూ లేరనీ, కొంత ఎమౌంట్ ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో వేసి దానిమీద వచ్చే వడ్డీతో వాళ్ళ కాలం గడుపుతున్నారనీ తెల్సింది.

నిన్న మిసెస్ శంభూప్రసాద్ తన స్నేహితురాలికి నా షాపులోని పబ్లిక్ ఫోన్‌నుంచి ఫోన్ చేసి తనూ తన భర్తా రేపు యాదగిరి గుట్టకు వెళుతున్నామనీ అక్కడ తన చెల్లెలి కూతురు పెళ్ళి జరుగుతూందనీ, మళ్ళా ఎల్లుండి ఉదయానికి తిరిగి వస్తామని చెప్పింది.

అంటే ఈ రోజంతా మిసెస్ శంభూప్రసాద్ ఇంట్లో

నరమానవుడు ఎవడూ వుండడు. నాకిది మంచి ఛాన్సు. రిజిష్టర్లో వ్రాసిన ప్రకారం మిసెస్ శంభూప్రసాద్ ల్లూ ఇసామియా బజారులో వుంది. నేను ఈ రోజు మధ్యాహ్నమే వెళ్ళి ఆ ఇల్లు ఎక్కడుందో చూసి వచ్చాను.

## 2

శంభూప్రసాద్ వాళ్ళ ఇంటి గేట్లు చాలా ఎత్తుగా, బలంగా వున్నాయి. ఎవరూ చూడటంలేదని నిర్ధారణకు వచ్చిన తర్వాత గేటు ఎక్కి లోపలివైపుకు దిగాను.

మిసెస్ శంభూప్రసాద్ వాళ్ళ ఇంటికి తాళం డోర్ కే ఫిక్స్ చేసి వుంటుంది. దాన్ని బయటనుంచీ, లోపల్నుంచీ తీయవచ్చు. డోర్ వేయగానే తాళం ఆటోమేటిగ్గా పడిపోతుంది.

చేతులకు బోరిక్ పౌడరు పూసుకుని గ్లవ్స్ ఎక్కించుకుని బ్యాగ్ లోనుంచి నాకు కావలసిన పరికరాలు బయటకు తీశాను. కార్యక్రమం మొదలుపెట్టేముందు చెవి తలుపులకు ఆనించి లోపల్నుంచి ఏవన్నా శబ్దాలు వినిపిస్తాయేమోనని చూశాను. లోపల ఏలాంటి అలికిడీ లేదు. కాసేపటికి రేడియో చేస్తున్న వింత శబ్దాలు వినిపించాయి. బహుశా శంభూప్రసాద్ దంపతులు రేడియో ఆఫ్ చేయకుండా వెళ్ళి వుండవచ్చు.

కీ హోల్లోకి డూప్లికేట్ తాళంచెవిని పెట్టి మెల్లగా మూవ్ చేశాను. ఇంకా నా చెవి తలుపుకే ఆనించి వుంది. రెండుసార్లు జాగ్రత్తగా ప్రయత్నించిన తర్వాత నా ప్రయత్నం ఫలించింది. తాళం తాలూకు లివర్లు కదులుతున్న శబ్దం వినిపించింది. ఓ 10 సెకండ్ల తర్వాత క్లిక్ మన్న చప్పుడుతో తాళం విడివడింది.

నేను లోపలకు వెళ్ళి తలుపు మూసేశాను. ఆటోమాటిగ్గా లాక్ పడిపోయింది. తలుపుకు తాళంకాక సేఫ్టీ చైన్ కూడా వుంది. దాన్ని నేను గుమ్మానికి వేలాడుతున్న చిన్న తలుపుకున్న హుక్‌కి అమర్చాను.

లోపల అంతా చీకటిగా వుంది. మెల్లిగా తడుముకుంటూ స్విచ్‌బోర్డు దగ్గరికి వెళ్ళాను. దానికి జీరో బల్బు వున్న బెడ్ లాంపు అమర్చి వుంది.

బెడ్ లాంపు క్రిందుగా వున్న స్విచ్‌ని నొక్కిన మరుక్షణం గది అంతా నీలం రంగు కాంతితో నిండిపోయింది. ముందుగా ఇంటి లోపలిభాగాన్ని జాగ్రత్తగా పరిశీలించి ఓ అంచనాకు వచ్చిన తర్వాత నా బ్యాగ్‌లోని పెన్ బ్యాటరీ లైటు వెలుగులో పని పూర్తిచేసుకోవాలని నా ప్లాను.

ఐతే లైటు వెలిగిన మరుక్షణం నేను మ్రాన్పడి పోయాను.

గదిలోని సామాను అంతా చిందర వందరగా పడి వుంది. నేను బెడ్‌రూంలోకి వెళ్ళి చూశాను. అక్కడ కూడా ఇదే పరిస్థితి. వంటగది మాత్రం నీట్‌గా వుంది. పరుపులు, దిండ్లు, సోఫాలు, బ్లేడుతో కోసి వున్నాయి. తల పగిలి బయటకు వచ్చిన మెదడులా వాటిల్లోంచి స్పాంజీ బయటకు తన్నుకు వచ్చింది. షెల్ఫులోని పుస్తకాలు అస్తవ్యస్తంగా పడివున్నాయి. కొన్నిటికి అట్టలు చింపబడి వున్నాయి.

ఓ ప్రక్కన ఫ్లవర్ వాజ్ ముక్కలయి పడి వుంది. కొన్ని సోఫాలు తలక్రిందులు చేయబడి అడుగున వున్న ప్లయివుడ్ పెకిలించబడింది. వాటి లోపల్నుంచి స్ప్రింగులు బయటకు తన్నుకు వచ్చాయి.

నేను బెడ్‌రూంలోనుంచి ముందు హాల్లోకి వచ్చాను. నాకంటే ముందుగానే యెవరో దొంగలు లోపలికి ప్రవేశించారు. దేనికోసమో తూణ్ణంగా వెతికారు. వాళ్ళకు కావల్సింది దొరికిందో లేదో. వాళ్ళు ఇంకా ఇక్కడే యే మూలో దాక్కున్నారేమో అనే అనుమానం వచ్చింది.

ఈ ఆలోచన రాగానే నాకు భలే భయం వేసింది. వాళ్ళు మర్డర్ చేసే టైపు అయితే నా పని ఖాళీ. వెంటనే అక్కడ్నించి బైటపడటం మంచిది అనే ఉద్దేశంతో నేను వాకిలివేపు వెళ్ళాను.

డోర్ తెరవాలంటే ముందుగా నేను అమర్చిన సేఫ్టీ చైనని హుక్‌లో నుంచి బయటకు తీయాలి. హుక్ వరకూ వెళ్ళిన నా చెయ్యి ఠక్కున ఆగిపోయింది.

చైన్ హుక్‌లో లేదు. బయట మామూలుగా వేలాడుతోంది. డోర్ లాగిచూశాను. వేసి వుంది.

నాకు బాగా గుర్తుంది లోపలికి వచ్చేటప్పుడు నేను చైను అమర్చి వచ్చాను. బయటకు వెళ్ళాలంటే చైను తీయక తప్పదు.

ఇప్పుడు చైను మామూలుగా గుమ్మానికి వేలాడుతోంది. అంటే ఆ దొంగ వెధవలు యెవరో చైన్ తీసుకుని బయటకు వెళ్ళిపోయారన్నమాట. అది ఆటోమాటిక్ లాక్ అవడంవల్ల వెళ్తూ వెళ్తూ డోర్ వేసేసి వుంటారు. లాక్ పడిపోయి వుంటుంది.

నేను తిరిగి చైన్ హుక్‌లో బిగించి వెతుకులాటలో పడ్డాను. వాళ్ళు దేనికోసం వెతికివుంటారోనన్న ఉత్కంఠత నాలో పెరిగిపోతోంది. ఎంత వెతికినా నాకు విలు

వయిన వస్తువు ఏదీ కనిపించలేదు. ఇంతలో కాస్త ఆకలిగా అనిపించింది.

కిచెన్‌లోకి వెళ్ళాను. గ్యాస్ స్టవ్ ప్రక్కగా వున్న అల్మారాలో మోడరన్ బ్రెడ్, అడుగున కాస్త మిగిలి వున్న జాం సీసా కనిపించాయి. వాటిని చూడగానే నా ప్రాణం లేచి వచ్చింది. జాం పూసిన బ్రెడ్ అంటే నాకు చాలా ఇష్టం. వెంటనే బ్రెడ్ స్లయిసెస్ మీద జాం బాగా పూసుకొని లాగించడం మొదలు పెట్టాను.

మందుకొట్టినప్పుడు కేవలం చిప్స్‌తో సరిపెట్టుకోవడం వల్ల మొదటి బ్రెడ్ స్లయిస్ మింగగానే ఆకలి విజృంభించింది. నాలుగు ముక్కలు తినగానే జాం అయిపోయింది.

రెండు నిమిషాలు అల్మారాలో వెతికి ఒక ఆవకాయ సీసా బయటకు తీశాను. ఆవపిండి యెక్కువగా వేసి కొత్తగా పెట్టిన ఆవకాయ అనుకుంటా యమా ఘాటుగా వుంది. బ్రెడ్ స్లయిస్ మీద ఆవకాయ కారం వేసుకుని తింటుంటే ముఖంనిండా చమటలు కమ్మాయి.

కాస్త కడుపు నిండింది అనుకున్న తర్వాత కిచెన్‌లో నుంచి బెడ్‌రూంలోకి వచ్చి సిగరెట్లు కాల్చడం మొదలు పెట్టాను. సిగరెట్ నుసిని మంచం ప్రక్కనే వున్న టీపాయ్‌మీద యాష్ట్రేలోకి దులిపాను. వర్సగా మూడు సిగరెట్లు కాల్చిన తర్వాత 'రిలాక్సింగ్'గా అనిపించింది.

పెన్‌టార్చి వెలుగులో బెడ్‌రూంని పరిశీలిస్తున్న నన్ను గోడకు అమర్చిన పెద్ద ఆయిల్ పెయింటింగ్ ఆకర్షించింది. గోల్కొండ కోటను ఎవరో ఆర్టిస్టు ఆయిల్ పెయింట్‌తో చిత్రించాడు. ఎందుకో నాకు ఆ పెయింటింగ్ తీసిచూడాలని అనిపించింది.

వెంటనే మంచం ప్రక్కన వున్న టీపాయ్‌ని పెయింటింగ్ క్రిందుగా గోడ ప్రక్కకు జరిపి, దానిమీద ఎక్కి నిలబడ్డాను. ఇప్పుడు నాకు ఆయిల్ పెయింటింగ్ తేలిగ్గా అందుతోంది. దాన్ని జాగ్రత్తగా క్రిందకు దించాను. నా ఊహ నిజమైంది.

పెయింటింగ్ వెనకాల గోడకు 'కాంబినేషన్ లాక్' వున్న ఒక 'ఐరన్ వాల్ సేఫ్' అమర్చబడివుంది. కాంబినేషన్ లాక్స్‌తో పెద్ద తలనొప్పి. అవి వున్న బీరువాల్ని తెరవడం చాలా కష్టం. కోడ్ నెంబర్ తెలియకపోతే ఆశ వదులుకోవచ్చు.

నా దృష్టిని కాంబినేషన్ లాక్ చుట్టూతా పడ్డ గీతలు ఆకర్షించాయి. అంటే ఇంతకుముందు ఇంట్లోకి జొరబడ్డ దొంగలు మోటుగా కాంబినేషన్ లాక్ తెరవడానికి ఏదన్నా ఇనపరాడ్‌తో ప్రయత్నించి వుంటారు. అయితే క్రిందకు దింపిన పెయింటింగ్ వాళ్ళు తిరిగి గోడకు ఎందుకు అమర్చారో అర్థంకాలేదు.

కాంబినేషన్ లాక్‌కు ఉన్న డయల్‌కు మొత్తం సున్నాతో కలిపి పది అంకెలు వున్నయ్. సాధారణంగా సున్నాతో కానీ, తొమ్మిదితో గానీ మొదటి అంకె ప్రారంభం అవుతుంది అని నా నమ్మకం.

నేను వెంట తెచ్చుకున్న బ్యాగ్ లోనుంచి డాక్టర్లు పేషంట్ల హృదయస్పందన తెలుసుకోవడానికి ఉపయోగించే 'స్టెతస్కోప్' బయటకుతీసి చెవులకు తగిలించుకుని రెండో చివర ఐరన్ సేఫ్ డయల్‌కు ప్రక్కగా ఎడ్‌హెసివ్ టేప్‌తో అతికించేశాను. అలా చేయడంవల్ల రెండు చేతులతోనూ సేఫ్ తెరవడానికి ప్రయత్నం చేయవచ్చు. ఒక చేత్తో స్టెతస్కోప్‌ని పట్టుకునే ప్రయాస

తప్పుతుంది.

నోట్లో పెన్ టార్చి పెట్టుకుని ముందుగా 097897 అనే నెంబర్ తిప్పాను. లోపల లివర్స్ కదుల్తున్న శబ్దం వినిపించలేదు. తర్వాత 907*07 అనే నెంబర్ డయల్ చేశాను. ఫలితం కనిపించలేదు.

అరగంటసేపు ప్రయత్నించిన నాకు వళ్ళంతా చెమటలు పోశాయి.

దీక్షగా పనిచేస్తున్న నాకు ట్రింగ్....ట్రింగ్ అనే శబ్దం వినిపించింది. ఉలిక్కిపడ్డాను. అది కాలింగ్ బెల్ కాదు. టెలిఫోన్ రింగ్ అవుతున్న శబ్దం. నాకు ఇంత వరకు ఆ ఇంట్లో టెలిఫోన్ ఉన్నదనే విషయం తెలీదు. ముందు గదిలో పడివున్న టెలిఫోన్ రెండు నిముషాలసేపు అరిచి నోరు మూసుకుంది.

అప్పటిదాకా చెవియొగ్గి వింటున్న నేను బీరువావైపు తల మరల్చుతుండగా క్రింద పడివున్న ఎరుపురంగు అట్ట ఉన్న పుస్తకం ఒకటి నన్ను ఆకర్షించింది. నేను వంగి దాన్ని చేతుల్లోకి తీసుకున్నాను. అది ఎల్.ఐ.సి. డైరీ.

అప్రయత్నంగా నేను దాని పేజీలు తిప్పి చూశాను. 'పర్సనల్ మెమోరాండం' అనే హెడ్డింగ్ వున్న పేజీలో నేం, ఆఫీస్ అడ్రస్, హోం అడ్రస్, ఫోన్, హైట్, వెయిట్, ఛస్టు, కాలర్, ఐ టి. పర్మినెంట్ ఎకౌంట్ నెంబర్. సి.డి.యస్ ఎకౌంట్ నెంబర్, వెహికల్ పాలసీ నెంబర్....ఇలా రకరకాల సబ్ హెడ్డింగ్స్ వున్నాయ్.

సబ్ హెడ్డింగ్ ముందువున్న ఖాళీలు చాలా వరకు పూర్తి చేయబడి వున్నాయి. 'ఏజన్సీ కోడ్ నెంబర్' అనే సబ్ హెడ్డింగ్ ముందు '0097287823' అనే నెంబర్

చేసి వుంది.

ఎల్.ఐ.సి. ఏజన్సీ కోడ్ నెంబర్ అంత పొడవుగా వుండదు అని నాకు అనిపించింది. ఒక వేళ ఇది ఐరన్ సేఫ్ కాంబినేషన్ లాక్ నెంబరేమో అనే అనుమానం రాగానే డైరీ దగ్గిర పెట్టుకుని నెంబర్ని చూసుకుంటూ డయల్ చేయసాగాను. చివరి అంకె త్రిప్పగానే లాక్ విడిపోయింది.

సేఫ్ తెరిచి చూశాను.

లోపల రకరకాల కాగితాలు, ఉత్తరాలు, బ్యాంకు పాస్ బుక్‌లు వున్నయ్.

నాకు కావలసిన వస్తువుల్ని తీసుకుని సేఫ్ తలుపు వేసేసిం తర్వాత నేను తాగిన మూడు సిగరెట్ల విషయం గుర్తుకు వచ్చింది.

కాల్చిపారేసిన సిగరెట్ పీకల సాయంతో కూడా పోలీసులు నేరస్థుణ్ని పట్టుకుంటారు. నేను సిగరెట్ పీకలకోసం వెతికాను. ఎక్కువ కష్టపడకుండానే కనిపించాయి. వాటిని చేతుల్లోకి తీసుకుని పరిశీలించాను. అవి నేను తాగినవే. నా బ్రాండ్ చార్మినార్. వాటిని జాగ్రత్తగా పొట్లంకట్టుకుని జేబులో వేసుకుని క్రిందకు దించిన పెయింటింగ్‌ను అలాగే వుంచి బెడ్‌రూంలో నుంచి హాల్లోకి నడిచాను.

హాల్లోనుంచి వీధి గుమ్మంవైపు నడుస్తున్న నా కాళ్ళకు ఏదో తగిలింది. దాన్ని పైకి తీసి చూశాను.

అది ప్లాస్టిక్‌తో చేయబడిన పియానో బొమ్మ. దానికి అడుగునవున్న కీ రాడ్ త్రిప్పి కీ ఇస్తే అచ్చం పియానో లాగే మోగుతుంది. దాని మ్యూజిక్ కాసేపు విని, ఒక ప్రక్కన విసిరి తలుపు తీసుకుని బయటపడ్డాను.

మిసెస్ శంభూప్రసాద్ ఇంటినుండి కొంతదూరం నడిచిన నాకు రోడ్డు మధ్యలో 'మ్యాన్ హోల్' ఒకటి కనిపించింది. జేబులోనుంచి సిగిరెట్ పీకలు ఉన్న కాగితపు పొట్లాన్ని బయటకు దీసి మ్యాన్ హోల్లోకి వదిలాను. మ్యాన్ హోల్లోంచి మురుగునీరు తాలూకు దుర్గంధం ముక్కు పుటాల్ని బద్దలు చేస్తోంది.

ఇప్పుడు నేను వెళ్ళేది ఫెర్నాండెజ్ ఇంటికి. అతను విక్రం ఎపార్ట్ మెంట్స్‌లో ఫస్టుఫ్లోర్లో వున్న 108 వ నెంబర్ ఫ్లాట్ లో వుంటున్నాడు.

ఫెర్నాండెజ్ ముత్యాల వర్తకంతో పాటు దొంగ సామాన్లను కొనడం కూడా చేస్తూ వుంటాడు.

# 3

ఫెర్నాండెజ్ కి 65 సంవత్సరాల వయస్సుంటుంది. దొంగిలించిన కళాఖండాలు, పాత స్టాంపులు, పురాతన నాణేలు, బంగారం, వెండి వంటి లోహపు వస్తువులు మొదలయినవి ఎక్కువగా కొంటూ వుంటాడు.

తరతరాల్నించీ ఫెర్నాండెజ్ కుటుంబం ముత్యాల వర్తకం చేస్తూ వుండేవాళ్ళట. ప్రస్తుతం ఫెర్నాండెజ్ తన పూర్వీకులకంటే ఓ మెట్టు పైకి వెళ్ళి దొంగ వ్యాపారం కూడా చేస్తూ నాలుగు చేతులా సంపాదిస్తున్నాడు.

నేను కానీ, మరొక దొంగ వెధవ ఎవరన్నా గానీ ఫెర్నాండెజ్ దగ్గరకు వెళ్ళడానికి ఒక ముఖ్యమైన కారణం వుంది. అతడు చేసేది దొంగ వ్యాపారమైనా చాలా నిజాయితీతో చేస్తాడు. ఒకోసారి ఏదన్నా కళాఖండం దొంగిలించినప్పుడు నిజానికి దాని రేటు ఎంత వుంటుందో తెలిసిచావదు. ఫెర్నాండెజ్ ప్రస్తుతం

మార్కెట్లో దాని రేంజి ఎంతవుందో చెప్పి అందులో సగం డబ్బు నిజాయితీగా ఇచ్చేస్తాడు.

ఫెర్నాండజ్‌కి ఒక కొడుకూ, ఒక కూతురూ ఉన్నారట. కొడుకు అమెరికాలోనూ, కూతురు బ్రిటన్లోనూ వారి వారి భార్యాభర్తలతో స్థిరపడిపోయారట. ఇతను మాత్రం ఇక్కడే ముత్యాలు అమ్మి, దొంగవస్తువులు కొని అక్షలకు లక్షలు సంపాదిస్తున్నాడు.

నేను ఫెర్నాండజ్ ఫ్లాట్‌కు వెళ్ళేసరికి పది నిమిషాలు తక్కువ మూడు అయింది. ఎంత రాత్రివేళ వెళ్ళినా ఫెర్నాండజ్ విసుక్కోడు. డబ్బు అతని విసుగుదలని అణిచివేస్తుంది. ఆ విషయం నాకు తెల్సు.

తను లోపలికి వెళ్ళి కూర్చోగానే 'ఎక్స్‌ప్రెస్సో' మిషన్‌నుంచి పొగలుకక్కే వేడి వేడి కాఫీ తయారుచేసి ఇచ్చాడు. ఒక్కొక్క గుక్క లోపలికి వెళ్తుంటే ఎంతో 'రిలాక్సింగ్'గావుంది. కాఫీ తాగడం పూర్తయిందాకా అతను ఏం మాట్లాడలేదు.

నేను కాఫీ కప్పు టేబుల్‌మీద పెట్టి నా బ్యాగ్ లోంచి మూడు చిన్న ప్లాస్టిక్ డబ్బాలు బైటికి తీశాను. ఒక్కొక్క బాక్సు 10 సెం. మీటర్ల పొడవు 6 సెం. మీటర్ల వెడల్పు 4 సెంటీమీటర్ల ఎత్తువుంది.

ఫెర్నాండజ్ ఒక్కొక్కదాన్ని తెరిచి చూడసాగాడు.

మొదటి ప్లాస్టిక్ బాక్సులోపల రాయల్ బ్లూరంగులో వున్న మఖ్‌మల్ గుడ్డ లైనింగ్ చేయబడివుంది. దాని మీద ఆడవాళ్ళు చెవికి తగిలించుకునే లోలాకులు ఎరుపు రంగు రాళ్ళతో మిలమిలా మెరుస్తున్నయ్.

'మెజెంటా' కలర్ మఖ్‌మల్ గుడ్డతో లైనింగ్

చేయబడిన రెండో బాక్సునుంచి లేడీస్ రిస్టువాచీ ఒకటి బయటకు తీశాడు ఫెర్నాండెజ్. పూర్తిగా బంగారంతో చేయబడినదాన్ని నిశితంగా చూస్తూ "టైమెంతయింది?" అని అడిగాడు.

"మూడూ పది" అని నా వాచీవంక చూసి చెప్పాను. నేను శంభూప్రసాద్ వాళ్ళ ఇంట్లో బీరువాలోనుంచి దాన్ని బయటకు తీయగానే నా వాచీ చూసుకుని దాని టైం ఫిక్స్ చేశాను.

"వాచీ బాగానే పనిచేస్తుంది" అని ప్రక్కన పెట్టాడు.

మూడో ప్లాస్టిక్ బాక్స లోపల లైనింగ్ లాంటిది ఏదీ లేదు. గడ్డతో కట్టిన చిన్న పార్శిల్ వుంది. ఫెర్నాండెజ్ ముడి విప్పి చూశాడు. లోపల బ్రౌన్ రంగు కాగితం మడతల మధ్య ఓ నాణెం వుంది. బొటనవేలితోనూ చూపుడు వేలితోనూ దాని చివర్లన జాగ్రత్తగా పట్టుకుని రెండు క్షణాలు పరిశీలించిన ఫెర్నాండెజ్ ముఖంలో ఆశ్చర్యం చోటు చేసుకుంది.

ఆయన తలెత్తి "దీన్ని గురించి నీకు తెల్సా?" అని అడిగాడు.

సమాధానంగా తల అడ్డంగా ఊపాను.

ఇది 'ద హోలీ ఫైవ్‌లో ఒకటి' అన్నాడు.

నేను అర్థంకానట్లు చూశాను.

వెంటనే ఫెర్నాండెజ్ ఈ విధంగా అన్నాడు. "నీకు దీని విలువ అర్థంకావాలంటే, దీన్ని గురించిన హిస్టరీ కొంత చెప్పాలి. ఈ నాణెం రెండు ప్రక్కలా నిర్యాణం పొందుతున్న బుద్ధుని బొమ్మా. ఆయనకు నీడనిస్తున్న ఛత్రమూ ఉన్నాయి. రెండో ప్రక్కన కూడా

అదేరకపు బొమ్మ వుంది చూడు" అని నాణేన్ని నా చేతికి ఇచ్చాడు.

ఫెర్నాండెజ్ చెప్పినట్లు రెండు ప్రక్కలా నాణేనికి బుద్ధునిబొమ్మ వుంది. నేను దాన్ని మా ఇద్దరిమధ్యా బల్ల మీద పెట్టాను. మొత్తానికి ఈ నాణెం ఎంతో విలువైంది అన్నమాట. ఓ 5, 6 వేల రూపాయల వరకూ బేరం పలకవచ్చు అనుకుని హుషారుగా ఫెర్నాండెజ్ వైపు చెప్పమన్నట్లు చూశాను.

ఫెర్నాండెజ్ గొంతు నిశ్శబ్ద వాతావరణంలో సాఫీగా సాగిపోయింది.

"మనదేశంలో బౌద్ధమతం మంచి ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు అనేక బౌద్ధ ఆశ్రమాలు వెలిశాయి. ఆ ఆశ్రమాలనే ఆరామాలు అనేవాళ్ళు. అలాంటి ఆరామాల్లో 'అమరారామం' ఒకటి. ఈ అమరారామం గుంటూరు జిల్లాలో వుంది. ప్రస్తుతం ఆ ఊర్ని 'అమరావతి' అని పిలుస్తున్నారు జనం. అమరారామంలో బౌద్ధులు సాంచీలోని స్తూపం లాంటి ఒక స్తూపాన్ని నిర్మించారు. అరగోళాకారంగా వుండే ఆ స్తూపం చుట్టూతా బుద్ధుడికి సంబంధించిన జీవిత విశేషాల్ని చెక్కిన శిల్పాల్ని అమర్చారు." అని నా వంక శ్రద్ధగా వింటున్నానో లేదో చూశాడు.

కాస్త బోరుగావున్నా శ్రద్ధగా వింటున్నట్లు ముఖం పెట్టి కూర్చున్నాను. నా ముఖం చూసిన ఫెర్నాండెజ్ ముఖంలో తృప్తి కనపడింది. ఆయన ఇలా కొనసాగించాడు.

"బుద్ధుడు చనిపోయినప్పుడు ఆయన అస్థికలను చిన్న, చిన్న బంగారపు భరిణెల్లో వేశారు. వాటితోపాటు ప్రస్తుతం నువ్వు దొంగతనం చేసిన నాణెంలాంటి

ఒక్కొక్క నాణేన్ని కూడా అస్థికలతో కలిపి ఓ ఏక శిలా స్తంభంలో తాపడం చేసి స్తూపంలో అమర్చారు. బౌద్ధులు బుద్ధుడి అస్థికలు ఉంచిన స్తూపాన్ని ఆరాధిస్తూ వుండేవాళ్ళు.

ఆ తర్వాత కాలక్రమంలో బౌద్ధమతం అంతరించి శైవం విజృంభించింది. శైవమతం ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు అమరావతి నగరాన్ని పాలించిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు అంతకు ముందే కట్టబడివున్న అమరేశ్వరాలయాన్ని పునర్నిర్మింపచేశాడట. బౌద్ధమతం లాగానే బౌద్ధస్తూపం కూడా ఛిన్నాభిన్నమయింది.

స్తూపం శిథిలమయిన తర్వాత చుట్టుప్రక్కల వుండే ప్రజలు అనేక శిల్పాల్ని ఎత్తుకువెళ్ళి పగలగొట్టి పొడిగా చేసి వాకిళ్ళముందు ముగ్గులు వేసుకునేవాళ్ళు. ఆ విధంగా కొన్ని వేల అమూల్యశిల్పసంపద నాశనం అయింది.

బ్రిటీషర్స్ మనదేశాన్ని పాలించి చేసిన మంచి పనుల్లో మిగిలివున్న అమరావతి శిల్పాల్ని జాగ్రత్తపరచటం ఒకటి. అప్పటి ఆర్కియాలజీ డిపార్టుమెంటువాళ్ళు జరిపిన త్రవ్వకాలలో బుద్ధుడి అస్థికలు వుంచిన ఏకశిలా స్తంభంలోని కొంతభాగం బయటపడింది. స్తూపం శిథిలం అయినప్పుడు ఈ ఏకశిలా స్తంభం కూడా పగిలిపోయింది.

దొరికిన స్తంభపు ముక్కల్లోనుంచి బుద్ధుడి అస్థికలు వుంచిన ఒక భరిణెను వెలికి తీశారు. ఆ తర్వాత మరొక స్తంభపు ముక్క బైటపడింది. అందులో కూడా మరొక అస్థికల పేటిక వుంది.

[illegible] చారిత్రక పరిశోధకులు ఇలాంటి అస్థికల పేటికలు రెండు వుండటానికి వీలులేదు. ఒకటిగానీ, మూడుగానీ,

ఐదు గానీ వుండాలన్నారు. త్రవ్వకాలు ముమ్మరంగా సాగాయి. మరో మూడు అస్థికలుంచిన పేటికలు దొరికాయి. అంటే మొత్తం ఐదు పేటికలన్న మాట.

ఆ అయిదు పేటికలలో ఉన్న అస్థికలతో పాటు ఐదు బంగారు నాణాలుకూడా దొరికాయి. ఆ కాలంలో బుద్ధుడి జీవితానికి సంబంధించిన ఘటనలతో, అనేక నాణేలు వచ్చాయి. కానీ బుద్ధుడు మరణిస్తుండగా ఆయనకు నీడనిస్తున్న ఛత్రం బొమ్మవున్న నాణేలు ఇవి మాత్రమే.

ప్రస్తుతం ఈ ఐదింటిలో ఒకటి అమరావతి మ్యూజియంలోనూ, రెండు మద్రాస్ మ్యూజియంలోనూ, ఒకటి లండన్ మ్యూజియంలోనూ వున్నాయి. ఐదోది మాత్రం అప్పటి త్రవ్వకాల సమయంలో ఆఫీసర్ గా పనిచేసిన ఒక ఆంగ్లేయుడు తనతో పాటు బ్రిటిన్ తీసుకుపోయాడు. అది మాత్రం 'ప్రైవేటు కలెక్షన్' క్రింద ఉండి పోయింది.

బుద్ధుడి అస్థికలతో పాటు ఉంచబడిన ప్రత్యేక నాణాలు కనుక వీటికి 'ద హోలీ ఫైవ్' అనే మాట వచ్చింది.... మన దగ్గిర వున్న ఈ నాణెం విలువ ఎంత వుంటుందో తెల్సా?" అని అడిగాడు.

నేను తల అడ్డంగా ఊపాను.

"దీన్ని కరిగించేసి అమ్మితే రెండు, మూడు వేల రూపాయలకు మించిరావు. కానీ దీన్ని ఈ విధంగానే అమ్మితే యాభైలక్షల నుంచి తొంభైలక్షలవరకూ రేటు పలుకుతుంది" అన్నాడు ఫెర్నాండెజ్.

నా గుండె క్షణకాలం ఆగి తిరిగి కొట్టుకోసాగింది. నాకు కలర్ టి.వి, ఫ్రిజ్, వి.సి.ఆర్, కాయగుర్తు

వచ్చాయి. నా స్వీట్ డ్రీం నిజం కాబోతోంది.

"తొంభై లక్షలే" అన్నాను ఆశ్చర్యంగా.

"తొంభై కాదు యాభైనుంచి తొంభైలక్షల వరకు రేటు పలకవచ్చు" అన్నాడు ఫెర్నాండెజ్.

"ఐతే ఓ పని చెయ్యి! యాభైకి తొంభైకి యావరేజ్ కడదాం. యాభైప్లస్ తొంభై నూటనలభై లక్షలు. అందులో సగం 70 లక్షలు. అంటే సాధారణంగా దీని విల 70 దగ్గర వుంటుంది అనుకుందాం. సగం నువ్వు తీసుకుని 85 లక్షలు నాకు ఇయ్యి" అన్నాన్నేను.

"ప్రస్తుతం నా దగ్గర మూడు లక్షలకు మించిలేవు. అయినా దీన్ని ఎక్స్రే తీసి చూడాలి." అని ఫెర్నాండెజ్ ఏవో కూడికలూ తీసి వేతలూ చేసి,

"రిస్టువాచీకి రెండువేలా అయిదొందల డెబ్భైఅయిదు రూపాయల యాభై రెండు పైసలు, లోలాకులకు పదిహేను వందల డెబ్భైనాలుగురూపాయల మూడు పైసలు, ఈ కాయన్ కి మూడు లక్షలు. మొత్తం కలిపి మూడు లక్షల నాల్గువేల నూట నలభైతొమ్మిది రూపాయల యాభైఅయిదు పైసలు ఇస్తా. ఇష్టం వుంటే తీసుకో!" అన్నాడు. డెబ్భైలక్షల విలువచేసే కాయన్ని మూడు లక్షలకు ఇవ్వడం నాకు ఏ మాత్రం ఇష్టంలేదు.

"మూడు లక్షలు ఇవ్వడం మరీ అన్యాయం. మరో ముప్ఫైరెండు లక్షలు పెంచు." అన్నాను.

"ఐతే లోలాకులకు పదిహేను వందల డెబ్భైనాల్గు రూపాయల యాభై రెండు పైసలు, రిస్టువాచీకి రెండువేల అయిదొందల డెబ్భైఅయిదు రూపాయల యాభై రెండు పైసలు పుచ్చుకోవడం నీ కిష్టమేగా?" అని అడిగాడు.

"వాటి రేటు బాగానే వుంది. కానీ ఈ కాయన్

విషయమే" అన్నాను.

ఫెర్నాండజ్ నాకు ఈ క్రింది మూడు విషయాలు చెప్పి "ఏదో ఒకటి చేయడానికి నిర్ణయించుకో" అన్నాడు.

1. దాన్ని (నాణేన్ని) ఎవరికీ అమ్మకుండా పెట్టెలో పెట్టుకుని, అప్పుడప్పుడు తీసి చూసుకుంటూ, మురిసి పోతూ వుండటం.

2. ఇంకేం ఆర్గ్యూ చేయకుండా అతను ఇచ్చే మూడు లక్షల నాల్గువేల నూట నలభైతొమ్మిది రూపాయల యాభై అయిదు పైసలు తీసుకుని వెళ్ళడం. ఇక ఆ కాయిన్ గురించి మాట్లాడకూడదు.

3. దాన్ని కొన్నాళ్ళు ఫెర్నాండజ్ దగ్గరే వుంచాలి. ఫెర్నాడజ్ మంచి రేటుకు దాన్ని అమ్మతాడు. ఆ వచ్చిందాంట్లో సగం పుచ్చుకోవడం.

నేను కాసేపు ఆలోచించి "ఆ కాయిన్ ఎవరికన్నా అమ్మడానికి ఎంతకాలం పడుతుంది?" అని అడిగాను.

"రేపొద్దున, ఎల్లుండి, పది సంవత్సరాల తర్వాత ఎప్పుడంటే ఏం చెప్పేది?" అన్నాడు.

నేను ఫెర్నాండజ్ చెప్పిన మూడో పాయింట్ అమలు జరపడానికి నిర్ణయించుకున్నాను. అదే విషయం ఫెర్నాండజ్‌తో చెప్పాను.

ఫెర్నాండజ్ వెంటనే లోపలకు వెళ్ళి నోట్లకట్టలతో కొంత చిల్లరతో తిరిగివచ్చి లోలాకులకు, రిస్టువాచీకి నాలుగువేల నూట నలభైతొమ్మిది రూపాయల యాభై ఐదు పైసలు లెక్క పెట్టి ఇస్తూ—

"ఈ లోలాకులు నువ్వు చెప్పే సుబ్బలక్ష్మికి ఇవ్వరాడటోయ్" అన్నాడు.

దొంగ సామాన్లు కొనేవాడయినా ఫెర్నాండజ్ కొన్ని కొన్ని మంచి ఐడియాలు ఇస్తూ వుంటాడు. వాటిల్లో ఇదొక ఐడియా.

సుబ్బలక్ష్మి ఒకప్పుడు నేను చదివే కాలేజీలోనే బి.ఏ. చదివేది. ప్రస్తుతం నాకు ప్రియురాలు. రేపు నా కాబోయే భార్య. సుబ్బలక్ష్మిలో ప్రత్యేకంగా కనిపించేవి విశాలమైన ఆమె కళ్ళు.

ఫెర్నాండజ్ నా భుజాలు పట్టుకుని కదిపాడు. నేను సుబ్బలక్ష్మి 'ట్రాన్స్'లోంచి ఇహంలోకి వచ్చాను.

"ఓకే! అలాగే కానీ లోలాకులు సుబ్బలక్ష్మికి ఇస్తాను" అని ఫెర్నాండజ్ ఇచ్చిన డబ్బులోనుంచి ఒక వెయ్యి అయిదువందల డెభ్భై నాలుగు రూపాయల మూడు పైసలు తిరిగి ఇచ్చివేశాను.

బేరం సెటిల్ అయినట్లుగా 'కాయిన్'ని ఫెర్నాండజ్ చేతిలోకి తీసుకుని లేచి నిలబడ్డాడు. నాకు ఫెర్నాండజ్ మీద పూర్తి నమ్మకం వుంది.

నేను ఆయనకు షేక్‌హాండ్ ఇచ్చి బయటకు నడిచాను. రాత్రంతా మేలుకోవడంవల్ల కళ్ళు మంటగా వున్నాయ్. వెళ్ళిన వెంటనే వేడినీళ్ళ స్నానంచేసి రెస్టు తీసుకోవాలి.

## 4

సుబ్బలక్ష్మి నేనూ ఒకే కాలేజీలో చదవడంవల్ల మేమిద్దరమూ ప్రేమించుకోవడానికి అవకాశం ఏర్పడింది. సుబ్బలక్ష్మి చెప్పేవరకు ఆమె ఇంగ్లీష్ టైపు లోయరూ, హయ్యరూ, షార్టుహాండ్ లోయరూ, హయ్యరూ పాసయిందని నాకు తెలియదు. సుబ్బలక్ష్మి రాంనగర్లో వాళ్ళ బామ్మతో వుంటుంది. సుబ్బలక్ష్మికి ఆ ముసలమ్మ తప్ప

నా అనేవాళ్ళు ఎవరూ లేరు.

ప్రస్తుతం సుబ్బలక్ష్మి ఎటు జడ్ ఎక్స్‌పోర్ట్స్ అండ్ ఇంపోర్ట్స్‌లో స్టెనోగా పనిచేస్తుంది. ఎటు జడ్ వాళ్ళ ఆఫీసు ఇంద్రజాల్ ఎపార్టుమెంట్స్‌లో వుంది. ఇంద్రజాల్ ఎపార్టుమెంట్స్ బిల్డింగ్ కోటీలో వున్న మెడికల్ కాలేజీ ఎదురుగ్గా వుంది. అక్కడనుంచి నా షాపుకు 5 నిమిషాల్లో రావచ్చు.

నేను మొదటిసారి పోలీసులకు పట్టుబడ్డప్పుడు పేపర్‌లోపడ్డ నా పాస్‌పోర్టు సైజు ఫోటో చూసి నా 'బ్లాక్ పర్సనాలిటీ' గురించి తెలుసుకుందిట. ఆ రోజు ఏడుస్తూ వచ్చి కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఇకపై దొంగతనాలు చేయనని తలపై చేయి వేయించుకుని ఒట్టు పెట్టించుకుంది. ఆ పిచ్చి మొహంది నేను నిజంగా ఒట్టు వేశానని నమ్మింది. ఒట్టు వేసిన వెంటనే దాన్ని మనస్సులో గట్టుమీద పెట్టిన విషయం సుబ్బలక్ష్మికి తెలియదు.

ప్రతిరోజూ లంచ్ అవర్‌లో సుబ్బలక్ష్మి నాకు ఏదో ఒకటి తెస్తూంటుంది. ఒంటి గంటనుంచి రెండు గంటల వరకూ సుబ్బలక్ష్మి వాళ్ళకు లంచ్ అవర్. నేను మాత్రం లంచ్ అవర్లాంటిది ఏదీ పెట్టుకోలేదు. నాకు యెప్పుడు ఆకలి వేస్తే అప్పుడే లంచ్ అవర్.

మధ్యాహ్నం ఒకటిపదికల్లా సుబ్బలక్ష్మి టిఫిన్ బాక్స్‌తో నా దగ్గరకు వచ్చింది. నేను షాపు షట్టరు సగానికి దించి లోపలి గదిలోకి వెళ్ళి గాజు గ్లాసుతో నీళ్ళు ఎరేంజ్ చేశాను. నా దగ్గర రెండు గ్లాసులు లేవు. ఒకటే గ్లాసు వుంది.

సుబ్బలక్ష్మి లోపలికి రాగానే మెరుపులా ఆమె

ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని పెదాలమీద ముద్దు పెట్టుకున్నాను. అంతటితో ఆగకుండా నుదుటిమీదా, కళ్ళమీదా, బుగ్గలమీదా, టపటపా ముద్దులు పెట్టుకున్నాను. ఆ అనుభూతి చెప్పడానికి వీల్లేని విధంగా, హాయిగా వుంది. నాలో ఆవేశం తెరలు తెరలుగా ఉప్పొంగుతూ కట్టలు తెంచుకుంటోంది.

“ఔనూ! నీ షాపులోకి కొత్త పుస్తకాలు ఏం వచ్చాయి?” అని అడిగింది.

ఇలాంటి రసవత్తర ఘట్టంలో సుబ్బలక్ష్మి నుంచి అలాంటి రెస్పాన్స్ రావడంతో నాకు ఆవేశం చప్పగా చల్లారిపోయింది.

సుబ్బలక్ష్మి యెప్పుడూ అంతే. మాంచి మూడ్‌లో వున్నప్పుడు తన అసందర్భ ప్రేలాపనలో నీళ్ళు కుమ్మరించేస్తుంది. దాంతో చప్పగా అయిపోతాను.

చీర కుచ్చిళ్ళమీద చేయి వేసినప్పుడు అభ్యంతరం చెప్పదు, కానీ ఆఫీసులో తనకు రావాల్సిన ఇంక్రిమెంటు గురించో, ప్రమోషన్ గురించో మాట్లాడుతుంది. వీపు మీద చేతులు వేసి దగ్గరకు తీసుకుని జాకెట్ లోనుంచి వెళ్ళిపోనిచ్చి బ్రా హుక్స్ తప్పించే సమయంలో వాళ్ళ బామ్మ కాశీయాత్ర గురించీ మాట్లాడుతుంది. లేదా ఇందాకట్లాగా షాపులోకి వచ్చిన కొత్త పుస్తకాల గురించో, తను చదివిన విషాదగీతం గురించో చెప్తుంది.

ఒకసారి మేము ఇందిరా పార్కుకి వెళ్ళినపుడు నేను సుబ్బలక్ష్మి అసందర్భపు డైలాగుల గురించి అడిగాను. అలా అడిగినప్పుడు సుబ్బలక్ష్మి తెల్లరంగు అర్గండీ చీరలో వుంది. నా తల ఆమె వళ్ళో వుంది. నేను అడిగిన ప్రశ్నకు సుబ్బలక్ష్మి కిలకిలా నవ్వి “మన పెళ్ళి అయిన

తర్వాత శోభనం రోజున నేను చెప్పకుండానే మీకు అర్థం ఔతుంది" అన్నది.

పెళ్ళి అయేవరకూ, ఆ తర్వాత శోభనం రాత్రి పూర్తి అయేవరకూ ఈ అసందర్భపు డైలాగుల సన్నివన్ను భరించక తప్పదు.

"ఈ రోజు ఇడ్లీ అల్లం పచ్చడి తెచ్చాను" అంది సుబ్బలక్ష్మి. అల్లం పచ్చడి అంటే నాకు ప్రాణం అని సుబ్బలక్ష్మికి తెలుసు.

నేను వెంటనే ఆమె తెచ్చిన టిఫిన్ బాక్స్ మూత ఓపెన్ చేశాను. లోపల అరడజను ఇడ్లీలతోపాటు అల్లం పచ్చడీ ఓ చిన్న స్టీలు గిన్నెలో పేర్చియ్యా వున్నాయ్.

సుబ్బులు ఇడ్లీ ముక్క తుంచి నెయ్యిలో ముంచి ఆ తర్వాత అల్లం పచ్చడి అద్ది నా నోటికి అందించింది.

తినడం పూర్తయ్యాక సుబ్బలక్ష్మి తన పమిటి కొంగుతో నా మూతి తుడుస్తూ, "ఆ మీసాలు కాస్త తగ్గించు బాబూ! గుచ్చుకుంటున్నై" అంది.

నేను నవ్వుతూ జేబులోంచి లోలాకులు బయటకు తీసి సుబ్బలక్ష్మి చేతిలో పెట్టాను.

వాటిని చూసిన ఆమె ముఖం కాంతితో నిండిపోయింది. వెంటనే అనుమానంగా నా వంక చూసింది. తను యెందుకు అలా చూసిందో నాకు తెల్సు. నా మనస్సులో ముల్లు గుచ్చుకున్నట్లయింది.

ముఖంమీద కృత్రిమంగా నవ్వు పులుముకుని "అనేక వందల పాత పుస్తకాల అమ్మకం తాలూకు వచ్చిన లాభంతో అవి కొన్నాను" అన్నాను.

సుబ్బలక్ష్మి నేను ఇచ్చిన లోలాకులు పెట్టుకోవడానికి తన చెవికి వున్న రోల్డుగోల్డు రింగులు తీస్తుండగా బయట వట్టర్ మీద యెవరో కర్రతో కొడుతున్న శబ్దం వినిపించింది.

నేను గబగబా వట్టర్ క్రిందనుంచి బయటకు వెళ్ళాను. అక్కడ ఫోర్ట్వంటీ నిలబడి వున్నాడు. అతని చేతిలో లాఠి వుంది.

"రాంబాబు సారు అర్జంటుగా స్టేషనుకి రమ్మన్నాడు" అన్నాడు.

"ఇప్పుడే వస్తా పద" అన్నాను.

ఫోర్ట్వంటీ వెళ్ళి పోగానే తిరిగి లోపలికి వెళ్ళాను.

సుబ్బలక్ష్మి చెవిరింగులు అలాగే వున్నాయ్. నేను ఇచ్చిన లోలాకులు తిరిగి నా చేతిలో విసురుగా పెట్టి బైటకు వెళ్ళిపోయింది. తను ఫోర్ట్వంటీగాడు చెప్పిన విషయాన్ని విన్నదన్న మాట.

ఆ సమయంలో సుబ్బలక్ష్మిని మాట్లాడించే ధైర్యం నాలో లేదు. అది నిజంగా దొంగిలించినది కాకుండా వుంటే ఫ్రీగా అర్థ్యాచేసి వుండేవాడ్నేమో. కానీ నా ఆత్మ నన్ను నిలదీస్తూనే వుంటుంది. బాధపడి ఈ ఆత్మ అన్నది లేకుండా వుంటే యెంతో చక్కగా వుండేది. ప్రతి రోజూ పది అడుగులు వేసిన తరువాత వెనక్కి చూసే సుబ్బులు ఈ రోజు తల త్రిప్పకుండా వెళ్ళి పోయింది.

నేను షాపు తాత్కాలికంగా కట్టేసి పోలీస్ స్టేషన్కి వెళ్ళేసరికి రాంబాబు మంచి వేడిమీద వున్నాడు. అంతకుముందే యెవడో కేబులుకొట్టే బాధపని లాకప్ లో

చేసి బాదినట్లున్నాడు.

నేను తన కళ్ళపడిన వెంటనే సూటిగా అడిగాడు.

"ఈ సామియా బజార్‌లోని ఓ ఇంట్లో దొంగతనం జరిగింది. పార్వతమ్మ అనే స్త్రీ నెత్తిమీద దొంగతనం చేసినవాళ్ళు బలమయిన ఆయుధంతో కొట్టడంవల్ల అక్కడికక్కడే మరణించింది. పార్వతమ్మ భర్త శంభూ ప్రసాద్ ఈ రోజు ఉదయం రిపోర్టు ఇచ్చాడు. సాయంత్రం 4 గంటలకు పాత కేడీల్ని అందర్నీ పిలుస్తున్నాం. నువ్వు కూడా రావాలి. ఆయనకు తన భార్యను హత్య చేసిన వాళ్ళ ముఖం గుర్తు వుందట. ఇక నువ్వు వెళ్ళొచ్చు" అన్నాడు.

హత్య అనేమాట వినగానే నాకు వెన్నులోనుంచి చలి పుట్టుకొచ్చింది. రోడ్డుమీద నడుస్తూ ఆలోచిస్తున్నాను.

రాత్రి నేను వెళ్ళేసరికి ఎవరో దొంగతనానికి ప్రయత్నం చేశారు. నేను లోపలకు వెళ్ళినప్పుడు వాళ్ళు అక్కడే వున్నారు. ఆ తర్వాత కొంతసేపటికి నేను వచ్చిన దారిగుండానే వాళ్ళుబయటకు వెళ్ళిపోయారు.

నేను దొంగతనానికి మిసెస్ శంభూప్రసాద్ ఇంటికి వెళ్ళినప్పుడు అక్కడ మిసెస్ శంభూప్రసాద్ శవం లేదు. అంటే నేను నా పని పూర్తిచేసుకుని బయటకు వెళ్ళిన తర్వాత శంభూప్రసాద్ దంపతులు ఏ తెల్లవారు ఝామునో ఇంటికి తిరిగి వచ్చి వుంటారు. వాళ్ళు వచ్చినప్పుడు దొంగతనానికి వెళ్ళిన మూడో బ్యాచ్ చేతిలో మిసెస్ శంభూప్రసాద్ మరణించింది.

ఐతే ఇక్కడ నాకు మరొక్క అనుమానం వచ్చింది. దొంగలు ఎప్పుడూ తెల్లవారు ఝామున దొంగతనానికి

బయల్దేరరు. నా పని పూర్తి అయేసరికి 8 గంటలయింది కనుక ఆ వెధవలు తెల్లవారుఝామున వచ్చి వుంటారు. నేను వెళ్ళడానికీ, శంభూప్రసాద్ వాళ్ళు, ఆ తర్వాత మూడో పార్టీ దొంగలు రావడానికీ నిమిషాల తేడా మాత్రమే వుండి వుంటుంది. వాళ్ళెవరో తెల్లవారు ఝామున దొంగతనానికి బయల్దేరారు అంటే వాళ్ళకు శంభూప్రసాద్ దంపతుల యాదగిరిగుట్ట ప్రయాణం గురించి తెలిసే వుంటుంది.

అంతేకాక నాకు ముందూ, నాకు తర్వాత వచ్చిన బ్యాచెస్‌కి మిసెస్ శంభూప్రసాద్ వాళ్ళ ఇంట్లో హాలీ ఫైవ్‌లోని ఒక కాయిన్ వుంది అనే విషయం తెల్సి ఉండే అవకాశం వుంది. నేను దొంగతనానికి వెళ్ళి నప్పటి ఇంటి సీను గుర్తుకు వచ్చింది. దిళ్ళు సోఫాలు అన్నీ బ్లేడ్లతో కోసి ఉన్నాయ్. అంటే వాళ్ళు దేని కోసమో వెదికారన్నమాట.

ఆలోచనల్తో నా బుర్ర వేడెక్కింది. నేను నా పాత పుస్తకాల షాపుకి చేరుకుని వ్యాపారంలో పడి పోయాను.

'మూడు గంటల నలభై నిమిషాలప్పుడు స్టేషన్‌కి వెళ్ళే ముందు క్యాష్ బాక్స్ సర్దుతున్న నాకు మడతల పెట్టిన కాగితం ఒకటి కనిపించింది. నేను దాన్ని విప్పదీసి చూశాను. అది నేను బోరిక్ పౌడర్ కొన్నప్పుడు షాపు వాళ్ళు ఇచ్చిన బిల్లు.

ఆ బిల్లు చూసిన వెంటనే నాకు గ్లవ్ జెన్ గుర్తుకు వచ్చాయి. అవి తొడుక్కోవడంవల్ల మిసెస్ శంభూ ప్రసాద్ ఇంట్లో ఎక్కడా నా వేలిముద్రలు పడలేదు. లేకపోతే ఆ హత్యా నేరం నామీదకు వచ్చి వుండేది.

నేను ఫెర్నాండెజ్ ఇంటినుంచి వచ్చేటప్పుడు లోలాకులు వుంచిన ప్లాస్టిక్ బాక్సును నా బ్యాగ్‌లో పడేసి డబ్బులు చొక్కా జేబులో పెట్టుకున్నాను. లోలాకుల బాక్సు పెట్టడానికి బ్యాగ్ తెరిచినప్పుడు అందులో గ్లవ్ జెస్ చూసిన గుర్తులేదు.

నేను వెంటనే పుస్తకాల ర్యాక్ వెనక దాచిన బ్యాగ్ బయటకుతీసి వెనక గదిలోకి వెళ్ళి చూశాను. నా గుండె ఝల్లుమంది. బ్యాగ్‌లో గ్లవ్ జెస్ లేవు. అవి శంభూప్రసాద్ ఇంట్లోగానీ, ఇంటి పరిసరాల్లోగానీ పడివుంటే నా పని ఔట్. ఉరిశిక్ష తప్పదు.

రాంబాబుగాడు క్లాస్ మేట్ అయినా సీట్లో కూర్చుంటే పక్కా పోలీసులా ప్రవర్తిస్తాడు. నాకు ఏం చేయాలో పాలుపోలేదు.

టైం చూసుకున్నాను. నాలుగు గంటలు కావస్తూంది. ఆ శంభూప్రసాద్ గాడికి గానీ, ఈ పోలీసు నాయాళ్ళకి గానీ నేను పారేసుకున్న గ్లవ్ జెస్ దొరికేలోపలే నేను వాటిని సంపాదించాలి ముందు శంభూప్రసాద్ ఇంటికి వెళ్ళి వాటర్ వర్క్స్ వాడిలాగానో, ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు వాడిగానో పరిచయం చేసుకుని సాధ్యం అయినంతవరకు వెతకాలి. లేకపోతే ఈ రోజు రాత్రి వాడి ఇంటిని మరొకసారి జాగ్రత్తగా విజిట్ చేసి పోగొట్టుకున్న గ్లవ్ జెస్‌ను తిరిగి రాబట్టాలి.

షాపు కట్టేసిన నేను నాలుగూ పదిహేను నిమిషాల కల్లా పోలీస్ స్టేషన్‌లో వున్నాను. అక్కడ రాంబాబు ఎదురుగ్గా యాభై ఆయిదేళ్ళ వ్యక్తి ఒకతను కూర్చుని వున్నాడు. అతని ముఖంలో విషాదం కనిపిస్తోంది. ఆ వ్యక్తి శంభూప్రసాద్ అయివుండవచ్చు అనుకున్నాను.

నేను వెళ్ళేసరికే చాలామంది రౌడీవాయాళ్ళని పరీక్షించడం అయిపోయింది. ఇంకా ముగ్గురు మిగిలారు. నేను నాలుగోవాణ్ని చివరివాణ్ని.

ఎస్సై రాంబాబు ఒక్కొక్క వ్యక్తికి ఎడం చేతికి రబ్బర్ గ్లవ్ జెప్ తొడిగిచూస్తున్నాడు. శంభూప్రసాద్ వాళ్ళ ముఖం వంక చూసి తల అడ్డంగా ఊపుతున్నాడు.

నేను ఊహించినంతా అయింది. వాళ్ళకు నేను పారేసుకున్న గ్లవ్ జెస్ దొరికాయి. నా వంతు రాగానే కళ్ళు మూసుకుని చెయ్యి అందించాను. కాని గ్లవ్ జ్ నా చేతికి పట్టలేదు.

రాంబాబు ముసలాయన్ని నా ముఖాన్ని జాగ్రత్తగా చూడమని చెప్పాడు. శంభూ పసాద్ నా వంక చూసి, టేబుల్ మీద రూళ్ళకర్ర తీసుకుని నా చేతికిచ్చి, తన నెత్తిమీద మెల్లగా కొట్టమన్నాడు.

నేను ఆయన చొక్కా కాలర్ పట్టుకొని నెత్తిమీద కొట్టాను మెల్లిగా. అప్పుడు గమనించాను. శంభూప్రసాద్ తలకు కుడివైపున చిన్న బ్యాండేజ్ వుంది.

నేను అలా కొట్టగానే శంభూప్రసాద్ రాంబాబు వైపు చూసి తల అడ్డంగా ఊపాడు.

"ఇక నువ్వు వెళ్ళవచ్చు! కానీ పిల్చినపుడు వచ్చి కనిపిస్తూ వుండు" అన్నాడు.

నేను బ్రతుకుజీవుడా అనుకుంటూ అక్కణ్నించి వచ్చేశాను.

రోడ్డుపక్కనున్న పాన్ షాపు దగ్గర సిగరెట్లకోసం ఆగి ప్యాంటుజేబులో చేయిదూర్చిన నాకు పుట్టలో చుట్ట చుట్టుకున్న పాములా మెత్తగా చల్లగా తగిలింది. వెంటనే గ్రహించేశాను. అ తగిలింది గ్లవ్ జెస్.

# 5

మర్నాడు పేపర్‌లో రెండు హత్యలకు సంబంధించిన వార్తలు నన్ను ఆకర్షించాయి.

నా వ్యాపారం ఫీల్డులు. మార్కెట్లు నకల్సుతో జరుగుతుంది. అంతే తప్ప డైలీ పేపర్లకూ నా బిజినెస్‌కూ ఏమాత్రం సంబంధం లేదు. నాకోసం మాత్రం యేదో ఒక డైలీ పేపరు ప్రతిరోజూ కొనుక్కుంటాను.

రోజూ ఉదయాన్నే హోటల్‌కి వెళ్ళి టిఫిన్ చేసి, కాఫీతాగి పేపర్ కొని చదువుకుంటూ వస్తాను. నేను డైలీ పేపర్‌లో ముందుగా క్రయిం వార్తలు చదువుతాను. స్టూడెంట్సయితే సినిమా ఎడ్వర్టైజ్‌మెంట్స్, చివరి పేజీలో వేసే క్రీడారంగ వార్తలు చదువుతారు. వ్యాపారులు మార్కెట్టు వస్తువుల ధరలు చూసుకుంటారు. ఇక రేసులు ఆడేవాళ్ళు గెలుపు గుర్రాల గురించి చదివి వదిలేస్తారు. అదేవిధంగా నేను క్రయిం వార్తలు చదువుతాను.

ఈ రోజు నన్ను ఆకర్షించిన హత్యా వార్తల్లో మొదటిది మిసెస్ శంభూప్రసాద్ గురించిన వార్త. అది ఇలా వుంది.

"గృహిణి హత్య!"

హైద్రాబాద్, ఆగస్టు 17;

ఈ రోజు తెల్లవారుఝామున పార్వతమ్మ అనే గృహిణిని గుర్తు తెలియని వ్యక్తులు తలపై కొట్టగా ఆమె అక్కడికక్కడే మరణించింది. పార్వతమ్మ భర్త శంభూప్రసాద్ ఒక ప్రయివేటు కంపెనీలో సూపర్వైజర్ గా పనిచేసి రిటైర్ అయ్యారు.

శంభూప్రసాద్ దంపతులు బంధువుల పెళ్ళి నిమిత్తం

దగ్గరలోని యాదగిరిగుట్టకు వెళ్ళి నేటి తెల్లవారుజామున తిరిగి వచ్చారు. అప్పటికే లోపలికి ప్రవేశించిన దొంగలు ముందుగా లోపలికి వచ్చిన పార్వతమ్మ నెత్తిమీద బలంగా కొట్టడంతో ఆమె అక్కడికక్కడే మరణించింది.

అడ్డు వెళ్ళిన శంభూప్రసాద్ కూడా దొంగల చేతుల్లో దెబ్బలు తిని స్పృహ కోల్పోయాడు. ఆ తర్వాత గంట సేపటికి ఆయనకు స్పృహ వొచ్చి పోలీసులకు రిపోర్టు ఇచ్చాడు.

ఐరన్ సేఫ్‌లో దాచిన 10 వేల రూపాయలను దొంగలు దోచుకుపోయినట్లు శంభూ ప్రసాద్ చెప్పారు. సుల్తాన్ బజార్ పోలీస్ స్టేషన్ సబ్ ఇన్‌స్పెక్టర్ రాంబాబు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

వార్తతోపాటు చనిపోయిన పార్వతమ్మ ఫోటో కూడా పేపరు వాళ్ళు ప్రచురించారు.

పార్వతమ్మ ఎడమవైపున్న కణతకు బలమైన దెబ్బ తగిలింది. తలమీద రక్తం మడుగు కట్టింది. కణతమీద తగలడంవల్ల ఆమె ప్రాణం వెంటనే పోయివుంటుంది. ప్రాణం పోయిన తర్వాత కూడా కళ్ళు తెరిచేవున్న పార్వతమ్మ శవం భయం పుట్టిస్తోంది.

నన్ను విపరీతంగా ఆకర్షించి ఆశ్చర్యంలో ముంచి పెద్ద షాక్ ఇచ్చిన వార్త కూడా హత్యకు సంబంధించినదే. అది ఇలా వుంది.

"ప్రముఖ ముత్యాల వర్తకుడు ఫెర్నాండజ్
దారుణ హత్య!"

హైద్రాబాదు, ఆగస్టు 18:

ప్రముఖ ముత్యాల వర్తకుడు నగర వర్తకుల సంఘం

అధ్యక్షులు అయిన శ్రీ జార్జి ఫెర్నాండెజ్‌ను ఈ రోజా రొమకగో అతిదారుణంగా కత్తితో పొడిచి చంపేశారు. హతుడి శరీరంనుంచి విపరీతంగా రక్తం ప్రవించడంవల్ల మరణం సంభవించింది. మొట్టమొదటగా హతుడి శవాన్ని కిటికీనుంచి చూసిన పనిమనిషి తెలియచేయగా పోలీసులు రంగంలోకి దిగారు.

హతుడు శ్రీ ఫెర్నాండెజ్ కుటుంబం వాళ్ళు తర తరాల్నించీ ముత్యాల వర్తకం చేస్తున్నారు. శ్రీ ఫెర్నాండెజ్ భార్య గత సంవత్సరమే మరణించింది. ఆయన పిల్లలు ఇద్దరూ విదేశాల్లో వుంటున్నారు. ఇన్‌స్పెక్టర్ నరేంద్ర కేసు దర్యాప్తు చేస్తున్నారు.

ఫెర్నాండెజ్ హత్యా వార్తతో పాటు అతని ఫోటో కూడా పబ్లిష్ అయింది. ఈ పేపర్ వాళ్ళ క్రయింరిపోర్టర్ మంచి ఘటికుడిలా వున్నాడు. ప్రతి క్రయిం వార్తకూ ఒక ఫోటో తప్పనిసరిగా వుంటోంది.

ఫెర్నాండెజ్ ఫోటో చాలా భయంకరంగా వుంది. ఆయన మొన్న నేను చూసిన దుస్తుల్లోనే వున్నాడు. ఛాతీమీద గొంతుమీద దాదాపు యెనిమిది కత్తిపోట్లు వున్నై. పొట్టలో ప్రక్కగా కత్తి దూసుకుపోయినప్పుడు ఏర్పడిన గాటు స్పష్టంగా కన్పిస్తోంది. కత్తిపోట్లు జరిగేటప్పుడు చెయ్యి అడ్డుపెట్టాడనుకుంటా కుడి అరచేతికి అరంగుళం లోతుకు పైగా గాయం అయింది.

వెల్లకిలా వున్న ఫెర్నాండెజ్ మూతికి అతికించబడి వున్న ప్లాస్టర్ నన్ను ఆకర్షించింది. ఆయన అరవకుండా మూతికి ప్లాస్టర్ వేసివుంటారు. ఫెర్నాండెజ్ ఎడం చేతిలో పగిలిపోయిన ఫ్లవర్ వాజ్ తాలూకు కొంత భాగం పట్టుకుని వున్నాడు. జరిగిన ఘర్షణలో హంతకుడి

నెత్తిమీదో, మరెక్కడన్నానో దాంతో బాదివుంటాడు.

నేను ఆలోచించుకుంటూ షాపు దగ్గరకు చేరుకున్నాను. షట్టర్ పూర్తిగా తెరవకుండా లోపలి గదిలోకి వెళ్ళి చాపపై వెల్లకిలా పడుకుని పరిస్థితి అంచనా వేయసాగాను.

శంభూప్రసాద్ ఇంట్లోకి నేను ప్రవేశించినప్పుడు ఆల్రెడీ అక్కడ దొంగతనం జరిగింది. నేను లోపలకు వెళ్ళగానే అక్కడున్న దొంగ లేదా దొంగలు బయటకు దాటుకున్నారు. నా పని పూర్తి చేసుకుని వెళ్ళిపోయిన తర్వాత శంభూప్రసాద్ దంపతులు యాదగిరిగుట్టనుంచి వచ్చి వుంటారు నేను వెళ్ళడానికి శంభూ వాళ్ళు రావడానికి మధ్యగల టైములో మూడోసారి శంభూప్రసాద్ ఇంట్లో దొంగతనానికి ప్రయత్నం జరిగింది.

దొంగలు లేదా దొంగ లోపలకు ప్రవేశించిన తర్వాత శంభూప్రసాద్ దంపతులు వచ్చినట్లు పేపర్లో వుంది. అప్పుడు జరిగిన ఘర్షణలో పార్వతమ్మ మరణించింది. నాకు ముందూ, నా తర్వాత వచ్చిన దొంగలకు ఆ నాణెం గురించి తెల్సా?

నా తల వేడెక్కింది. ఎందుకనో శంభూప్రసాద్ పోలీసులకు 'ఆ కాయిన్' విషయం చెప్పినట్లు పేపర్లో లేదు.

శంభూప్రసాద్ విషయం అలా వదిలేసి. ఫెర్నాండెజ్ గురించి ఆలోచించడం మొదలుపెట్టాను.

నేను ఫెర్నాండెజ్‌ను చూసివచ్చిన 24 గంటల్లో అతని హత్య జరిగింది. నేను వెళ్ళిన రెండుచోట్లా ఇద్దరు మరణించారు. పోలీసులకు ఇవి వేరు వేరు హత్యలుగా

కనిపించవచ్చు గానీ వీటి రెంటికీ మధ్య కనెక్షన్ వుంది. ఆ కనెక్షన్ 'హార్లీరాయన్.' ప్లన్ నేను.

ఫెర్నాండెజ్ ఆ రాయన్ గురించి చెప్తూ 50 నుండి 90 లక్షలవరకూ రేటు పలకవచ్చు అన్నాడు. అంత రేటు పలికే వస్తువుకోసం యెవరయినా దొంగతనం చేయడానికి గానీ చంపడానికి గానీ తప్పక ప్రయత్నం చేస్తారు.

ప్రస్తుతం ఆ రాయన్ ఫెర్నాండెజ్ దగ్గిర వుందో లేక దాన్ని ఆ హంతకుడు కొట్టేశాడో తెలియదు. శంభూప్రసాద్ హార్లీరాయన్ గురించి రిపోర్టు ఇవ్వక పోవడం నాకు యెంతో ఆశ్చర్యం అనిపించింది.

ఒకసారి ఫెర్నాండెజ్ ఫ్లాట్ కు వెళ్ళి వెతికి చూడాలి. పోలీసులు ఫెర్నాండెజ్ ఫ్లాట్ కి సీలు వేసి వుంటారు. ఎలాగోలా లోపలికి వెళ్ళి హార్లీరాయన్ గురించి వెత కాలి.

ఈ రెండో హత్య అబిడ్స్ పోలీస్ స్టేషన్ పరిధిలోకి వస్తుంది. వీళ్ళు కూడా నన్ను ఇంటరాగేట్ చేయడానికి పిలుస్తారు. ఫెర్నాండెజ్ హత్య జరిగిన రోజు నేను యెక్కడికీ వెళ్ళలేదు. షాపులోనే ఉన్నాను అంటే నమ్మరు. నేను ఫలానా పర్టిక్యులర్ ప్లేస్‌లో హత్య జరిగిన రోజు రాత్రంతా గడిపినట్లు సాక్ష్యం సృష్టించు కోవాలి.

నాకు సుబ్బలక్ష్మి గుర్తుకు వచ్చింది. వెంటనే బయ ల్దేరాను.

ఉదయాన్నే వాళ్ళింటికి వెళ్ళిన నన్ను చూసి సుబ్బ లక్ష్మి ఆశ్చర్యపోయింది.

నేను చాలా 'కేర్'గా సుబ్బలక్ష్మి ఇంటికి వెళ్తు

టాను. సుబ్బలక్ష్మి వాళ్ళ బామ్మ వారంక్రితమే కాశీ యాత్రకు వెళ్ళిందట. నేను అలా వెళ్ళడంవల్ల తనకు చాలా ఇబ్బంది. చుట్టుప్రక్కల వాళ్ళు తనను ఏదో వింత జంతువును చూసినట్లు చూస్తారు. తర్వాత వాళ్ళు ఏదో ఒక కామెంట్ చేసే అవకాశం కూడా వుంది.

అయినా తప్పదు కనుక సుబ్బలక్ష్మి దగ్గరకు వెళ్ళి జరిగిందంతా దాచకుండా చెప్పాను. తనమీద ఒట్టు వేసిన తర్వాత మళ్ళీ దొంగతనం చేస్తాను అని ఊహించి వుండదు.

విషయం పూర్తిగా విన్న సుబ్బలక్ష్మి నన్ను నానా మాటలూ అంది. భద్రకాళిలా ఇంత కళ్ళు చేసుకుని చీవాట్లు పెడుతున్నా సుబ్బలక్ష్మిని ఏమీ అనలేక పోయాను. తన తనివిదీరా నన్ను తిట్టిన తర్వాత "ఏం చేయమంటావో చెప్పు!" అంది.

"పద్దెనిమిదో తారీకు, అంటే హత్య జరిగినరోజు రాత్రి, అంటే నిన్న రాత్రి అంతా నేను నీతో గడిపినట్లు సాక్ష్యం చెప్పాలి" అన్నాను.

ఈ మాట అన్న వెంటనే సుబ్బలక్ష్మి ముఖం ఎర్రగా కందిపోయింది. తను మనస్సులో ఏం అనుకుందో నేను ఊహించుకోగలను.

"పోలీసులకు ఆ రోజంతా నువ్వు నీ షాపులోనే వున్నట్లు చెప్తా" అంది సుబ్బలక్ష్మి.

తన అమాయకత్వానికి నాకు నవ్వు వచ్చింది.

"పోలీసులు అలా చెప్తే నమ్మరు. వాళ్ళకు సాక్ష్యం కావాలి. అంటే హత్య జరిగిన రాత్రి అంతా ఫలానా చోట వున్నట్లు ఎవరన్నా చెప్పాలి. ఈ లోకంలో నాకు 'నా' అనేవాళ్ళు నువ్వు తప్ప ఎవరున్నారు చెప్పు

సుబ్బలక్ష్మి. అందుకే....” అని ఆగిపోయాను.

సుబ్బలక్ష్మిమీద నా మాటలు పనిచేశాయని ఆమె ముఖకవళికలే చెప్తున్నాయ్. నేను మరో అస్త్రాన్ని ఆమె మీదకు సంధించి వదిలాను.

“పోలీసులకు అనుమానం వస్తే ఉరిశిక్ష వేయించడానికి కూడా వెనుకాడరు....” నా గొంతు కొంచెం వణికించాను.

సుకుమారంగా వున్న ఆమె చేతిని నా నోటిమీదకు చేర్చి “ఇక అలాంటి మాటలు మాట్లాడకు” అంది. ఆమె చెయ్యి నా నోటిమీద అలా వుండగానే.

“ఐతే పోలీసులకు సాక్ష్యం చెప్తావా” అన్నాను. చెయ్యి అడ్డుగా వుండటంవల్ల నేను మాట్లాడిన మాటలు యేవో వింత శబ్దాల రూపంలో బయటకు వచ్చాయి.

వెంటనే సుబ్బలక్ష్మి “నీ కోసం యేమైనా చేస్తాను” అంది.

నేను ఆనందం పట్టలేక తనను కావలించుకుని ఓ ముద్దు పెట్టుకున్నాను.

మనస్సులో మాత్రం అనవసరంగా ఈ పిల్లను ఇందులోకి ఇరికిస్తున్నాను, ముందు ముందు ఏమవుతుందో అనిపించింది.

## 6

సుబ్బలక్ష్మి దగ్గిర్నుంచి తిరిగి వచ్చిన నేను షాపు తెరిచి పుస్తకాలకు క్లిప్పులు తగిలించి వరసగా ప్రేలాడదీయసాగాను. డేట్ ఎక్స్పైర్ అయిపోయిన మ్యాగజైన్లను బొత్తిగా పేర్చి తాడుతో కట్టగా కట్టి వెనక గదిలో పడేసి వచ్చాను.

రిజిష్టర్ తెరిచి కష్టమర్ల నుంచి రావాల్సిన పుస్త

కాలు, డబ్బు గురించి లెక్క చూసుకుంటుండగా ఫోన్ మోగింది. నా షాపులో వున్న పబ్లిక్ ఫోన్ నెంబర్ చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. చాలా దగ్గిర అనుకున్న వాళ్ళకి మాత్రమే నెంబరు ఇచ్చాను.

ఫోన్ అందుకుని రిసీవర్ చెవికి ఆనించుకున్నాను. అవతల్నించి ఒక అపరిచిత కంఠం నా గురించి అడిగింది.

"మాట్లాడుతున్నాను" అన్నాను.

"చూడు బ్రదర్! శంభూప్రసాద్ ఇంట్లోని వాల్ సేఫ్ నుంచి దొంగతనం చేసిన హోలీకాయిన్ కావాలి" అన్నాడు అపరిచిత వ్యక్తి.

నాకు ఆశ్చర్యం వేసింది. శంభూప్రసాద్ భార్యను హత్య చేసిన మూడో వ్యక్తి ఇతనేనేమో అనే అనుమానం కూడా వేసింది.

"ఏంటీ మాట్లాడటం లేదు. ఇంకా ఆశ్చర్యంలోంచి తేరుకోలేదా? రేటు యెంతో చెప్పు. ఎంతయినా ఫర్వా లేదు" అవతలి వ్యక్తి చాలా నింపాదిగా మాట్లాడుతున్నాడు.

వీడు యెవడయితే నాకేం. ఇది మంచి అవకాశం. దీన్ని వదులుకోకూడదు. ఆ వ్యక్తికి నా గురించి ఎలా తెల్సిందో అనవసరం. ముందు నాకు కావలసింది డబ్బు. అది వుంటే నా కలలు నిజమవుతై. అదృష్టం అనేక సార్లు తలుపు తట్టదు. ఒకేసారి మన ముంగిట్లోకి వస్తుందట. కాని నా విషయంలో రెండోసారి తలుపు తట్టింది. ఈ ఆఫర్ ని కాదనకూడదు. ఫెర్నాండెజ్ కి ఇచ్చిన ఆ కాయిన్ ని శోధించి తీరాలి. నేను స్థిర నిర్ణయానికి వచ్చాను.

"నిన్ను ఎక్కడ కలవాలి? మనం నేరం మాట్లాడు

కోవాలి గదా?" అన్నాను.

"ఈ రోజు సాయంత్రం కలుద్దామా?"

ఆ కాయిన్ ని సాధించాలంటే నాకు టైం కావాలి. చకచకా ఆలోచించాను.

"వద్దు ఈ రోజు నాకు పని వుంది. రేపు సాయంత్రం కలుద్దాం."

"ఓ.. కే! ఎప్పుడు ఎక్కడ ఎన్ని గంటలకు కలవాలి? నువ్వు కలవబోయే వ్యక్తి ఎలా వుంటాడు?? మొదలయిన వన్నీ మరోసారి ఫోన్ చేసి చెప్తాను."

'క్లిక్'మన్న శబ్దంతో మా ఇద్దరి మధ్య కనెక్షన్ కట్ అయింది. అవతలి వ్యక్తి నా సమాధానంకోసం చూడకుండానే ఫోన్ పెట్టేశాడు.

ఈ ఫోన్ కాల్ వచ్చిం దగ్గిర్నుంచీ ఎప్పుడు ఫెర్నాండజ్ ఫ్లాట్ కి వెళ్దామా, ఎప్పుడు చీకటి పడుతుందా? అని చూస్తూనే వున్నాను. నా మనస్సు మనస్సులో లేదు.

షాపుకు వచ్చిన కస్టమర్లకు యాంత్రికంగా పుస్తకాలు అందిస్తూ వాళ్ళ పేర్లు రిజిస్టర్ లోకి ఎక్కిస్తున్నాను.

పదకొండు గంటల నలభై అయిదు నిమిషాలు అవుతుండగా నా షాపుముందు ఇద్దరు కాన్ స్టేబుల్స్ సైకిళ్ళు దిగారు. నేను వాళ్ళని చూడగానే గ్రహించాను వాళ్ళు అబిడ్స్ పోలీస్ స్టేషన్ నుంచి వస్తున్నారు అని. ఫెర్నాండజ్ ఉండే అపార్టుమెంట్స్ అబిడ్స్ పోలీస్ స్టేషన్ పరిధిలోకి వస్తుంది. పాతకేడీల లిస్టులో వుంటే ఈ తిప్పలు తప్పవు.

నేను ఊహించింది నిజమైంది.

# 7

ఎస్సై నరేంద్రది మంచి భారీ విగ్రహం. ఆరడుగుల రెండు అంగుళాల ఎత్తుతో, దట్టంగా పెరిగిన బుర్ర మీసాలతో కేడీ నాయాళ్ళకు గుండెల్లో దడ పుట్టిస్తూ వుంటాడు.

నేను ఆబిడ్స్ పోలీస్ స్టేషనుకి వెళ్ళగానే మనస్సులో ఇష్టంలేకపోయినా నరేంద్రకు నమస్కారం పెట్టాను రెండు చేతులూ జోడించి. అప్పటికే కొంతమందిని ఇంటరాగేట్ చేయడం పూర్తి అయింది.

"చదువుకొన్న దొంగవి నువ్వేనా?" అన్నాడు నరేంద్ర.

"ఏదో బి.కాం., వరకు చదువుకున్నానండీ!" అన్నాను.

"చదువుకున్న గాడిదవి నీకు ఇవేం బుద్ధులు" అని ఫెర్నాండజ్ హత్య జరిగిన రాత్రి ఎక్కడున్నావంటూ మొదలు పెట్టి తన ఇష్టంవచ్చిన ప్రతి అడ్డమైన కొశ్చనూ వేశాడు. నేను కూడా అడ్డమైన ఆన్సర్లన్నీ చెప్పాను. చివరిగా....

"నువ్వు ఆ రోజు అంటే ఫెర్నాండెజ్ హత్య జరిగిన రాత్రి నీకు తెలిసిన వాళ్ళ ఇంట్లో వున్నానంటావ్! ఆ హత్యకూ నీకు ఏం సంబంధం లేదంటావ్" అన్నాడు.

"నిజం సార్! దానికి అంటే ఆ హత్యకూ నాకూ యేలాంటి సంబంధమూ లేదు. మదర్ ప్రామిస్. ఆ రోజు రాత్రంతా మా అమ్మమ్మగారింట్లో గడిపాను" అని నెత్తిమీద చెయ్యి వేసుకున్నాను.

నేను అప్పుడే సుబ్బలక్ష్మి గురించి అంటే ఆమె ఇంట్లో గడిపినట్లు చెప్పలేదు. ఎస్సై నరేంద్ర డీప్‌గా

డిపార్ట్మెంటులోకిపోతే అప్పుడు నా సామర్థ్యం గురించి చెప్తాం అనుకున్నా. కానీ నరేంద్ర నేను చెప్పిన మాటలు నమ్మి అప్పటివరకూ వేస్తున్న ప్రశ్నలని ఆపి ఇక నన్ను వెళ్ళమన్నాడు.

నేను స్టేషనునుంచి బయటకు రాగానే జేబులుకొట్టే యాదగిరి కనిపించాడు.

నేనూ యాదగిరీ కొన్నాళ్ళపాటు కలిసి చదువుకున్నాం. వాడు ఎస్సెస్సీతో చదువు ఆపేశాడు. నేను బికాం దాకా కంటిన్యూ చేశాను. మా ఇద్దరి మధ్యా 'ఒకే' అనేంత చనువుంది.

యాదగిరి పేరుకూడా నా పేరులాగే పాతకేడీల లిస్టులో వుంది. వాణ్నికూడా ఫెర్నాండెజ్ హత్య కేసులో ఇంటరాగేట్ చేయడానికి పిల్చారట. యాదగిరి హంతకుడు కాడు. కేవలం జేబు దొంగ అయినా ఈ పోలీసులు యెందుకో హత్యా నేరాలకు కూడా పిలుస్తారు.

యాదగిరి బరువుగా వున్న పర్సుకొట్టిన రోజున జల్సా చేస్తాడు. లేని రోజు అస్సలు తినకుండా వుండగలడు. నన్ను చూడగానే ఆప్యాయంగా భుజంమీద చెయ్యి వేసి—

"మనం కల్సి చాలా రోజులయింది. ఏదన్నా హోటల్ కి వెళ్ళి కాఫీ తాగుదాం పద" అన్నాడు.

మేమిద్దరం దగ్గర్లో వున్న ఉడిపి హోటల్ కి వెళ్ళి కూర్చుని రెండు బ్రూ కాఫీకి ఆర్డర్ ఇచ్చి కబుర్లలో పడ్డాం. మామూలు కబుర్లనుంచి డైవర్టు అయి హటాత్తుగా

"నాకు నిన్న సాయంత్రం ఒక విచిత్రమయిన ఫోన్ కాల్ వచ్చింది" అన్నాడు. అలా అంటున్నప్పుడు వాడి ముఖంలో థ్రిల్.

వాడి మాట వినగానే నాకు ఏదో అనుమానం వచ్చింది.

"ఏమని ఫోన్ వచ్చింది?" చాలా క్యాజువల్ గా అడిగాను వాడి ముఖంవైపు చూడకుండా కాఫీ సిప్ చేస్తూ.

"ఎవడో ఏదో హోలీకాయన్‌నట ఎంతకమ్ముతావంటూ అడిగాడు. అన్నట్లు చెప్పడం మర్చిపోయాను. నేను ఈమధ్య ప్యారడైజ్ బార్‌లో నైట్ డ్యూటీ స్టిక్కరుగా చేస్తున్నా. నువ్వు అప్పుడప్పుడు ఫోన్ చేస్తుండవచ్చు" అని తన ఫోన్ నెం. 5 ఒక స్లిప్ మీద రాసి యిచ్చాడు.

నేను దాన్ని మడిచి చొక్కా జేబులోకి తోసి

"మరి దాన్ని అమ్మేసుకపోయావా?" అన్నాను.

"నా ముఖం అసలు అలాంటి నాణెం పేరు వినడం ఇదే మొదటిసారి. వాడెవడో తలకుమాసినవాడు నాకు ఫోన్ చేశాడు."

ఆ ఫోన్లు చేస్తున్న వాడెవడోగాని వాడి తెలివికి జోహార్లు అర్పించకుండా ఉండలేకపోయాను. యాదగిరికి ఫోన్ చేసినట్లే చాలామంది కేడీనాయాళ్ళకి ఫోన్ చేసి 'హోలీకాయన్' గురించి అడిగి వుంటాడు.

వాడు చీకట్లోకి విసిరిన రాయి తగలాల్సినచోట్లోనే తగిలింది. నేను యెక్కడ కలవాలంటూ రిప్లై ఇచ్చాను. దీన్నిబట్టి నాకూ యాదగిరికీ, ఇంకా మరి కొంతమందికీ ఫోన్ చేసిన వాడికి అసలు నేనే ఆ కాయన్ దొంగలించి

నట్లు తెల్సి వుంటదు. నా సమాధానం నన్ను వాడికి పట్టి యిచ్చింది. కానీ ఇంతమంది ఫోన్లు వాడెలా సంపాదించాడో నాకు ఆశ్చర్యం అనిపించింది.

మేం తాగిన కాఫీ తాలూకు బిల్లు యాదగిరే పే చేశాడు.

హోటల్నుంచి బయటకు వచ్చి షేక్ హేండ్ యిచ్చుకున్నాం. యాదగిరి బిగ్గరగా నవ్వుతూ తన ప్యాంటు జేబులోనుంచి నలుపు రంగులో వున్న కాఫీ లెదర్ పర్సు ఒకటి బయటకుతీసి నా చేతిలో పెట్టాడు. నేను ఆశ్చర్యంతో స్టన్నయిపోయాను. ఎందుకంటే అది నా పర్సే. నేను తేరుకునే లోపే,

"ఇలా సంతోష్ థియేటర్ దాకా వెళ్ళొస్తా! పనుంది!" అని వెళ్ళిపోయాడు.

వాడి పనేటో నాకు తెల్సు. ఇవ్వాళ సంతోష్లో యేదో కొత్త పిక్చర్ విడుదలయింది. వాడికిక చేతినిండా పనే.

## 8

సమయం రాత్రి ఒంటి గంట అవుతోంది.

నేను ఫెర్నాండజ్ వుంటున్న ఎపార్టుమెంట్స్ వెనక నిలబడి వున్నాను. తలెత్తి పైకి చూసిన నన్ను ఫెర్నాండజ్ వుంటున్న ఫ్లాట్ తాలూకు బాత్ రూం ప్రక్కగా క్రిందికి దిగి భూమిలోకి మాయం అయిపోయిన సిమెంటు పైపు ఆకర్షించింది.

ముఖ ద్వారంనుంచి దొంగతాళంచెవితో ఫెర్నాండజ్ ఫ్లాట్లోకి వెళ్ళడానికి వీలులేదు. ఎందుకంటే హత్య జరిగిన తర్వాత పోలీసులు సీల్ చేశారు. అందుకే దొడ్డిదారి నిర్ణయించుకున్నాను.

భుజాన వున్న టూల్ బ్యాగ్‌నుంచి గ్లవ్ శెవ్ తీసి చేతులకు తొడుక్కొని పైపుమీదుగా పాకసాగాను. బాత్‌రూం వెంటిలేటర్ దగ్గరకు చేరుకోగానే సిమెంటు పైపుకు ఉన్న జాయింటుమీద ఒక కాలు, పైపుకు గోడకు మధ్యనగల సందులో మరొక కాలు వుంచి బ్యాలన్సు చేసుకుంటూ ఒక చేతో సిమెంటు పైపు పట్టుకుని, రెండో చేత్తో టూల్స్ బ్యాగ్‌లోనుంచి పిల్లలు ఆడుకునే బొమ్మ తుపాకీ ఒకటి బయటకుతీశాను.

ఇప్పుడేన్ను వెంటిలేటర్‌కి ఉన్న గాడా గ్లాస్‌ను కట్ చేసేగాని లోపలకు వెళ్ళలేను. నా చేతిలో వున్న టాయ్‌గన్ ట్రిగ్గర్ నొక్కితే వాక్యూం బుల్లెట్ వెళ్ళి వెంటిలేటర్ గ్లాసుకు అతుక్కుపోతుంది.

మామూలుగా పిల్లలు ఈ గన్‌తో ఆడుకునేటప్పుడు ట్రిగ్గర్ నొక్కుతారు. చివర వాక్యూం క్రియేట్ చేయగలిగే రబ్బర్ ఎగుటివాళ్ళకు తగిలినచోట అతుక్కుపోతుంది. దానికి వేలాడుతున్న ప్లాస్టిక్ స్టిక్‌ని లాగగానే అతుక్కున్న వాక్యూం రబ్బర్ చేతిలోకి వస్తుంది. అంటే ఒకే బుల్లెట్‌ని అనేకసార్లు ఆడుకోవడానికి ఉపయోగించవచ్చన్నమాట.

మెల్లిగా బొమ్మ పిస్తోలు ట్రిగ్గర్ వెనక్కు లాగాను. వాక్యూం బులెట్ రిలీజ్ అయి వెంటిలేటర్ అద్దానికి అతుక్కుంది. బుల్లెట్ చివర్న ట్వయిన్ దారం గట్టిగా కట్టి దారపు రెండో చివర పళ్ళమధ్య ఇరికించుకుని పని మొదలు పెట్టాను.

'టూల్స్‌కిట్'లో నుంచి ఆర్టిఫిషియల్ డైమండ్ పొదిగిన గ్లాస్ కట్టర్‌ని బయటకు తీసి దాంతో వెంటిలేటర్ అద్దాన్ని నాలుగుప్రక్కలా జాగ్రత్తగా కోశాను.

కట్ అయిన అద్దం పడిపోకుండా వాక్యూం బుల్లెట్ చివర్న వున్న ట్వయిన్ దారం ఆపింది. దారాన్ని చేతిలోకి తీసుకుని మెల్లగా వదిలాను. కట్ అయిన అద్దం బాత్రూంలోకి దిగసాగింది.

'టక్'మన్న శబ్దంతో అది నేలను తాకగానే దారం మొత్తాన్ని లోపలికి వదిలి వెంటిలేటర్ గుండా బాత్రూం లోపలికి చేరాను. నేను దింపిన వెంటిలేటర్ అద్దం కాళ్ళకు తగిలింది.

బాత్రూంకు ఎడమప్రక్కన కిచెన్, కుడిప్రక్కన మాస్టర్ బెడ్ రూం వున్నాయి. బాత్రూంలోనుంచి మాస్టర్ బెడ్రూంలోకి వెళ్ళాను తడుముకుంటూ.

నా కళ్ళు చీకటికి అలవాటు పడడానికి కొద్ది నిమిషాల సమయం తీసుకుంది. పెన్ టార్చి వెలిగించి గది నలు మూలలా జాగ్రత్తగా పరిశీలించాను.

డబుల్ కాట్ బెడ్ కు ఎడం ప్రక్కన టీపాయ్ మీద రెండు ఫోన్లున్నాయి. ఓ మూల అల్యూమినియం స్టాండు మీద నగ్నంగా వున్న పాలరాతి విగ్రహం వుంది. ఓ ప్రక్కన కప్ బోర్డు నిండా రకరకాల పుస్తకాలు పేర్చి వున్నాయ్.

కప్ బోర్డు ప్రక్కగా ఒక ఐరన్ సేఫ్ నా దృష్టిలో పడింది. వెంటనే నా పనితనాన్ని దానిమీద చూపించడం మొదలుపెట్టాను.

15 నిమిషాల్లో ఐరన్ సేఫ్ తలుపు తెరుచుకుంది.

ఈమధ్య జనాలు తమ డబ్బుల్ని ఐరన్ సేఫ్ లో ఉంచుకోవడం లేదు. వైట్ మనీ బ్యాంకుల్లో, బ్లాక్ మనీ 'బినామీ' పేర్ల మీద ఉంచుతున్నారు.

నాకు ఫెర్నాండెజ్ ఐరన్ సేఫ్ లో పాస్ బుక్కులు

ఎఫ్.డి.కాయితాలు, ఇంకా ఏవో రకరకాల లెక్కలకు సంబంధించిన పుస్తకాలు కనిపించాయి.

ఐరన్ సేఫ్ లోపలి కార్నర్‌లో పెన్ టార్చి వెలుగులో మెరుస్తున్న ఓ చిన్న ప్లాస్టిక్ బాక్సుమీద నా చూపు పడింది. దాన్ని చేతిలోకి తీసుకుని మూత ఓపెన్ చేసి చూశాను. ఫెర్నాండజ్‌కి నేను అమ్మిన బంగారపు రిస్టువాచీ మిలమిల మెరుస్తోంది. దాన్ని జేబులోకి నెట్టాను. అంతకు మించి నాకు విలువయిన వస్తువులు ఏవీ అందులో కనిపించలేదు.

బెడ్‌రూంలో నుంచి హాల్లోకి వచ్చాను.

అక్కడ ఓ ప్రక్కన మినీ బారూ, మరోక ప్రక్కన నాలుగు సోఫాలు, వాటి మధ్యలో టీపాయ్ వుంది. సోఫాలకు కొద్ది దూరంలో చాక్‌పీస్‌తో నేలమీద ఏదో డయాగ్రాం గీసి వుంది. ఆ డయాగ్రాం ఫెర్నాండజ్ శవం నేలమీద పడివున్న యాంగిల్‌ని గుర్తించడానికి పోలీసులు గీసివుంటారు.

హాల్లో ఎంత వెతికినా నాకు కావలసిన 'హాలీ కాయన్' కనిపించలేదు. చాకుతో సోఫాలు, దిళ్ళు కోసి చూశాను. గోడలకు వ్రేలాడుచున్న పెయింటింగ్స్ ఫ్రేంలు ఊడదీసి చూశాను. కప్‌బోర్డులో వున్న ప్రతి పుస్తకమూ వెతికాను, అట్టలు వేసి వున్న వాటిని విప్పదీసి మరీ చూశాను. చివరికి బాత్రూంలో నీళ్ళబకెట్‌లోకి చెయ్యిపెట్టి చూశాను. కిచెన్‌లో వున్న ఫ్రిజ్ అంతా వెతికాను. ఫలితం శూన్యం.

ఫ్రిజ్ వెతుకుతుండగా నాకు మాస్టర్ బెడ్‌రూంలో వున్న టెలిఫోన్‌లు గుర్తుకు వచ్చాయి.

గబగబా బెడ్‌రూంలోకి వెళ్ళి స్క్రూడ్రయివర్‌తో టెలీఫోన్‌ల అడుగుభాగాన్ని వూడదీసి చూశాను. మొదట టెలిఫోన్ లోపలి భాగాన రెండు వందరూపాయల నోట్లకట్టలు కనిపించాయి. అవి దాదాపు 20 వేలవరకు ఉండవచ్చు అని అంచనా వేసుకున్నాను.

రెండో టెలిఫోన్ లోపలి భాగాన ఓ కాగితం పొట్లం దొరికింది. ఆత్రుతగా దాన్ని విప్పదీశాను. మిల మిలా మెరుస్తున్న ఏడు వజ్రాలు కనిపించాయి.

వాటిని చూసిన తర్వాత హాలీకాయన్ కనిపించక పోవడంవల్ల ఏర్పడిన నిరాశ చాలావరకు తగ్గింది. వజ్రాల పొట్లాన్నీ, వందనోట్ల కట్టలనూ జేబులోకి తోసి హాల్లోకి వచ్చాను.

ఇంతకుముందు ఫెర్నాండజ్ బ్రతికి వున్నప్పుడు వచ్చినప్పుడు మినీ బార్ అద్దాల అల్మారాలో అందంగా పేర్చిన లిక్కర్ బాటిల్సు మధ్య 'షివాస్ రీగల్ స్కాచ్ విస్కీ' బాటిల్ నాకెంతో అందంగా కనిపించింది. కానీ ఆ రోజు ఫెర్నాండజ్ గాడు కాఫీ ఇచ్చి సరిపుచ్చాడు.

స్కాచ్ బాటిల్ని అందుకుని 'క్రిస్టల్ గ్లాస్'తో చేయబడిన గాజు గ్లాస్‌లోకి వంపుకుని మెల్లిగా సిప్ చేయసాగాను. పావు బాటిల్ ఖాళీ చేసేసరికి భూమి గుండ్రంగా వుంది అనిపించింది.

బాటిల్ని అలాగే పట్టుకుని మెల్లి మెల్లిగా తాగుతూ మాస్టర్ బెడ్‌రూంలోకి వెళ్ళి మంచంమీద పడుకున్నాను.

వెంటనే నాకు గాఢంగా నిద్రపట్టింది.

# 9

ట్రింగ్ .... ట్రింగ్ ....

ట్రింగ్ ట్రింగ్ ....

ట్రింగ్ ... ట్రింగ్ ....

టెలిఫోన్ అదేపనిగా మ్రోగడంతో నాకు హఠాత్తుగా మెళుకువ వచ్చింది.

టైం చూసుకున్నాను. ఉదయం 11-40 అవుతోంది. వాచీలో డేటు కూడా మారింది.

రాత్రి తాగిన స్కాచ్ బాటిల్ నేలమీద పడి వుంది. అందులోని స్కాచ్ చాలావరకు నేలమీద కారిపోగా కొంతభాగం బాటిల్లోనే మిగిలివుంది. మరీ ఓవర్‌గా తాగేశానేమో తల దిమ్ముగా వుంది.

ఫోన్ రిసీవ్ చేసుకోవాలా, వద్దా అనే ఆలోచనలో పడ్డాను.

ఫెర్నాండజ్ గురించి చాలామందికి తెల్సు. అతను వెల్‌నోన్ పర్సన్. న్యూస్ పేపర్లన్నీ అతని హత్యా విషయాన్ని ప్రముఖంగా ప్రకటించాయి. కనక అతనికి యెవరన్నా ఫోన్ చేసే ఆస్కారం లేదు.

అంటే నేను ఫెర్నాండజ్ ఫ్లాట్‌లోకి ప్రవేశించి రాత్రంతా ఇక్కడే గడిపినట్లు యెవరో పసిగట్టారన్న మాట. ఏదైతే అదయిందిలే అనుకుని కేర్లెస్‌గా ఫోన్ రిసీవర్ అందుకుని చెవికి ఆనించుకున్నాను. వెంటనే అవతలిన్నించి—

"ఎంత సేపటికీ రిసీవ్ చేసుకోవేంట్రా బద్మాష్! ఫెర్నాండజ్ గాడి ఫారిన్ మందు తేరగా వచ్చిందని ఫుల్లుగా కొట్టేసి పడుకున్నావట్రా ఇడియట్!" అని వినిపించింది.

నాకు కోపం నషాళానికి అంటుకుంది.

"ఎవడివిరా నువ్వు?" అన్నాను కోపంగా.

"ఎర్రతేలు పేరు యెప్పుడన్నా విన్నావా? "అవతలి వ్యక్తి నుంచి వినిపించింది.

ఎర్రతేలు పేరు వినేసరికి నాకు వెన్నులోనుంచి వణుకు పుట్టుకొచ్చింది. నా ఫోర్సు పూర్తిగా తగ్గిపోయింది. ఎర్రతేలు అసలు పేరేంటో యెవరికీ తెలియదు. వాడు ఒక పచ్చి గూండా. సిటీలో వాడి గురించి తెలియని వాడుండడు.

"ఇంతకు మీరు ఎర్రతేలుగారా? లేక వారి పి.ఎ. గారా?" అని అడిగాను.

ఎర్రతేలుగాడికి ఒక పి.ఎ.గాడున్నాడు. వాడు నర రూప రాక్షసుడు. వాడి పేరు 'మండ్రగబ్బ'. మండ్ర గబ్బ అసలు పేరుకూడా యెవరికీ తెలియదు. సిటీలోకి వెళ్ళి ఎర్రతేలు తరపున పాపుల వాళ్ళ దగ్గిర్నుంచి ఈ మండ్రగబ్బగాదే మామూలు వసూలు చేస్తాడు.

"ఎర్రతేల్నేరా మాట్లాడేది. దొంగనాయాలా! నువ్వు శంభూప్రసాద్ గాడింటికి దొంగతనానికి వెళ్లావట నిజ మేనా?"

"ఔను సార్! వెళ్లాను."

"అదేరోజు మా బద్మాష్‌గాడు! అంటే నా తమ్ముడు కూడా శంభూప్రసాద్ ఇంటికి దొంగతనానికి వచ్చా డట! నువ్వు లోపలకు రాగానే అప్పటిదాకా ఆ ఇంట్లో ఏకన్నా దొరుకుతాదేమోయని వెతికి వేసారి మావోడు బయటకు వెళ్ళాడు. నువ్వు రావడం, వాడు వెళ్ళడం కొద్ది నిమిషాల తేడాలో జరిగిపోయింది. ఆ మర్నాడు శంభూప్రసాద్ పెళ్ళాన్ని యెవడో చావకొట్టడం

పేపర్‌లో వచ్చింది.

మా బద్మాష్‌గాడి పేరు పాత కేడీల లిస్టులో వుంది. పోలీస్ నాయాళ్ళు అందరితో పాటు ఇంటరాగేట్ చేయ డానికి మావోణ్ని కూడా పిలిచారు. శంభూప్రసాద్ గాడి ట్లో పడ్డ వేలిగురుతులూ, మావోడి వేళ్ళ గురుతులూ ఒకటే అని తేల్చారు. అంతేకాక శంభూప్రసాద్ గాడి పెళ్ళాన్ని మా బద్మాష్‌గాడే చంపిపారేశాడని పోలీసు నాయాళ్ళు తేల్చిపారేశారు" అని ఎర్రతేలు కాస్త ఊపిరి పీల్చుకోడానికి ఆగాడు.

ఎర్రతేలుగాడు చెప్పబోయేదేంటో నాకు చూచా యగా అర్థం అయింది.

ఎర్రతేలుగాడు చెప్పడం మొదలుపెట్టాడు.

"అసలు నిజానికి మావోడు వెళ్ళేసరికే శంభూ ప్రసాద్‌గాడి ఇంట్లో యెవరూ లేరట. వాడు, వాడి పెళ్ళాం యెవరిదో పెళ్ళికి వచ్చారని పేపర్‌లో పడింది. అంటే నువ్వు మావోడు బయటకు వెళ్ళిన తర్వాత దొంగతనం చేస్తున్న సమయంలో శంభూప్రసాద్ గాడూ, వాడి పెళ్ళామూ వచ్చి వుంటారు. వెంటనే నువ్వు నెత్తిమీద దగ్గర్లో వున్న ఆయుధంతో ఇద్దర్నీ కొట్టి వుంటావు. నువ్వు కొట్టిన దెబ్బకి శంభూప్రసాద్ గాడి పెళ్ళాం చచ్చినా వాడు మాత్రం బతికాడు. మా వాడికి ఉరిశిక్ష పడబోతోంది కనుక చివరికి నేను చెప్పే దేంటంటే నువ్వు పోలీస్‌స్టేషన్‌కి వచ్చి నీ నేరాన్ని ఒప్పుకో."

"చూడండి ఎర్రతేలుగారూ! నేను శంభూప్రసాద్ గారింటికి దొంగతనానికి వెళ్ళింది నిజం. నేను వెళ్ళేసరికే యెవరో దొంగతనానికి ప్రయత్నించారు అని గ్రహిం

చాను. మీరు చెప్పేదాన్ని బట్టి ఆ పనిచేసింది మీ బద్మాష్.... సారీ! మీ బ్రదర్ అని తెల్సింది. నేను అక్కణ్నించి తిరిగి వచ్చిన తర్వాత మూడో పార్టీ దొంగతనానికి వెళ్ళి వుంటుంది. వాళ్ళే ఈ హత్య చేశారు. నాకు నిజంగా ఏమాత్రం తెలియదు" అన్నాను.

"అదంతా నాకనవసరం. హత్య చేసింది నువ్వేనని ఒప్పుకోవాలి."

నాకొక అనుమానం వచ్చింది. నేను ఫెర్నాండజ్ ఇంట్లో దొంగతనం చేస్తున్నట్లు ఎర్రతేలుకి ఎలా తెల్సు! ఈ విషయమే అడిగాను. దానికి ఎర్రతేలు ఇలా రిప్లై ఇచ్చాడు.

"నేను ఇందాకే బొంబేనుంచి వచ్చాను. వచ్చేసరికి జరిగిందంతా తెల్సింది. నువ్వు ప్రస్తుతం వున్న ఫెర్నాండజ్ ఫ్లాట్ ప్రక్క పోర్షన్లోకి మా ముఠావాడు ఒకడు దొంగతనానికి వచ్చాడట. వాడు నిన్ను చూశాడు. వెంటనే వాడు దొంగతనం మానేసి ఫెర్నాండజ్ ఫ్లాట్ ముందు నిలబడి నిన్ను వాచ్ చేయసాగాడు.

వాడికి మా ఇడియట్ని పోలీసులు పట్టుకున్న విషయం మా ఇడియట్ వెళ్ళిన ఇంటికే నువ్వూ దొంగతనం చేయడానికి వెళ్ళిన విషయం తెల్సు. వెంటనే వాడు నువ్వున్న ఎపార్టుమెంట్స్ ఎదురుగ్గా వున్న పబ్లిక్ బూత్ నుంచి టెలిఫోన్ చేసి విషయం అంతా వివరించి చెప్పాడు. ఇప్పుడు మా వాళ్ళు వంతులవారీగా నిన్ను కాపలా కాస్తున్నారు. కావాలంటే కిటికీలోంచి బయటకు చూడు."

నేను ఫోన్ టేబుల్ మీద పెట్టి కిటికీ వద్దకు వెళ్ళి

కర్టెన్లు తొలగించి చూశాను.

నేనున్న ఎపార్టుమెంట్స్ ఎదురుగ్గా వున్న రోడ్డు కవతల ఎలక్ట్రిక్ పోల్ ప్రక్కగా ఎర్రతేలు బ్యాచ్ లోని 'నరం' గాడు శనక్కాయల బుట్ట పెట్టుకుని కూర్చుని ఉన్నాడు. వాడు మహా సన్నగా వుంటాడు. అందుకే నరంగాడికి. నరంగాడు అన్న పేరు వచ్చింది.

నేను కర్టెన్లు తొలగించి చూడగానే కిటికీ వంకే చూస్తున్నవాడు పలకరింపుగా నవ్వాడు. నేను ఛటుక్కున కర్టెన్లు వేసి తిరిగి ఫోన్ వద్దకు వచ్చి రిసీవర్ చేతిలోకి తీసుకున్నాను.

"ఇప్పటికయినా నమ్ముతావుగదా? అవునూ రాత్రంతా అక్కడేం చేస్తున్నావ్?" అడిగాడు ఎర్రతేలు.

"స్కాచ్ విస్కీ షీవాస్ రీగల్ తాగి పడుకున్నాను. నువ్విలా ఫోన్ చేసేబదులు ఎకాయెకిన పోలీసులకే ఫోన్ చేసి నేను ఇక్కడ ఉన్నట్లు చెప్పి పట్టించవచ్చుగదా?"

"చూడూ! నేను నువ్వు అనుకున్నంత వి పి.ని కాను. నువ్వు వచ్చిన ఫెర్నాండజ్ ఫ్లాట్‌కి ఊరికే వెళ్ళవు. శంభూప్రసాద్ ఇట్లోంచి యేదో విలువైందే దొంగిలించి వుంటావు. దాన్ని కొటుకట్టి ఫెర్నాండజ్ గాడు రేపో, ఎల్లుండో డబ్బులు ఇస్తా అనివుంటాడు. ఈలోపే చచ్చాడు. నువ్విప్పుడు అక్కడికి వెళ్ళింది ఫెర్నాండజ్ కిచ్చిన వస్తువుకోసం అయివుంటుంది అనుకుంటాను. నువ్వు ఆ వస్తువు తెచ్చి నాకు ఇచ్చి ఆ తర్వాత పోలీసులకు లొంగిపో."

"నిజమే! నేను శంభూప్రసాద్ ఇంట్లో ఒక బంగారపు వాచీని దొంగలించాను. దానికోసమే వచ్చాను. కానీ ఇక్కడున్న మినీ బార్‌లో స్కాచ్ విస్కీ చూడ

గానే నోరు ఊరింది. ఒక పెగ్గుతో సరిపెట్టుకుందాం అనుకున్నవాణ్ని సగం బాటిల్ లాగించేశాను. దాంతో దిమ్మ తిరిగి పడిపోయినవాణ్ని తిరిగి నీ ఫోన్ కాల్తో లేచాను.

చీకటిపడిం తర్వాత బయటకు వచ్చి నీకు ఆ వాచీని అందజేస్తాను. కానీ శంభూప్రసాద్ భార్యని మర్డర్ చేసింది నేను కాదు. నేనుకూడా బయటకు వెళ్ళిన. తర్వాత మూడో పార్టీ వచ్చింది. ఆ పార్టీ తాలూకు వాళ్ళు ఆమెను ఖతం చేసి వుంటారు. నేను ఆ వాచీ ఇవ్వడానికి సిద్ధమేగానీ హత్య చేసాను అని పోలీసుల ముందు ఒప్పుకోడానికి సిద్ధంగా లేను."

"నేను చెప్పినట్లు వినకపోతే పర్యవసానం చాలా దారుణంగా ఉంటుంది."

"ఏం చేస్తావ్?"

"సుబ్బలక్ష్మి నీ ప్రియురాలుకదూ! ఆమెను కిడ్నాప్ చేసి మా గ్యాంగ్ అంతా వంతులవారీగా రేప్ చేస్తాం. అచ్చ తెలుగులో మానభంగం చేస్తాం. అంతా ఆ పని చేసిన తర్వాత ఆమె అవయవాలన్నీ ఏ ముక్కకు ఆ ముక్క సరికి పార్సిల్ చేసి నీకు పంపిస్తాం....ఆ తర్వాత నిన్ను కూడా...."

"నో ఎర్రతేలూ! అంతపని చేయకు. నా వల్ల ఒక అమాయకురాలి నిండు జీవితం నాశనం కావడానికి వప్పుకోను. నువ్ చెప్పినట్లే చేస్తాను చీకటిపడ్డ తర్వాత ఈ రోజు రాత్రి ఒంటిగంటకల్లా ఫెర్నాండెజ్ ఎపార్టుమెంట్ నుంచి సరాసరి నీ దగ్గరకు వచ్చి ఆ బంగారపు వాచీ నీకు ఇచ్చి అట్నుంచి పోలీస్ స్టేషన్ కి వెళ్ళి నేనే మిసెస్ శంభూప్రసాద్ ని మర్డర్ చేసినట్టు స్టేట్ మెంట్

ఇస్తాను" అనగానే.

"వెరీ గుడ్!" అని ఎర్రతేలు ఫోన్ పెట్టేశాడు.

## 10

టైం చూసుకున్నాను. మధ్యాహ్నం పన్నెండు గంట లవుతోంది.

ఎర్రతేలు చెప్పిన ప్రకారం రాత్రి ఒంటిగంట లేదా ఒకటిన్నరకల్లా పోలీస్‌స్టేషన్‌లో హంతకుడిగా లొంగి పోవాలి. లేకపోతే నా సుబ్బలక్ష్మి మానభంగానికీ తర్వాత దారుణ మరణానికీ గురవుతుంది.

ఇంక నాకు 13 గంటల టైం వుంది. ఈ 13 గంటల్లో అసలు హంతకుణ్ని పట్టివ్వగలిగితే ఎర్రతేలు నన్ను వదిలేస్తాడు.

నా మనస్సంతా పిచ్చిపిచ్చిగా అయిపోయింది. క్రింద పడివున్న స్కాచ్ బాటిల్ని అందుకుని గొంతు తడిపాను. నిషా తలకెక్కి బుర్ర పనిచేయడం మొదలుపెట్టింది స్కాచ్ లివర్‌లోకి జారగానే ఆకలి విజృంభించింది. వెంటనే కిచెన్‌లోకి వెళ్ళాను. ఫ్రిజ్‌లో వున్న బిస్కట్సూ, టిన్ ఫిష్షూ తీసుకుని గబగబా తిన్నాను. టెన్షన్ కొంచెం తగ్గింది.

తిరిగి బెడ్‌రూంలోకి వచ్చాను. రాత్రి వెతికి నప్పుడు క్రిందపడేసిన పుస్తకాల్లో 'స్టాంప్స్ అండ్ కాయిన్స్' అని మేగజైన్ నన్ను ఆకర్షించింది. దాన్ని చేతిలోకి తీసుకుని పేజీలు తిప్పసాగాను.

ఆ మ్యాగజైన్‌లో సగం పేజీలు స్టాంప్సుకొరకు మిగతా సగం పాత కాయిన్సు కొరకు కేటాయించ బడింది. కాయిన్స్ అనే ఛాప్టర్ తాలూకు కాగితాల్ని త్రిప్పుతున్న నేను తక్కున ఆగిపోయాను. అక్కడ 'ఐదు

వూలీకాయన్స్' గురించిన సమాచారం వ్రాయబడివుంది. ఒక వూలీకాయన్ అమరావతి మ్యూజియంలోనూ, రెండు మద్రాసు మ్యూజియంలోనూ, ఒకటి లండన్ రాయల్ సొసైటీ ఆఫ్ ప్రెజన్ అనే పురావస్తుశాల లోను, మరొకటి పీటర్ జాన్సన్ అనే మనిషి వద్దా వున్నాయి.

నాకు ఎందుకో ఈ అయిదు కాయన్స్ గురించి తెలుసుకుందాం అనిపించింది.

ఆ పుస్తకంలో వున్న అడ్రస్ ప్రకారం ముందుగా మద్రాస్ మ్యూజియానికి ఎస్టీడీ చేశాను. మ్యూజియం క్యూరేటర్ నాగార్జునసాగర్ మ్యూజియం చూడటానికి వెళ్ళాడట. రెండ్రోజులుదాకా రాడట. ఈ విషయం అక్కడ పనిచేస్తున్న యెవరో వ్యక్తి చెప్పాడు.

వెంటనే హైద్రాబాద్ నుంచి ఫోన్ చేస్తున్నట్లూ వూలీకాయన్ గురించిన సమాచారం అవసరంగా కావాలి అన్నాను.

అవతలి వ్యక్తి ఇంతకూ "మీరు ఎవరు?" అని అడిగాడు.

"నేనొక జర్నలిస్టుని. 'ఇండియన్ మిర్రర్' ఇంగ్లీషు డైలీ తరఫున పనిచేస్తున్నాను. బుద్ధుడికి సంబంధించిన 'వూలీకాయన్స్' గురించి ప్రత్యేక వ్యాసం తయారు చేస్తున్నాను.ఇంతకూ మీ పేరేమిటి?" అని ఇంగ్లీషులో అడిగాను. అవతలి వ్యక్తి తమిళయను. అతనికి తెలుగు రాదు. నాకు తమిళం రాదు.

అతను ఏదో అన్నాడు.

నాకు సరిగ్గా వినపడక "ఏంటీ డో నేష నా?" అన్నాను.

"కాదు గణేశన్" అన్నాడు.

"మరేం లేదు. నేను వ్రాసే వ్యాసంలో మీ పేరు అంటే వ్యాసం తయారీలో పూర్తి సహాకారం అందించి నందుకు తెలియచేద్దాం అనుకుంటున్నా" అని అన్నానో లేదో ఆ వ్యక్తి ఆ హోలీకాయన్ చరిత్ర అంతా చెప్పుకు వచ్చి.

"మీకు ఇంకా ఏమన్నా వివరాలు కావాలా?" అని అడిగాడు.

"ఆ కాయన్ ఇంకా మీ మ్యూజియంలో వుందా లేక కలకత్తా మ్యూజియానికో, బాంబే మ్యూజియానికో పంపించారా."

"అబ్బే అలాంటిది ఏం లేదండీ! ఆ కాయన్ మా మ్యూజియానికి ప్రత్యేక ఆకర్షణ. అదిగో ఆ కనిపించే అద్దాల బాక్సులో మెరుస్తూంది. నా పేరు డా॥ గణేశన్....తప్పక రాస్తారు కదూ...." అతను ఇంకా యేదో చెపుతూండగానే టెలిఫోన్ క్రెడిల్ చేసి టెలిఫోన్ ఎక్స్ఛేంజికి ఫోన్ చేశాను. అవతల్నించి ఓ కోమలాంగి కంఠం వినిపించింది. ఆ కంఠం ఏం కావాలని అడిగింది. నేను ట్రాంక్స్ అండ్ కాయన్స్ బుక్‌లోని టెలిఫోన్ నెంబర్లు చూస్తూ అమరావతికి ఒక లైట్నింగ్ కాల్ బుక్ చేశాను.

"అమరావతి అంటే మహారాష్ట్ర అమరావతా లేక గుంటూరు జిల్లా అమరావతా?" అని అడిగింది టెలిఫోన్ ఆపరేటర్.

"అయ్యయ్యో! మహారాష్ట్ర అమరావతి కాదండీ! గుంటూరు జిల్లా అమరావతి మరొక్క విషయం. మీకు బ్రిటన్ అనే దేశం తెల్సా?" అని అడిగాను.

"తెల్సు."

"ఆ దేశంలో లండన్ నగరం వుంది. ఆ నగరంలో రాయల్ సొసైటీ ఆఫ్ ట్రెజర్స్ మ్యూజియానికీ, అదే నగరానికి చెందిన 'పీటర్ జాన్సన్' అనే వ్యక్తికీ రెండు కేబుల్స్ బుక్ చేయండి అర్జంటు" అన్నాను.

"రాయల్ సొసైటీ ఆఫ్ ట్రెజర్స్ మ్యూజియం ఫోన్ నెంబరూ, పీటర్ జాక్సన్ ఫోన్ నెంబరూ చెప్తారా?" అని ఆపరేటర్ అడిగింది.

"రాయల్ సొసైటీ వాళ్ళ నెంబర్ 82—340772, పీటర్ జాక్సన్ నెంబరు 51—401221 అని చెప్పాను. ఆపరేటర్ మరోసారి నెంబర్లు చెక్ చేసుకుని గంటా రెండు గంటల్లోపులో లండన్ నగరానికీ, ఓ గంట లోపులో అమరావతికి కనెక్షన్లు రావచ్చు" అని చెప్పింది.

ఈ గంటా, రెండు గంటలసేపు ఎలా టైం పాస్ చేయాలో నాకు అర్థం కాలేదు. ఒళ్ళంతా చిరాగ్గా అనిపించి బాత్రూంలోకి వెళ్ళి గుడ్డలన్నీ విప్పి గోడకున్న స్టాండ్కు తగిలించి షవర్ నాబ్ తిప్పాను. చల్లని నీళ్ళు నెత్తిమీద పడినై. తల దిమ్ముదు కొంచెం తగ్గింది. సబ్బు రుద్దుకోకుండా అలాగే 10 నిమిషాలు నిలబడ్డాను. ఒకళ్ళ సబ్బు రుద్దుకోవడం నాకు ఇష్టం వుండదు. అదే విధంగా టవల్స్ కూడా మరొకరిది నేను ఎట్టి పరిస్థితుల్లోనూ ఉపయోగించను.

షవర్ కట్టేసి హాల్లోకి వచ్చి ఫాన్ ఫుల్ స్పీడులో పెట్టి సోఫాలో కూర్చున్నాను. ఫాను గాలికి తల ఆర సాగింది. ఇంతలో నాకు రోడ్డు ప్రక్కన కాపలా కాస్తున్న

ఎర్ర తేలు తాలూకు మనిషి గుర్తుకు వచ్చాడు.

సోఫాలోంచి లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి కర్టెన్లు తొలగించి చూశాను. ఈ తడవ అక్కడ 'పరం'గాడు లేడు. నల్లగా తుమ్మ మొద్దులా వుండే 'తోడేలు'గాడు బూట్ పాలిష్ చేస్తున్నాడు ఎవరికో. పిట్టల ప్రకారం వాడు కాపలా కాస్తున్నారన్నమాట. నవ్వుకున్నాను. కర్టెన్లు మూసి తిరిగివస్తుండగా టెలిఫోన్ గణగణమని మోగింది.

పాదాలు శబ్దం చేయకుండా పరిగెత్తుకుంటూ వెళ్ళి ఫోన్ అందుకున్నాను. అమరావతి మ్యూజియానికి కనెక్షన్ త్వరగా దొరికింది. ఆపరేటర్ మాట్లాడమంది.

నేను మాట్లాడసాగాను.

హలో! హలో!! అవతల్నుంచి యెవరో వ్యక్తి అరుస్తున్నాడు. మాట్లాడే ఫోర్సునుబట్టి అతడు ప్యూను అయివుంటాడని గ్రహించాను.

“క్యూరేటర్ గారితో అర్జంటుగా మాట్లాడాలి. నేను హైద్రాబాద్ నుంచి మాట్లాడుతున్నాను” అనగానే,

హైద్రాబాద్ పేరులో వున్న గ్లామర్ వల్లకాబోలు ఆ వ్యక్తి “ఇప్పుడే పిలుస్తున్నా సార్!” ఆతృతగా అని ఫోన్ పెట్టేశాడు.

ఓ అర నిముషం తర్వాత—

“ఎవరండీ మాట్లాడేది” అని ఓ కంఠం నింపాదిగా ప్రశ్నించింది.

“మ్యూజియం క్యూరేటర్ గారు కావాలండీ.”

“క్యూరేటర్ని మాట్లాడుతున్నా ....”

“నా పేరు లక్ష్మణరావ్! ప్రెస్ రిపోర్టర్ని, నేను బుద్ధభగవానుడికి చెందిన హోలీకాయిన్ ఐ మీన్

ఆయన అ స్థికలుంచిన భరిణలో ఉండే హోలీకాయిన్ గురించి ఒక వ్యాసం తయారు చేస్తున్నానండీ! దయచేసి మీరు ఆ కాయిన్స్ గురించి వివరాలు చెప్తే...."

"ఆ వివరాలు చెప్పాలంటే చాలా సమయం పడుతుంది. ఆ కాయిన్స్ గురించిన సమాచారం స్టాంప్స్ అండ్ కాయిన్స్ అనే పుస్తకంలో వుంటుంది చూడండి" అన్నాడు.

ఆయన ఫోన్ పెట్టేసే ప్రయత్నంలో వున్నాడని తెలుసుకుని "మీ మ్యూజియంలో ఉన్న ఆ కాయిన్ చూడాలంటే ఏదన్నా టికెట్ వుందాండి?" అని అడిగాను.

ఆయన చెప్పే సమాధానంతో అమరావతి మ్యూజియంలో ఆ కాయిన్ వుందో లేదో తెల్సిపోతుంది. ఆ కాయిన్ ఆ మ్యూజియం నుంచి దొంగిలించబడితే, అదే నేను శంభూప్రసాద్ ఇట్లో కొట్టేసిన కాయిన్ అన్నమాట.

"అలాంటిదేం లేదండీ! ఆ కాయిన్ నే కాదు ఈ మ్యూజియం మొత్తం చూడడానికి ఎలాంటి టిక్కెట్టూ లేదు. మీ కెప్పుడైనా మా వూరు వస్తే మీరు వ్రాయబోయే వ్యాసంలోకి కాయిన్ ప్రత్యక్షంగా చూసే అవకాశం కల్గుతుంది" అని ఫోన్ క్రెడిల్ చేశాను.

ఇక మిగిలింది లండన్ మ్యూజియం అక్కడ మొత్తం రెండు హోలీకాయన్స్ ఉన్నాయ్. అంతేకాక పీటర్ జాన్సన్ అనే వ్యక్తి దగ్గర మరో కాయిన్ ప్రయివేటు కలెక్షన్ కింద ఉండిపోయింది.

నేను బెడ్ రూంలోనుంచి ఓ ఇంగ్లీషు నవల తెచ్చుకుని చదువుతూ కూర్చున్నాను. ఫ్యానుగాలికి నా తలపూర్తిగా

ఆగిపోయింది. నేను నవలా పతనంలో మునిగిపోయాను. ఇంతలో టెలిఫోను గణగణమని మోగింది.

టైం చూసుకున్నాను. రెండుగంటల ఇరవై నిమిషాలు.

నేను లండన్ నగరానికి బుక్ చేసిన కేబుల్ త్వరగా వచ్చింది. అవతల్నుంచి 'రాయల్ సొసైటీ ఆఫ్ ట్రెజర్స్ మ్యూజియం' తరఫున ఎవరో మాట్లాడుతున్నారు. నేను 'హాలీకాయన్' గురించి అడిగాను. నా ఇంగ్లీష్ అవతలి వ్యక్తికి అర్థంకావడం కొంచెం కష్టంగా వుంది. మాటల్ని బట్టి అతను మ్యూజియం డైరెక్టర్ ప్రిన్సిపల్ సెక్రటరీకి పర్సనల్ అసిస్టెంటట.

నన్ను నేను జర్నలిస్టుగా పరిచయం చేసుకున్న తర్వాత మ్యూజియం డైరెక్టర్ తాలూకు పర్సనల్ అసిస్టెంటు ప్రిన్సిపల్ సెక్రటరీకి కనెక్షన్ ఇచ్చాడు. ఆ ప్రిన్సిపల్ సెక్రటరీ పేరు ఆండర్సన్.

ఆండర్సన్‌కి నేను బుద్ధుడి చైత్యాల గురించి ఒక వ్యాసం తయారు చేస్తున్నాననీ ఆ విషయంలో సహాయ పడమనీ అడిగాను.

“మా నుంచి ఎలాంటి సహాయం కావాలి?” అన్నాడు ఆండర్సన్.

“మరేం లేదు. నేను స్టాంప్స్ అండ్ కాయిన్స్ అనే మ్యాగజైన తాలూకు ఓల్డు ఇష్యూస్‌లో బుద్ధుడి హాలీ కాయిన్ గురించి చదివాను. ఆ కాయిన్సు 'అమరావతి'కి చెందినవి. వాటి గురించి కాస్త వివరిస్తారా?” అడిగాను.

నిజానికి ఆ కాయిన్స్ బొమ్మలు నేను చూసిన పుస్తకంలో ప్రింటయి వున్నాయి. ఆ విషయం అతనికి తెల్సుననుకుంటాను.

“ఆ కాయిన్సు ఫోటోలు మీరు చెప్పే మ్యాగజైన్‌లో

ప్రింటయి వుండాలే" అన్నాడు.

"దురదృష్టవశాత్తు ఆ కాయిన్సు గురించి వ్రాతగాని ఫోటోలు ప్రచురించలేదు. ఆ అయిదు కాయిన్సులో రెండు లండన్‌లోని మ్యూజియంలో ఉన్నట్లు మాత్రం నాకు తెల్సు" అన్నాను.

"అలాగా! ఆ కాయిన్సు బుద్ధుడి చిన్న చిన్న ఎముకలతో పాటు దొరికాయి. ఒక్కొక్కటి సుమారు 10 గ్రాముల బరువుకలిగి 12 సెంటీమీటర్ల డయామీటర్‌తో పైన బుద్ధుడు చనిపోయే సన్నివేశం బొమ్మ వుంటుంది. ఈ రకం కాయిన్సు ఆ కాలంలో చాలా విడుదల అయ్యాయి కానీ చనిపోతున్న బుద్ధుడికి నీడనిస్తున్న గొడుగు గల కాయిన్స్ ఈ ఐదు మాత్రమే. అందుకే ఇవి అరుదైన నాణేల జాబితాలోకి చేరిపోయాయి."

"ఆ కాయిన్ చూడడానికి నేను లండన్ నగరం రావాలి అనుకుంటున్నాను."

"నా ఉద్దేశ్య ప్రకారం అది ఖర్చుతో కూడుకున్న పని. మీ కంట్రీలో నే మద్రాస్ మ్యూజియంలో ఇలాంటి ఐదు కాయిన్సులో ఒకటివుంది. మీరు హైదరాబాద్‌కి చెందినవారు అంటున్నారు కనుక మద్రాస్ వెళ్ళి చూడవచ్చు. అది మీకు ఖర్చు తగ్గించేపని. మీరు జర్నలిస్టు కనుక స్వయంగా చూసి తెల్సుకోవాలనే ఉత్సాహంవుండటం సహజం. ఉదయం 9-30 నుంచి సాయంత్రం 4-30 దాకా ఈ హోలీ కాయిన్సు మా మ్యూజియంలో ప్రదర్శనకు వుంటై. మీరు లండన్ నగరానికి వస్తే ఓ రోజు మా ఇంట్లో గెస్ట్‌గా వుండండి."

"థ్యాంక్యూ ఆండర్సన్! నేను లండన్ వస్తే తప్పక మిమ్మల్ని కలుస్తాను."

ఫోన్ క్రెడిల్ చేశాను. లండన్ మ్యూజియంలో కూడా హోలీ శాయన్సు ఉన్నాయ్ ఇక మిగిలింది ఒకే ఒక్కటి అది పీటర్ జాన్సన్ దగ్గర ఉండాల్సిన శాయను. అది అతని దగ్గర లేకపోతే ఫర్వాలేదు. వుంటే మాత్రం నేను శంభూప్రసాద్ వాల్ సేఫ్‌లో నుంచి కొట్టేసింది నకిలీది అయివుండి వుండాలి. ఇక నేను పీటర్ జాన్సన్‌కి బుక్ చేసిన కేబుల్ రాగానే విషయం తేలిపోతుంది.

టైము రెండు దాటిపోవడంతో ఆకలి దంచేస్తోంది. ఫ్రిజ్‌లో ఉన్న బిస్కట్ పాకెట్ పూర్తి అయిపోయింది.

కిచెన్ వెతికాను. పాలపొడి డబ్బా ఒకటి కనిపించింది. గ్యాస్‌స్టవ్ వెలిగించి నీళ్ళలో పాలపొడి వేసి బాగా కలిపిన గిన్నెను వేడిచేయడం మొదలుపెట్టాను.

అల్మారాలో వున్న సీసాలమీద పదార్థాల పేర్లు అన్నీ నీట్‌గా లేబుల్స్‌మీద వ్రాసి అతికించి వున్నాయి. పంచదార బాటిల్ని అందుకుని రెండు చెంచాలు వేడి పుంజుకుంటున్న పాలల్లో వేశాను.

వెతగ్గా వెతగ్గా కవర్ కూడా విప్పదీయని మిల్క్ బ్రెడ్ ఒకటి దొరికింది. వేడి అయిన పాలగిన్నెను స్టవ్ మీద నుంచి దించి బ్రెడ్ స్లయిసెస్ ముంచుకుని తినసాగాను. బ్రెడ్ స్లయిసెస్ పూర్తిగా లాగించిన తర్వాత ఆత్మారాముడు శాంతించాడు. కడుపు నిండడంతో కాసేపు పడుకోవాలనిపించింది.

నేను కిచెన్‌లో నుంచి బయటకు వచ్చాను.

నేను మాస్టర్ బెడ్‌రూంలోకి వెళుతుండగా ఫోను మోగింది.

అది జాన్సన్ నుంచి అయివుంటుంది. నా ఊహ నిజ

ఐంది.

అవతల్నుంచి జాన్సన్ కొడుకు మాట్లాడుతున్నాడు. జాన్సన్‌కి ఇప్పుడు 91 సంవత్సరాలట మాట్లాడే స్థితిలో లేడట. హై బిపి, షుగర్, ఇర్రెగ్యులర్ హార్ట్ బీటింగ్స్‌తో బాధపడుతున్నాడట. సాధారణంగా ప్రతి మనిషికీ తన లేదా తనకు సంబంధించిన వాళ్ళ దాన్ని చెప్పుకోవడం అలవాటు. అది హ్యూమన్ నేచర్. నేను అతనికి నా సంతాపం తెలియచేశాను.

పీటర్ కొడుకు మైకేల్ లాయరుగా ప్రాక్టీసు చేస్తున్నాడట. నేను జర్నలిస్టుగా పరిచయం చేసుకుని ఆ హోలీ కాయను గురించి అడిగాను.

నాలో టెన్షను పెరుగుతోంది. ఒకవేళ అది అతని దగ్గర ప్రయివేట్ కలెక్షను క్రింద వుండిపోతే తను కొట్టేసింది నకిలీది అవుతుంది.

మైకేల్ జాన్సను బాంబు పేల్చనే పేల్చాడు. ఆ కాయను అతనివద్ద వుందిట. తండ్రి దగ్గర్నుంచి తనకు సంక్రమించే విలువైన వస్తువుల్లో అది ఒకటట.

నేను నిస్పృహతో అతను ఏదో మాట్లాడుతూంటే ఫోను పెట్టేశాను. తాను వెతికే హోలీ కాయను నకిలీది.

రాత్రి పన్నెండు కాగానే నా సామాన్లు అన్నీ బ్యాగ్‌లోకి సర్దుకుని బాత్‌రూం వెంటిలేటర్ ప్రక్కగా గల పైపు ద్వారా క్రిందికి జారసాగాను.

ఎర్ర తేలుగాడు నా కోసం ఎదురు చూస్తూ వుంటాడు. నేను నేరుగా వెళ్ళి వాడిని కలుస్తాను. శంభూప్రసాద్ ఇంట్లో దొంగిలించిన వాచీ వాడికిచ్చేస్తాను. కానీ నాకు ఫెర్నాండెజ్ ఇంట్లో టెలిఫోనుల అడుగున దొరికిన వజ్రాల్ని, డబ్బుని వాడికి ఇవ్వదల్చుకోలేదు. వాటిని

నా కట్ డ్రాయర్ లోకి తోశాను.

నేరుగా షాపుకి వెళ్ళి డబ్బునీ, వజ్రాల్నీ దాచి ఎర్రతేలు దగ్గరకు వెళ్ళే టైం లేదు. వాడితో చెప్పిన ప్రకారం అంతా టైంకి జరిగిపోవాలి.

ఆలోచిస్తూ పైపుమీదుగా జారుతున్న నాకు పట్టు తప్పింది. మరుక్షణం గాలిలో పల్టీలు కొడుతూ నేలకు గుద్దుకొన్నాను. నా భుజానికి వేలాడుతున్న బ్యాగ్ దూరంగా పడింది.

వెంటనే నాకు స్పృహ తప్పింది.

## 11

ఎక్కడో, కొండల్లో, లోయల్లో గుసగుసలు.... అస్పష్టమైన మాటలు స్టీరియో ఫోనిక్ సౌండ్ ఎఫెక్ట్ లాగా క్రమ క్రమంగా స్పష్టత పొందాయి.

మెల్లిగా కళ్ళు తెరిచాను.

నా ఎదురుగా 'ఎర్రతేలు' నిలబడి వున్నాడు. ఓ మూలనున్న చెక్క పెట్టెమీద నా బ్యాగ్ వుంది. అందులో వుండాల్సిన బంగారపు వాచీ ఎర్రతేలు ఎడం చేతి మణికట్టుని అలంకరించింది.

ఎర్రతేలుని చూడగానే వెంటనే గ్రహించేశాను ఫెర్నాండజ్ ఉండే ఎపార్ట్‌మెంట్స్ దగ్గర నా కోసం రాత్రంతా ఎర్రతేలు మనుషులు కుక్కల్లా కాపలా కాసి వుంటారు. నేను క్రిందపడగానే వాళ్ళు స్థావరానికి మోసుకొచ్చి పడేసి వుంటారు.

"నీ కోసం డాక్టర్ని పిలిపించాన్రా బద్మాష్!" అన్నాడు ఎర్రతేలు. మిగతా శరీరం మీద ఎక్కువ దెబ్బలు తగల్లేదు. ఎడమ మోకాలిచిప్ప ప్రక్క ఎముకల వద్ద కొంచెం డొక్కుపోయింది. అక్కడ ఏదో ప్లాస్టర్

వేశాడు. నేను పడుకున్న మంచానికి ఎదురుగ్గా గోడకు ఒక వాల్ క్లాక్ వుంది. అందులో టైము 12-30 చూపిస్తోంది. అంటే రాత్రి 12 నుంచి ఇప్పటివరకూ 12 గంటలపాటు స్పృహలో లేనన్నమాట...."

"థ్యాంక్యూ, ఎర్రతేలూ! సమయానికి నీ మనుషులు రాకపోతే తికేవాణ్ని కాను" అన్నాను.

"సమయానికి మావాళ్ళు రాకపోతే నువ్వు బ్రతికటం తర్వాత మావాడు చచ్చేవాడు. కిందపడ్డ నిన్ను ఏ గూర్ఖా వాయాలో చూసి పోలీసుల్ని పిలిస్తే నిన్ను లాకప్పులో పడేసేవాళ్ళు. మాకు ఇంకా స్త కష్టమై పోయేది.... లే!.... లేచి త్వరగా బయల్దేరు" అన్నాడు ఎర్రతేలు.

నేను మంచంమీద నుంచి ఒక్క అడుగు వేశానో లేదో ప్రపంచం గిర్రున తిరిగినట్లయింది. తూలిపడబోయి తమాయించుకున్నాను. మంద్రగబ్బ పడిపోకుండా నన్ను పట్టుకున్నాడు.

మేమిద్దరం ఓ టాపులేని జీపులో బయల్దేరాం.

10 నిమిషాల్లో ఎర్రతేలు స్థావరంనుంచి పోలీస్ స్టేషనుకి చేరుకున్నాం. మంద్రగబ్బగాడు స్టేషనుకి 100 గజాల దూరంలో జీపు ఆపి నన్ను లోపలికి వెళ్ళి శంభూప్రసాద్‌ను నేనే చంపినట్లు స్టేట్‌మెంట్ ఇవ్వమన్నాడు.

వెంటనే జీపు దిగి స్టేషనులోకి వెళ్లాను. నా క్లాస్ మేట్ రాంబాబు డ్యూటీలో వున్నాడు.

నా తలమీద కట్లు, శరీరపు వాలకం చూడగా—

"ఏంటి ఇలా తయారయావు. ఏదన్నా దొమ్మీలో పాల్గొన్నావా?" అని అడిగాడు.

నేను నిలబడే వున్నాను. నీరసంగా వుంది.

వెంటనే "హాల్లో" అన్నాడు.

హాల్లోని "నీతో ఒక విషయం చెప్పాలి" అన్నాను.

నా గుండె దడ పెరిగింది. చేయని నేరాన్ని ఒప్పుకోవడం జీవితంలో ఇదే మొదటసారి.

"శంభూప్రసాద్ భార్యని హత్య...." అని నేను చెప్పబోతుండగా ఫోను మోగింది.

రాంబాబు రిసీవర్ అందుకుని చెవికి ఆన్చుకున్నాడు. తర్వాత ఆశ్చర్యంగా దాన్ని నాకు అందించి "నీకు ఫోను" అన్నాడు.

అవతల్నుంచి ఓ వ్యక్తి మాట్లాడుతున్నాడు.

"శంభూప్రసాద్ భార్య మర్డర్ విషయాన్ని నెత్తిన వేసుకున్నావు. ఎలాగూ నీకు ఉరిశిక్ష తప్పదు. దయచేసి ఆ కాయిన్ యెక్కడ పెట్టావో చెప్పు" అన్నాడు. ఆ వ్యక్తి అలా మాట్లాడుతున్నప్పుడు దూరంగా యేదో మ్యూజిక్ వినిపిస్తోంది. నా మెదడు పాదరసంలా పని చేసింది. ఆ మాట్లాడేవాడు యెవడో గ్రహించేశాను. జరిగిన విషయాలన్నీ ఫిలిం రీలులా గిర్రున తిరిగాయి. ఠక్కున ఫోను పెట్టేశాను.

రాంబాబు ప్రశ్నార్థకంగా నా వంక చూశాడు.

"నాకు శంభూప్రసాద్ భార్యను హత్యచేసింది ఎవరో తెలిసిపోయింది రాంబాబూ" అన్నాను.

"శంభూప్రసార్ భార్యని మర్డర్ చేసింది ఎర్రతేలు తమ్ముడు కాదా?" అన్నాడు.

"కాదు. ఆ హత్య చేసినవాడే ఇప్పుడు నాతో మాట్లాడాడు" అన్నాను. ఒక నిజాన్ని కనుక్కున్న ఉత్సుకత యాంగ్జయిటీ నాలో పెరిగిపోతున్నాయ్.

నా ముఖ కవళికల్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ రాంబాబు అడిగాడు.

"ఎర్రతేలు తమ్ముడి వేలిముద్రలు అక్కడ ఉన్నయ్ అందుకే వాణ్ని అరెస్టు చేసి హంతకుడిగా నిర్ణయించాం. నీ అంచనా ప్రకారం హత్య చేసింది ఎవరు?"

హత్య చేసిన మనిషి పేరు చెప్పాను.

రాంబాబు "ఇంపాజిబుల్" అన్నాడు.

నేను జరిగిన విషయం అంతా చెప్పి "శంభూప్రసాద్ ఇంట్లో నాకు ఏం దొరకలేదు. తిరిగి వచ్చేశాను. నాకంటే ముందే ఎర్రతేలుగాడి తమ్ముడు కూడా శంభూప్రసాద్ ఇంట్లో దొంగతనానికి ట్రై చేసి వెళ్ళిపోయాడు. శంభూప్రసాద్ భార్య హత్యా వార్త పేపర్‌లో చూడగానే నా తర్వాత దొంగతనానికి పాల్పడిన మూడో బ్యాచ్ ఆ హత్యకు పాల్పడి వుంటుంది అని భావించాను. ఇప్పుడు వాడే నాకు ఆ రాయన్ కోసం ఫోన్ చేశాడు" అని నా అనుమానానికి దారితీసిన వివరాలు కూడా చెప్పాను.

రాంబాబు నన్ను నమ్మాడు. తక్షణం నలుగురు కాన్‌స్టేబుల్స్‌తో జీప్‌లో బయల్దేరాడు.

రాంబాబు వెళ్ళగానే స్టేషన్‌లోంచి బయటకు వచ్చి మంద్రగబ్బగాడి జీపు దగ్గరకు నడిచాను. వాడు రాంబాబు నాతో మాట్లాడిన తర్వాత హడావుడిగా బయటకు వెళ్ళడం చూశాడు. నేను వాడితో—

"చూస్తూ వుండు శంభూప్రసాద్ పెళ్లాన్ని చంపిన అసలు హంతకుణ్ని ఇప్పుడు పోలీసులు తెస్తారు. అప్పటి దాకా ఇక్కడే వుంటాను. సరేనా!" అన్నాను.

ఓ గంట గడిచిన తర్వాత పోలీసుల్తో చేతులకు

సంకెళ్ళు వేయబడి జీపులో వస్తున్న శంభూప్రసాద్‌ని చూసి మంద్రగబ్బగాడు ఆశ్చర్యపోయాడు.

"ఔను వాడి పెళ్ళాన్ని వాడే చంపాడు. ఎర్ర తేలు తమ్ముడూ, ఆ తర్వాత నేనూ వాడి ఇంటికి దొంగతనానికి వెళ్ళిన తర్వాత మూడో మనిషి ఎవరూ వెళ్ళి వాడి పెళ్ళాన్ని చంపలేదు" అన్నాను.

"మరి ఈ విషయం పోలీసులకు ఎలా తెలిసింది" అన్నాడు. వాడికి జరిగిన కథ అంతా చెప్తే ఆ నాణెం విషయం, మిగతా విషయాలు చెప్పాల్సి వస్తుంది. అందుకని

"ఏమో మరి, నేను నేరం వప్పుకుందామని వెళ్ళేసరికి రాంబాబుకి ఏదో ఫోన్ వచ్చింది. ఆ ఫోన్‌లో ఎవరో శంభూప్రసాద్ తన పెళ్ళాన్ని చంపేశాడని చెప్పారట" అన్నాను.

## 12

ఆ మర్నాడు పేపర్‌లో 'భార్యను చంపిన భర్త' అనే హెడ్డింగ్‌తో శంభూప్రసాద్ తన పెళ్ళాన్ని చంపిన విషయాన్ని వార్తగా ఇలా ప్రచురించారు:

"హైద్రాబాద్, ఆగస్టు 21 నగరంలోని ఈ సామియా బజార్ ప్రాంతంలో నివసించే శంభూప్రసాద్ అనే వ్యక్తి తన భార్యను ఇనుపరాడ్‌తో బలంగా కొట్టగా ఆమె అక్కడికక్కడే మరణించింది.

సబ్ ఇన్‌స్పెక్టర్ రాంబాబు పర్యవేక్షణలో జరిగిన దాడిలో పరుపుక్రింద దాచి వున్న హత్యాయుధం దొరికింది. శంభూప్రసాద్ తన నేరాన్ని వప్పుకున్నాడు."

నేను పేపర్ని నాలుగు మడతలుగా మడిచి ప్రక్కన పెట్టాను. నాకిప్పుడు యెంతో ఆనందంగా వుంది. ఎర్ర

తేలుగాడి బాధ విరగడ అయింది.

నాకెందుకో సుబ్బలక్ష్మిని చూడాలని అనిపించింది. ఆమెను చూసి దాదాపు మూడునెలలయింది. నేను సుబ్బలక్ష్మిని గురించిన ఆలోచనలతో కూర్చుండిపోయాను. అలా యెంతసేపు కూర్చున్నానో నాకే తెలియదు.

"సార్! మీ దగ్గిర 'ప్రేమించి చూడు' నవల దొరుకుతుందా?" అని వినపడగానే ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను. ఎదురుగ్గా సుబ్బలక్ష్మి నిలబడి నవ్వుతోంది.

నేను ఛటుక్కున కౌంటర్‌లోంచి ఇవతలకు దూకి, షట్టర్ని సగానికి దించాను. మేం ఇద్దరమూ లోపలి గదిలోకి వెళ్లిన తర్వాత నా తలమీద వేసిన బ్యాండేజీ మీద చూపుడువేలితో సున్నితంగా రాస్తూ—

"ఏమైంది నీకు. ఎలా దెబ్బతగిలింది" అని ఆందోళనగా అడిగింది.

పమిటి తొలగగా ఎత్తుగా కనిపిస్తున్న ఆమె స్తనద్వయం, వాటి మధ్య అగాధం సృష్టిస్తున్న నల్లటి చార నన్ను పిచ్చివాణ్ని చేశాయి. నేను ఆవేశం ఆపుకోలేక ఆమెను కౌగిలిలోకి తీసుకున్నాను. ఆ తొందరపాటులో సుబ్బలక్ష్మి గడ్డం నా నుదుటికి తగిలి యమానొప్పి పుట్టింది. అయినా ఖాతరు చేయకుండా ఆమెను మరింత బలంగా హత్తుకున్నాను నా ఒంటికేసి.

మామూలుగా అయితే సుబ్బలక్ష్మి ఇలాంటి సమయంలో తన రెండు చేతులనూ నా వీపు వెనక్కి చేర్చి రెస్పాన్సు యిచ్చేది. కానీ ఈ తడవ నిస్తేజంగా చేతిలోని టిఫిన్ బాక్సుతో నిలబడి పోయింది. ఆమె ప్రవర్తన చూసిన తర్వాత నా బిగి సడలించి నేలమీద కూర్చుండిపోయాను.

"అసలేం జరిగింది?" ఈ తడవ ఆమె కంఠంలోంచి దూసుకొచ్చిన సీరియస్‌నెస్‌కి తల వొగ్గక తప్పలేదు.

జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పుకొచ్చాను. అంతా విన్న సుబ్బలక్ష్మి ఆశ్చర్యంతో నోరు తెరిచింది. తెరుచుకున్న ఆమె నోటిని చేత్తో మూశాను.

సుబ్బలక్ష్మి నా చేతిని తొలగించి "మరి శంభూప్రసాద్ తన భార్యను చంపినట్లు ఎలా తెలుసుకో కలిగావ్?" అన్నది.

నేను చెప్పటం మొదలు పెట్టాను.

"శంభూప్రసాద్ గాడి ఇంట్లోని ఐరన్ సేఫ్‌లో చాలా కాగితాలు ఉన్నయ్. వాటిల్లో తన భార్య పేర్న అయిదు లక్షలకు ఇన్సూర్ చేసిన బాండ్ కూడా వుంది. నేను దొంగతనం చేసి వచ్చిన తర్వాత శంభూప్రసాద్ భార్యతో తిరిగివచ్చి వుంటాడు. ఇంటి పరిస్థితిని చూసి దొంగతనానికి పాల్పడినట్లు గ్రహించాడు. వెంటనే అవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నాడు.

ఓ ఇనుప రాడ్‌తో పెళ్ళాం తలమీద ఒక్కటిపెట్టి పైలోకానికి పంపించి ఆ నేరాన్ని దొంగలమీదకు నెట్టాడు. పోలీసులు అతని కథను నమ్మారు.

ఇక శంభూప్రసాద్ గాడు చచ్చిన పెళ్ళాం తాలూకు ఐదులక్షల ఎల్లయిసీ పాలసీ గురించి కలలుకంటూ కూర్చున్నాడు. వాడు అంతటితో ఊరుకోలేదు. తను పోగొట్టుకున్న హోలీకాయన్ గురించి ఎంక్వయిరీ మొదలు పెట్టాడు. దాన్ని తిరిగి సంపాదించాలని ప్రయత్నాలు సాగించాడు. ఆ ప్రయత్నాల్లో నాకు ఫోన్ చేశాడు."

"అతను నిన్ను యెందుకు అనుమానించాడు? నీకు ఎలా ఫోన్ చేయగలిగాడు" సుబ్బలక్ష్మి అడిగింది.

"మొదట శంభూప్రసాద్ భార్య చనిపోయినప్పుడు పాత కేడీల్ని అందర్నీ ఇంటరాగేట్ నిమిత్తం పిలిచారు అప్పుడే శంభూప్రసాద్ కూడా తన యింట్లో దొంగతనం జరిపిన వాళ్ళని గుర్తుపడతానంటూ పోలీస్ స్టేషన్ కి వచ్చాడు. ఆ సమయంలో మాటల సందర్భంలో అక్కడికి వచ్చిన దొంగల వివరాలు, పేర్లు, మొదలయినవి తెల్సుకున్న ఆ తర్వాత ఎలాగోలా కొంతమందివయినా అడ్రసులు సంపాదించి వుంటాడు. ఈ సిటీలో ప్రతి రౌడీ వెధవా ఏదన్నా బార్ లోనో. షాపులోనో పని చేస్తూ వుంటాడు. కొంతమందికయితే స్వంత ఫోన్లు కూడా వున్నయ్ ప్రతి ఒక్కడికీ ఫోన్ చేసి

"శంభూప్రసాద్ యింట్లో దొంగతనం చేశావుగదా! అప్పుడు దొంగిలించిన పోలీశాయున్ ఎంతకమ్ముతావు" అని అడగడం మొదలుపెట్టాను.

చాలామంది రౌడీవాయాళ్ళు బిత్తరపోయి తెలియదన్నట్లు సమాధానం చెప్పారు. నేను మాత్రం బేరానికి దిగాను. దాంతో వాడికి నేనే దొంగిలించినట్లు నిర్ధారణ అయింది."

"మరి నువ్వు పోలీస్ స్టేషన్ కి వెళ్ళి చేయని నేరాన్ని ఒప్పుకోవడానికి సిద్ధపడినపుడు నీవు వాడు ఎలా ఫోన్ చేయగలిగాడు? వాడికి అదే సమయంలో నువ్వు స్టేషన్ కి వెళ్తున్నట్లు ఎలా తెల్సు?"

సుబ్బలక్ష్మి ఈ ప్రశ్న వేసేవరకు నాకు ఇలాంటి ఐడియానే రాలేదు. ఆ విషయం వెంటనే తేల్చుకోవాలనిపించింది. అదే విషయం సుబ్బలక్ష్మితో చెప్పి ఆమె తెచ్చిన డిబ్బరొట్టెను నేతిలో ముంచి అల్లప్పచ్చడితో అద్దుకుని తిన్న తర్వాత శంభూప్రసాద్ ని కలవ

దానికి బయల్దేరేముందు సుబ్బలక్ష్మి మరో ప్రశ్న వేసింది.

“అసలు శంభూప్రసాద్ ఈ మర్డర్ చేసినట్లు ఎలా అనుకున్నావ్?” అని.

“ఇన్‌స్పెక్టర్ రాంబాబు దగ్గరికి వెళ్ళి నేను నేరం చేసినట్లు చెప్పే సమయంలో ఫోన్ మోగింది. ఆ ఫోన్‌లో అంతకుముందు నాణెం గురించి అడిగిన వ్యక్తి మాట్లాడాడు, చేసి ‘ఎలాగూ నువ్వు చేయని నేరాన్ని ఒప్పుకుంటున్నావు. నీకు ఉరిశిక్ష తప్పదు. దయచేసి ఆ నాణెం యెక్కడుందో చెప్పు’ అని అడిగాడు.

ఆ వ్యక్తి అలా అడుగుతున్నప్పుడు ప్రక్కన ఒక మ్యూజిక్ వినిపించసాగింది. అది నేను శంభూప్రసాద్ యింటికి దొంగతనానికి వెళ్ళినప్పుడు నా కాలికి తగిలిన పియానో బొమ్మ చేస్తున్న శబ్దం.

అంతేకాక పోలీస్ స్టేషన్‌లో రాంబాబు నన్ను చూపించి ఇతనేనా నీ భార్యను చంపింది అని అడిగినప్పుడు శంభూప్రసాద్ గాడు లేదు అని చెప్పాడు. ఆ గొంతు నాకు బాగా గుర్తుంది. ఆ తర్వాత నాతో ఫోన్‌లో మాట్లాడిన వ్యక్తి గొంతుకూడా అదే.

నాతో మాట్లాడేముందు ఆ పియానో బొమ్మకు కీ యిచ్చి వుంటాడు. అది తన పని చేసుకుపోసాగింది. అతడు పియానో బొమ్మకు కీ ఇవ్వకపోతే ఫ్లాష్‌లా నాకు ఐడియా వచ్చి వుండేది కాదు. ఇవ్వాళో రేపో ఉరిశిక్ష కూడా పడేది” అన్నాను.

సుబ్బలక్ష్మి టిఫిన్ బాక్స్ సర్దుకుని లేచి నిలబడింది. నేను ఆమెను ఇంకా కాసేపు వుండమని బలవంత పెట్టలేదు. ఎందుకంటే ముందు పోలీస్ స్టేషన్‌లో వున్న శంభూప్రసాద్ గాణ్ని కలవాలి.

# 13

శంభూప్రసాద్‌తో మాట్లాడటానికి నాకు పర్మిషన్ దొరికింది. శంభూప్రసాద్ గడ్డం పెరిగి ఒక్కరోజులోనే 60 సం॥ల వయస్సు పైబడినవాడిలా కనిపిస్తున్నాడు.

అతన్ని రెండే రెండు ప్రశ్నలు వేశాను. మొదటి ప్రశ్న నేను పోలీస్ స్టేషన్‌లో రాంబాబుతో మాట్లాడుతుండగా ఎలా ఫోన్ చేయగలిగాడు అనేది. దానికి శంభూప్రసాద్ ఇలా చెప్పుకొచ్చాడు:

"హత్యా నేరం ఎర్రతేలు తమ్ముడిమీదకు పోయింది. దాంతో నేను హాయిగా ఊపిరి పీల్చుకున్నాను. ఇక పోగొట్టుకున్న కాయిన్ గురించి ప్రయత్నించసాగాను. ఆ ప్రయత్నంలో చీకట్లోకి వదిలితే తగిలిన బాణంలా నువ్వు దొరికావు. ఆ నాణెం దొంగిలించినవాళ్ళని ట్రేస్ చేయడానికి నేను అమలుపరిచిన ప్లాను నువ్వు ఈపాటికే గ్రహించి వుంటావు.

ఆ తర్వాత యెంత ప్రయత్నించినా నీ పబ్లిక్ ఫోన్ రింగ్ అవుతుందేగాని యెవరూ యెత్తడంలేదు. వచ్చి చూస్తే నీ షాపు మూసి వుంది. మా ఆవిడకు నీ పుస్తకాల లైబ్రరీలో ఖాతా వుందని కూడా నాకు తెల్సు. ఏం చేయాలో నాకు పాలుపోలేదు.

ఆ తర్వాత నువ్వు మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో మంద్రగబ్బగాడితో కల్సి జీపులో వెళ్ళడం చూశాను. ఎర్రతేలు ముఠా గురించి నగరంలో ప్రతి ఒక్కరికీ తెల్సు. అందుకే మంద్రగబ్బవాణ్ణి గుర్తుపట్టాను.

నిన్ను జీపులో చూడగానే నాకు మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. ఎర్రతేలుగాడి తమ్ముడికి నా భార్యను

చంపినందుకు శిక్షపడుతుంది. ఆ శిక్ష ఉరిశిక్షే.

నేను మరో విషయం గ్రహించాను. నీకు మొదటి సారి ఫోన్ చేసినప్పుడు హారీరాయన్ ఉన్నదని వప్పుకున్నావు. కాని మా ఇంట్లో ఎర్రతేలుగాడి తమ్ముడి వేలుముద్రలూ, వాడు పోగొట్టుకున్న గ్లవుజులూ దొరికాయి. అంటే మొత్తానికి మీ ఇద్దరూ ఒకరి తర్వాత ఒకరు దొంగతనానికి ప్రయత్నించారన్న సంగతి గ్రహించాను. ముందుగా యెవరు ఈ పనికి పాల్పడిందీ నాకు తెలియదు" అన్నాడు శంభూప్రసాద్.

"ముందుగా ఎర్రతేలు తమ్ముడు మా ఇంట్లోకి వచ్చాడు. ఆ తర్వాత నేను వచ్చాను" అని చెప్పాను.

శంభూప్రసాద్ చెప్పటం కొనసాగించాడు:

"నిన్ను జీప్‌లో మంద్రగబ్బతో చూశానని చెప్పాను కదా! అప్పుడు నీ తలకు కట్టువుంది. ఒక వేళ కొంపదీసి ఎర్రతేలుగాడు నిన్ను బలవంతంగా నేరం ఒప్పుకోమని ఒత్తిడిచేసి పోలీస్‌స్టేషన్‌కి పంపించాడేమోనని నాకు అనుమానం వచ్చింది. స్కూటర్ మీద వెంబడించాను.

నా ఊహ నిజమయింది. మీరు పోలీస్‌స్టేషన్ వైపు వెళుతున్నారు.

ఏదన్నా షాపునుంచి నీతో మాట్లాడి ఆ రాయన్ విషయం ఎత్తడం నాకు ఇష్టంలేదు. అందుకే స్పీడుగా ఇంటికి వచ్చి పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేసి నీతో మాట్లాడాను.

ఆ తర్వాత మా ఇంటిమీద ఊహించని రీతిలో రైడింగ్ జరిగింది. పట్టుబడ్డాను. ఇనుపరాడ్ మీద నా వేలిముద్రలు, నా భార్య రక్తం, ఆమె వెంట్రుకలు అంటుకుని వున్నయ్!" అని సందేహంగా ఆగిపోయాడు.

శంభూప్రసాద్ అనుమానం యేంటో నాకు తెల్సు. తన గురించి పోలీసులకు యెలా తెల్సింది అనేదే అతని అనుమానం. బొమ్మపియానో శబ్దం గురించి చెప్పాను. తక్షణం అతని ముఖం పాలిపోయింది.

"అవును అది టెలిఫోన్ ప్రక్కనే పెట్టి వుంది. ఒకోసారి దాని 'కీ' పనిచేస్తుంది. ఒకోసారి పనిచేయదు. అంతకుముందే 'కీ' ఇచ్చి వుంది, అనుకుంటూ మధ్యలో దాని మెకానిజం స్ట్రక్ అయిపోయి వుంటుంది. ఫోన్ చేసేటప్పుడు నా చేయి తగిలి క్రిందపడి మోగసాగింది. దాన్ని తీసి టీపాయ్‌మీద పెట్టి నీతో మాట్లాడాను."

"మరి నువ్వు నకిలీ కాయిన్ ఎందుకు తయారు చేశావ్!" ఇది నేను శంభూప్రసాద్‌ని వేసిన రెండో ప్రశ్న.

నా ప్రశ్నకు శంభూప్రసాద్ దిమ్మెరపోయాడు. రెండు క్షణాల్లో తేరుకుని—

"నాకు గుర్రప్పందాల పిచ్చి, అమ్మాయిలపట్ల మోహం, తాగుడు అలవాట్లు ఉన్నయ్. లక్షల రూపాయలు హారతి కర్పూరంలా హరించుకుపోయాయి. చివరకు అప్పులు చేయడం మొదలుపెట్టాను. అప్పులు తీర్చే మార్గం కనిపించలేదు. కానీ నేను ఒక పుస్తకంలో బుద్ధుడి హాలీకాయిన్స్ గురించి చదివాను. ఆ పుస్తకంలో వర్ణించిన దానిప్రకారం బుద్ధుడి అస్తికలతో పాటు ఉండే హాలీకాయిన్స్‌కి ఛత్రంకూడా వుంటుంది.

రమేష్ అనే నా స్నేహితుడి కొడుక్కి కాయిన్స్, స్టాంప్ కలెక్షన్ చేసే అలవాటు వుంది. అతనివద్ద ఛత్రం లేని బుద్ధుడి బొమ్మగల నాణేన్ని చూశాను. వెంటనే నేను దాన్ని తొలగించి అంతకుముందు పుస్తకంలో నేను

చూసిన బొమ్మ ప్రకారం ఛత్రాన్ని అమర్చాను. ఈ పని చేయడానికి నాకు తెల్సిన 'గోల్డుస్మిత్' సహాయం తీసుకున్నా. దాన్ని అమ్మి లక్షలు గడించాలనే నా ప్రయత్నం, ఇంతకూ నీకు...."

"ఔను! నాకు అది నకిలీది అని ఎలా తెల్సింది అనే కదూ నీ అనుమానం. ఆ కాయిన్ ఉండాల్సిన అన్ని మ్యూజియంలకూ ఫోన్లు చేసి అవి అక్కడ భద్రంగా వున్నాయని కనుక్కున్నాను.

చూడు శంభూప్రసాద్! ఎల్లయిసీ పాలసీ డబ్బు కోసం పెళ్ళాన్ని చంపటం, నకిలీ నాణేలు తయారు చేయడంలాంటి పనులు యెందుకు చెప్పు. నీకంటే మా లాంటి దొంగలు నయం. మేం తిండికోసం, కనీస కోర్కెలకోసం దొంగతనానికి పాల్పడితే నీలాంటి వాళ్ళు వ్యసనాలకు బానిసలయి నేరాలు చేయడం ఘోరం. నీ పాపానికి నిష్కృతిలేదు" అన్నాను.

శంభూప్రసాద్ తల దించుకుని ఏడుస్తున్నాడు. నేను అక్కడ ఉండలేక వచ్చేశాను, బయటకు వెళ్ళబోతున్న నన్ను అప్పుడే స్టేషన్లోకి వస్తున్న రాంబాబు ఆపి —

"ఇంతకూ ఆ నకిలీ కాయిన్ యేమైపోయి ఉంటుం దంటావ్ ?" అన్నాడు.

దగ్గిర్లో ఉన్న కుర్చీలో కూలబడి ఆలోచించడం మొదలు పెట్టాను. నాకు ఫెర్నాండజ్ అన్న మాటలు గుర్తుకు వచ్చాయి.

అతను "ఈ నాణెం నకిలీదో, అసల్దో ఎక్స్‌రే తీయించి చూడాలి" అన్నాడు.

అదే విషయం నేను రాంబాబుతో చెప్పి "ఫెర్నాం డజ్ ఎక్స్‌రే తీయించడానికి ఆ నాణెం తీసుకుని వెళ్లి

వుంటాడు. అది చాలా ఫేమస్ కాయిన్ కనుక దాన్ని ఎక్స్‌రే తీసిన వ్యక్తి దొంగిలించే ప్రయత్నంలో ఫెర్నాం డజ్‌ని చంపి వుండవచ్చు" అన్నాను. రాంబాబు పాలోచనగా తలపంకించాడు.

ఫెర్నాండజ్ ఫ్లాట్ ప్రక్కనే ఒక పెథాలాజికల్ కం ఎక్స్‌రే లాబ్ వుంది. "ఫెర్నాండజ్ ఒకవేళ ఆ లాబ్‌లో ఎక్స్‌రే తీయించాదేమో!" అన్నాను.

తరచూ ఫెర్నాండజ్‌ని కలవడంవల్ల అతని ఇంటి పరిసరాల గురించి నాకు బాగా తెల్సు.

నేను ఈ మాట అన్నానో లేదో, రాంబాబు నలుగురు కానిస్టేబుల్స్‌తో బయల్దేరాడు.

నేను ఊహించింది నిజమైంది. ఫెర్నాండజ్ వుంటున్న ప్రక్క ఫ్లాట్‌లోని విశ్రాంతి పెథాలజీ అండ్ ఎక్స్‌రే యూనిట్ ప్రొప్రయిటర్ రామానంద సాగర్‌ని నాలుగు తన్నే సరికి నిజం చెప్పేసుకున్నాడట. హోలీకాయిన్ అతని సేలులో వుందట.

ఫెర్నాండజ్ హోలీకాయన్ని ఎక్స్‌రే తీయించ డానికి వచ్చాడట. రామానందసాగర్ దాన్ని ఎక్స్‌రే తీసి ఇచ్చాడు. ఆ తర్వాత మెల్లిగా ఫెర్నాండజ్ వెనకే వెళ్ళి కత్తితో కసకసా పొడిచేశాడట. అతనికి మరణశిక్ష పడింది.

ఎర్ర లేలు తమ్ముణ్ని తప్పించి అసలు హంతకుణ్ని కనిపెట్టినందుకూ, ఫెర్నాండజ్‌ని చంపింది యెవరో కూడా తేల్చినందుకు రాంబాబుకి డిపార్టుమెంటులో మంచి పేరు వచ్చింది. త్వరలో అతనికి ప్రమోషన్ కూడా రావచ్చు.

నిజానికి ఈ రెండు కేసుల్లోనూ నేను ఎంతో కృషి

చేసి అసలు హంతకుల్ని పట్టుకునేందుకు తోడ్పడ్డాను. కాని రాంబాబుగాడికి పేరొచ్చింది. నావల్ల వాడికి జరిగిన లాభానికి కృతజ్ఞతగా రాంబాబు కేసులో నన్ను ఇరికించలేదు. లేకపోతే దొంగతనం నేరంకింద కనీసం మూడు నెల్లన్నా లోపల కూర్చోవాల్సి వచ్చేది.

అంతేకాక, రాంబాబు నా పేరు పాతకేడీల లిస్టులో నుంచి తీసేయిస్తానని మాట ఇచ్చాడు. నేను కూడా అతనికి జీవితంలో మరెప్పుడూ దొంగతనం చేయనని మాటిచ్చాను.

* * *

ఆ సంఘటన జరిగిన మూడు నెల్లకు నేనూ సుబ్బలక్ష్మి రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్ళిచేసుకున్నాం.

నా తరఫున రాంబాబు, ఎర్రతేలు, మరికొంతమంది జేబుదొంగలు హాజరయ్యారు. సుబ్బలక్ష్మి తరఫున వాళ్ళ ఆఫీసు బాసూ, నలుగురయిదుగురు క్లర్కులూ, ఇద్దరు అటెండర్లూ వచ్చారు.

మా పెళ్ళి చాలా సింపుల్ గా జరిగిపోయింది.

అసలు మా పెళ్ళి ఇంత ఆలస్యంగా జరిగేదికాదు. కానీ సుబ్బలక్ష్మి బామ్మ కాశీకి వెళ్ళి ఎన్నాళ్ళయినా తిరిగి రాకపోవడంవల్ల ఎదురు చూసీ చూసీ విసిగి వేసారి పెళ్లి చేసేసుకున్నాం.

మా పెళ్ళికి నెలరోజులు ముందుగానే రెండు గదుల పోర్షన్ ఒకటి నల్లకుంటలో అద్దెకు తీసుకున్నాను. సుబ్బలక్ష్మి దగ్గర సంసారం పెట్టటానికి కావల్సిన సామగ్రి చాలా వుంది. ఆమె సావాసంవల్ల నేను దొంగతనాలు పూర్తిగా మానేశాను.

ఈ రోజు మా ఇద్దరికీ శోభనం.

నేను సుబ్బలక్ష్మిని చేతుల్లోకి తీసుకున్నాను. ఆమె కంటిరెప్పలమీద, బుగ్గలమీదా, పెదాలమీదా, చుంబించాను. సుబ్బలక్ష్మి అధరాలు వేడిగా వున్నై.

నా తలను మరికొంచెం క్రిందకు దించి మెడమీద ముద్దుపెట్టుకుని ఆమె సమున్నత వక్షద్వయానికి నా ముఖాన్ని గుద్దుకున్నాను. సుబ్బలక్ష్మి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు బలంగా వెలువడుతున్నై.

నా వేళ్ళు చీర కుచ్చిళ్ళమీద కొద్ది క్షణాలు నాట్యం చేశాయి. ఆమె చీర కాళ్ళక్రింద కుప్పగా పడింది. లంగా బొందు ముడి మాత్రం ఒక్కపట్టాన వూడిరాలేదు. పళ్ళతో పీకాను. వేళ్ళతో లాగాను. ఒకపక్క నాకు వేడి సెగలు పెరిగిపోతున్నయ్.

ఇలాంటి సమయంలో నే సుబ్బలక్ష్మి ఏదో ఒక అసందర్భపు మాటతో నా వేడి చెదరగొడుతుంది. కానీ ఈ రోజు అలాంటి మాటలేం మాట్లాడలేదు.

నా అవస్థ చూసి సుబ్బలక్ష్మికి నవ్వొచ్చింది. కిలాకిలా నవ్వి చూపుడువేలూ, బొటనవేలూ పట్టుకుని లంగా బొందుని ఏంచేసిందో ఏమో ఒక్కసారిగా ముడి ఊడిపోయింది. ట్యూబ్ లైట్ కాంతిలో ఆమె తొడలు తళుక్కున మెరిశాయి.

ఆ తర్వాత ఓహ్ ... మాటల్లో చెప్పలేను. చెమట పట్టిన శరీరాల్తో తృప్తిగా తీరిన కోర్కె తెచ్చిన తమకంలో ఒకళ్ళను ఒకళ్ళు పెనవేసుకుని వుండిపోయాం. ఇద్దరికీ మాట్లాడాలి అనిపించలేదు.

నేనే ముందుగా మౌనాన్ని భగ్నం చేస్తూ, "ఇలాంటి పనులు చేసే ఏదో ఒక అసందర్భపు మాట మాట్లాడి నా మూడ్ చెడగొట్టేదానివి. మరి ఈ రోజు...." అన్నాను.

సుబ్బలక్ష్మి నా సందేహాన్ని అర్థం చేసుకుంది.

"నాకు నువ్వు చేసే చిలిపి పనులకు అడ్డు చెప్పడం ఇష్టం లేదు. ఎందుకంటే నీ మనస్సు ఎక్కడ బాధపడుతుందో అని భయం. మరి ఊరుకుంటే చెలరేగి పోయి కొంప ముంచేస్తావని మరో భయం. అందుకని కద్దవకుండా నీ మూడ్ చెడగొట్టడం మంచిదని నిర్ణయించుకున్నాను ఇక మన పెళ్లి అయిపోయింది కనుక నీకు పదేపదే మూడ్ తెప్పించడమే నా పని" అని నన్ను ముద్దు పెట్టుకుంది.

—: అ యి పో యి ం ది :—

# రహస్య సారంగం!

భీమవరపు పురుషోత్తం

నిర్మానుష్యమైన ప్రాంతం అది—

గేలం కాస్త బరువుగా అనిపించి, చటుక్కున గేలాన్ని వెలుపలికి లాగాడు ప్రభాకరన్. అర చేతి వెడల్పున వెండిబిళ్ళలా మెరుస్తూన్న చేప గిలగిలా కొట్టుకొంటూ కనిపించింది లావుపాటి దారం చివర. దాన్ని అందుకొని ప్రక్కనే పరిచిన గుడ్డముక్కపై పడేశాడు.

అలాంటివి మరో నాలుగు వున్నాయి అక్కడ.

అతడి వద్ద బ్రెడ్ అయిపోయి ఒకరోజా గడిచింది.

దారాన్ని సన్నటి కర్రకు చుడుతూ భారంగా లేచాడు ప్రభాకరన్.

మిలట్రీ డ్రస్సులో వున్నాడతడు. చిక్కటి తల విపరీతంగా పెరిగి మాసిపోయి వుంది. గుబురుగా పెరిగిన గడ్డం మీసంలో అతడి చామనచాయ ముఖం చిన్న చిన్న కళ్ళు వింతగా వున్నాయి. పొడవైన, దృఢమైన అతడి దేహం ఫోర్స్‌కి సంబంధించిన వ్యక్తిగా అతడికి

గుర్తింపు నిస్తూంది. అతడి రొమ్ముపై బి. ఎస్. ఎఫ్., (బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్) అన్న అక్షరాలు కనబడుతున్నాయి.

పక్కనే పరిచిన కిట్ లోనుండి పెన్ నైఫ్ తీసాడు ప్రభాకరన్. చేపల్ని చెక్కాడు. రెండు మూడు ఇంకా కదులుతున్నాయి. ముందుగా సిద్ధం చేసుకున్న ఎండు పుల్లల్ని అంటించాడు లైటర్ తో. గాలి పెద్దగా లేక పోవడంవల్ల మంట నిలువుగా పైకి ఎగుస్తోంది.

సన్నటి వైరుకు చేపల్ని గుచ్చి దోరగా కాల్చాడు. బాగ్ లోనుండి చిన్న డబ్బాతీశాడు. ఉప్పుకారం ప్లేవర్ నిచ్చే పౌడర్ ను ఒక్కొక్క చేపపై చల్లుతూ మెల్లగా తిన్నాడు వాటిని....నీళ్ళు తాగి లేచాడు.

కిట్ సర్దుకొని వీపుకు కట్టుకొన్నాడు క్రింద పడున్న గేలంనుండి ఇనుప ముళ్ళతో సహా దారాన్ని తెంపుకొని కిట్ లో పడేసుకొన్నాడు. నేలపై పచ్చగడ్డిలో వల్లగా నిగనిగలాడుతూన్న స్టెన్ గన్ ను అందుకొన్నాడు. మెషిన్ గన్ కన్నా తక్కువ బుల్లెట్ రేన్ గల గన్ అది. స్టెన్ గన్ సెక్యూరిటీ ఫోర్స్ విరివిగా వాడే ఆయుధం.

విశాలంగా పడుతున్నాయి అతడి అడుగులు. ఆర్మీ ఫోర్స్ లో సహజంగా వచ్చే పొజిషన్ అతడి నడకలో కనబడుతూంది.

ప్రస్తుతం అతడు నడుస్తూన్నది భారత భూభాగం. అతడికి తెలుసు ఎడంవైపుగా పోతే అక్కడి నుండి దాదాపుగా ఎనిమిది కిలోమీటర్ల దూరంలో పాకిస్తాన్ బోర్డర్ ఎదురౌతుందని!? ప్రతిరోజూ కాల్పులు జరిగే ప్రాంతం అది!

సూటిగా నడక సాగిస్తున్నాడు ప్రభాకరన్. అతడి కళ్ళు మాత్రం చుట్టూ వెదుకుతున్నాయి. పొడవయిన సన్నటి చెట్లు వాటి చుట్టూ పెనవేసుకొనిపోయిన లతలు ముళ్ళకంపలు దర్శనమిస్తున్నాయి ఎక్కడ చూసినా..

పచ్చటి ఆ వాతావరణంలో పక్షులు అరుపులు తప్పితే మరే శబ్దంలేదు. చెరువు దగ్గరలో ఉండటంవల్ల సమీపంలో చాలా దూరం నేలంతా కొద్దిపాటి చెమ్మదనాన్ని కలిగి వుంది.

ఊపిరి పీల్చడం మాని చెవులు నిక్కించాడు ప్రభాకరన్. అతడి కుడిచేతి వేళ్ళు స్టెన్‌గన్‌ను తడుముతున్నాయి. చుట్టూ గోడలా అలుముకొన్న చెట్లచాటు నుండి, దూరంగా సన్నటి శబ్దం వినబడుతూంది.

క్షణంలో రిలీఫ్ అయ్యాడు. దగ్గరయి కొద్దిశబ్దాన్ని గ్రహించాడు ప్రభాకరన్. అతడి ముఖం విప్పారింది కొద్దిగా. రెండుగోజాలుగా వెదుకుతున్నాడతడు తన సహచరుడి కోసం.

ట్రక్కు శబ్దాన్నిబట్టి చెట్ల మధ్యనుండి కదిలాడు. అతడి చేయి మాత్రం గన్ పైనే స్థిరంగా వుంది.

కాసేపటికి ప్రభాకరన్‌కి సందేహం తొలగిపోయింది. ముందుకి కదిలాడు. కొంతదూరానికి చెట్లు అంతమయ్యాయి — దూరంలో తాటితోపు ప్రక్కనుండి దూసుకొని వస్తూంది ముదురు సిమ్మెంట్ రంగు మిలటరీ ట్రక్కు.

## 2

స్టెన్‌గన్ పైకి పేల్చాడు. నిలబడ్డాడు. ఎదురుగా ట్రక్కు క్రమంగా దగ్గరయింది! లోపల ఒకే మనిషి వున్నాడు డ్రైవ్ చేస్తూ. "తంగా..........!" బిగ్గరగా

అర్చాడు ప్రభాకరన్ గొంతెత్తి.

ట్రక్కు దుమ్ము రేపుకుంటూ వచ్చి ఆగింది. "హలో హై ఫ్రెండ్?" తెల్లబోతూ జీపు దిగాడు తంగరాజు. అతడి ఆర్మీ దుస్తులు దుమ్ముకొట్టుకుపోయి వున్నాయి.

ప్రభాకరన్ ముందుకు కదిలి తంగరాజును భుజాల వరకూ వాటేసుకున్నాడు ఆనందంగా.

"నిన్ను మళ్ళీ చూస్తాననుకోలేదు.... వెరీ లక్కీ!" అన్నాడు ఆప్యాయంగా తంగరాజు భుజం తట్టి. కొద్ది పాటి దుమ్ము రేగింది, తంగరాజు భుజం పైన.

"వాళ్ళిద్దర్ని కోల్పోయినా మనం తిరిగి కలిసినందుకు చాలా హేపీగా వుంది" తన సంతోషాన్ని ప్రకటించాడు తంగరాజు.

"మన సామాను కొంతయినా మిగిలిందా?" అడిగాడు ప్రభాకరన్ ట్రక్కును పరిశీలిస్తూ.

తంగరాజు చెప్పాడు. "శత్రువుల దాడి తర్వాత వాళ్ళు ఈ ట్రక్కు తగలబెట్టేసేవారే! కానీ అక్కడే మనల్ని అదృష్టం ఆదుకుంది. ట్రక్కు రాడర్ సావరాల వెనుకనున్న ఒండ్రుమట్టి గోతులలో పడిపోవడంవల్ల వాళ్ళు దీనిసంగతి పట్టించుకోకుండా వెళ్ళిపోయారు....

....గోతిలో పడిన ట్రక్కు పొజిషన్‌లోనే వుండటంవలన తర్వాత నేనొక్కడిని కష్టపడి దీన్ని వెలుపలికి నడుపుకుంటూ వచ్చాను. మన సామాను కొద్దిగా మిగిలింది. చాలావరకూ బ్రేక్ అయిపోయింది!"

"గుడ్‌లక్!" అన్నాడు ప్రభాకరన్. మళ్ళీ అన్నాడు "శత్రువులు మనల్ని ఎటాక్ చేసింది, మన రాడార్ సావరాల వెనుక అంటే ఈ దిశ" చేత్తో తనముందు నడిచినవైపు చూపాడు ప్రభాకరన్. "రెండు ట్రక్కుల

నిండా ఉన్నవాళ్ళు. ఇరవై మందికి పైనే వుండొచ్చు. మిత్రుల చావు నన్ను బాగా కృంగదీసింది ...

....సారి మనం రహస్యాన్ని శోధించడంకంటే యెదురు దాడికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. అలాగయితే మన పని సానుకూలమవడానికి అవకాశంకూడా వుంటుంది...."

శంకరరాజు అంగీకారంగా చూశాడు. క్షణాల్లో ఇద్దరూ ఎక్కిన జీపు క్రింద రాళ్ళను నలగ్గొడుతూ సాగిపోయింది!

ఇండియా—పాకిస్తాన్ బోర్డర్‌లో విరివిగా కాల్పులు జరుగుతున్న ప్రాంతం అది! ఎన్నో మైళ్ళ పొడవున్న సువిశాలమైన బోర్డర్‌లో అధిక సంఖ్యలో అల్లర్లు జరుగుతున్న ప్రాంతం అదే! అందుకు ప్రధాన కారణం పాకిస్తాన్ సైనికుల కవ్వింపు చర్యలు. అంతకంటే ముఖ్యమైన కారణం! తరచుగా పాకిస్తాన్ సైనికులు బోర్డర్ దాటి భారత భూభాగంలో ప్రవేశించడం!?!

సమస్యను అంతర్లీనంగా పరిశీలించడానికి, వీలయితే పరిష్కరించడానికి బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్‌ను నియమించింది ప్రభుత్వం. ప్రథమ చర్యగా బి.ఎస్.ఎఫ్. ప్రభాకరన్, శంకరరాజు—మరో ఇద్దరు ఆరితేరిన యోధుల్ని రంగంలో ప్రవేశపెట్టింది.

పాకిస్తాన్ సైనికుల మూకుమ్మడి దాడి ఫలితంగా ఇద్దరు బి.ఎస్.ఎఫ్. ఏజంట్లు మరణించడం జరిగింది.

• • •

అనంతమైన ఆకాశాన్ని అందుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టున్న ఎత్తయిన పర్వతాల క్రింద సన్నటి మార్గంలో ప్రయాణిస్తోంది ట్రక్కు. సంధ్య చీకట్లు

ముసురుకొంటున్నాయి. హెడ్ లైట్ల కాంతిలో దారి అస్పష్టంగా కనబడుతూంది.

తంగరాజు గంభీరత కలసిన మౌనంతో డ్రైవ్ చేస్తున్నాడు. నిద్ర సరిగ్గా లేక ఇద్దరి కళ్ళూ ఎర్రగా మండుతున్నాయి.

చీకట్లు స్థిరపడ్డాయి. నడుస్తున్న ట్రక్కు ముందు కొద్ది పాటి మార్గం తప్ప, మిగతాదంతా చిక్కటి చీకటి ఏర్పడింది.

అప్పుడాలోచిస్తున్నారు ఇద్దరూ. విశ్రాంతి తీసుకొనే మార్గం గురించి....దూరంగా చూస్తున్న ప్రభాకరన్ ఉలిక్కిపడ్డాడు. భారంగా ఊపిరి పీల్చుకొని అర్చాడు "తంగా! స్టాప్ ది వెహికల్ అండ్ ట్రక్కు—క్విక్!"

అతడి మాట పూర్తయ్యేసరికి ట్రక్కు నిలిపి వేశాడు తంగరాజు, లైట్సు ఆఫ్ చేసి.

"అటు చూడు....!" జాగ్రత్తగా చూపాడు కుడిచేతి వయిపు.

ఊపిరి బిగబట్టి ప్రభాకరన్ చూపినవైపు చూస్తూండి పోయాడు తంగరాజు!?

# 3

అగ్గిపుల్ల వెలిగించినట్టు చిటికెడు కాంతి కనిపిస్తూంది దూరంగా!!

తంగరాజు గొణిగాడు "అక్కడ మన ఆర్మీ సైనికు లెవరూ వుండడానికి వీలులేదు—వుంటే ముందుగానే మనకు ఇన్‌ఫర్మేషన్ అంది వుండేది...వాట్స్ ది హెల్-వాళ్ళెవరంటావా?!"

"రిస్కు తీసుకొందాం!" ప్రభాకరన్ స్టెన్‌గన్ పై చేయి వేశాడు.

ఆశ్చర్యం నుండి తేరుకొని ముఖంతో ప్రభాకరన్ వైపు చూసి కదిలాడు తంగరాజా. స్టీరింగ్‌కి తగిలించిన తన గన్ అందుకొన్నాడు!

ఇద్దరూ క్రిందికి దిగారు. చల్లగాలి మంచులా స్పృశిస్తూంది ఇద్దర్నీ. వాళ్ళ శరీరాలు వణికాయి. కళ్ళు చికిలించుకొని ముందు దారిని అతి జాగ్రత్తగా గమనించి నడుస్తున్నారు ఇద్దరూ.

వరుసక్రమంలో మొక్కలు నాటినట్టు క్రింద వరుసగా పడివున్నాయి చిన్న చిన్న గుండ్రపాటి బండరాళ్ళు. కాస్త అజాగ్రత్తగా అడుగులువేస్తే బూటు లోపలవున్న మునివేళ్ళకు రాళ్ళు కొట్టుకొంటున్నాయి.

అక్కడి దృశ్యం పూర్తిగా కనబడకపోయినా వెలుగు మాత్రం పెద్దది కాసాగింది క్రమంగా!?

ఇప్పుడొక ఆకారం కనిపిస్తూంది!

పూర్తిగా శిథిలమైన రాతిగుడిని గుర్తించారు. ఆ వెలుగు గుడి లోపలినుండే వస్తూంది! "తంగా! బికేర్ ఫుల్" హెచ్చరించాడు ప్రభాకరన్. ఇద్దరి ముఖాలు చెమటతో తడిశాయి.

గుడిని పూర్తిగా సమీపించారు. అదృష్టవశాత్తూ గుడి చుట్టూ చెట్లు అక్కడక్కడ గజిబిజిగా అల్లుకొన్న పొదలతో వున్నాయి. వాటి చాటున ఆగారు వాళ్ళిద్దరూ.

కాంతి తప్ప మనుషులెవరూ కనిపించడంలేదక్కడ!!

కాసేపటికి ఏవో మాటలు వినిపించసాగాయి లోపలి నుండి. భాష ఉర్దూలో వుండడంతో ముఖ ముఖాలు చూసుకొన్నారిద్దరూ వెంటనే! వాళ్ళ అనుమానం ఇక వేరే సందేహాలు లేకుండా బలపడింది!

గుడి ఆకారం పూర్తిగా తెలియకపోయినా లోపల

అమర్చిన ఫ్లడ్ లైట్ వల్ల, అంత కాంతి వస్తూందని గ్రహించారు. అంతలో అకస్మాత్తుగా నలుగురు వ్యక్తులు లోపలి నుండి వచ్చారు! శిథిలమైన గుడి ప్రాంగణం మసక కాంతిలో నిలబడి ఏదో మాట్లాడుకోసాగారు వాళ్ళు.

ముందున్న ఇద్దరూ పాకిస్తాన్ ఆర్మీ ఆఫీసర్లని చూడగానే తెలుస్తూంది. వెనుక రైఫిల్స్ ధరించి ఉన్నవాళ్ళు గార్డ్స్.

ఆఫీసర్లలో ముందున్న వయసుమళ్ళిన వ్యక్తిని గుర్తుపట్టారు ప్రభాకరన్, తంగరాజా. తెల్లబోయారు ఇద్దరూ అతడిని చూసి!

ఇజాజ్ ఖాన్ అతడు. అస్తవ్యస్తంగా వుండే పిల్లి గడ్డంతో క్రూరంగా వుంటాడతను. పాకిస్తాన్ సైనిక రాజకీయాలలో అతడి పేరే ఎక్కువ వినిపిస్తూంది.

“మైగాడ్! ఇదేదో పెద్ద ఫ్రాడ్‌లావుంది!” సన్నగా గొణిగాడు తంగరాజా.

సాక్షాత్తూ ఇజాజ్ ఖాన్ దానిని దగ్గరుండి ఆపరేట్ చేస్తున్నాడంటే దాని వెనుక ఎంత ప్రమాదం దాగి ఉందోనని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు ప్రభాకరన్.

ఇంతలో లోపలినుండి మరో నలుగురు సైనికులు ఆయుధాలతో వెలుపలికి వచ్చారు. ఖాన్ వాళ్ళతో ఏదో ఉర్దూలో చెప్పాడు. ఉర్దూ స్పష్టంగా వచ్చిన ప్రభాకరన్ - తంగరాజా అది విన్నారు! 'పరిస్థితులు భద్రంగా కాపాడ'మని చెప్పాడంతే ఇజాజ్ ఖాన్ వివరంగా ఏదీ చెప్పకపోవడం, ఇద్దరికీ కొద్ది నిరాశ కలిగించింది.

తర్వాత నలుగురూ కదిలారు. అక్కడ చెట్లగుబురులో చీకటిలో ఆగివున్న ట్రక్కులో కూర్చున్నారు. మరు

క్షణం అది స్టార్టయి, మళ్ళీ తిరిగి వెళ్ళిపోయింది శబ్దం చేసుకొంటూ.

వెనుక వచ్చిన నలుగురు సైనికులు ట్రక్కు కనుమాపు మేర దాటేవరకూ చూసి, తిరిగి లోపలికి వెళ్ళిపోయారు వడివడిగా.

సరిగ్గా రెండు క్షణాలాగి విశ్వాసంగా కదిలారిద్దరూ. శిధిలావస్థలో పైన విరిగిపోయిన రాతిగోడను సమీపించారు. క్రింద నేలంతా గలీజుగావుంది. విష కీటకాలు నివసించడానికి పూర్తి అవకాశం వున్నట్టనిపిస్తూంది.

విరిగిన బండరాతిమీద ఎక్కి ప్రభాకరన్ జాగ్రత్తగా లోపలికి తొంగి చూశాడు, వెలుతురు ముఖంమీద పడకుండా!!

అతడి ముఖం ఆశ్చర్యంతో భయంతో విచ్చుకొంది....??

## 4

తెల్లవారింది—

ప్రభాకరన్ కి ముందు మెలుకువ వచ్చింది. మెల్లగా కళ్ళు నులుముకొని. భారంగా ఆవులించాడు. ముందు సీటులో నిద్రపోతున్నాడు తంగరాజు. లేపాడు. "తంగా! కమాన్ క్విక్....ఎలర్ట్ టు ది డ్యూటీ!"

ఒక కొండ అడుగుభాగాన ఎత్తైన అంచులా వున్న చోటు. లోపలివైపు ఆపివుంది ట్రక్కు. ఇద్దరూ కాలకృత్యాలు తీర్చుకొని తయారయ్యారు. మిగిలిన బ్రెడ్ కొద్దిగా తిన్నారు టీ కాచుకొని తాగారు. ఆయుధాలు సర్దుకొని కొండ అంచునుండి వెలుపలికి వచ్చారు.

దాదాపు మూడు కిలోమీటర్ల దూరంలో గుడిసె

సంబంధించిన కొద్దిపాటి ఆకృతి అస్పష్టంగా కనబడుతూంది. చుట్టూ కొద్ది దూరం వరకూ రకరకాల చెట్లు పల్చగా అలుముకొన్నాయి.

...రాత్రి గుడిలోపల పాకిస్తాన్ సైనికులు చాలా మంది కనిపించడంతో, పూర్తిగా ఆయుధాలు కలిగిన మందిని ఎటాక్ చేయడం, అప్పటి పరిస్థితిలో అసాధ్యం అనిపించి ఇద్దరూ వెనుదిరిగి వచ్చేశారు....

ట్రక్కులో, తమ స్థావరంతో కనెక్షన్ వున్న వైర్ లెస్ సెట్. ట్రక్కు వేలీలో పడినప్పుడు బ్రేక్ అయి పోవడంతో — తాము తిరిగి వెళ్ళే ప్రసక్తిలేకుండా నేర్పుగా పాకిస్తానీయుల్ని ఎదుర్కోవడమే వున్న మార్గమని నిశ్చయించుకొన్నారిద్దరూ!

ఆయుధాలు ఎలర్టుగా పట్టుకొని పరిగెడుతున్నట్టు నడిస్తూ గుడి చేరుకొన్నారు

గుడివద్ద వాహనాలు ఏమీ లేవు. ఎవరూ వున్నజాడ కూడా కనిపించడం లేదు. ముందు ప్రభాకరన్ వెనగ్గా తంగరాజు గుడి లోపలికి నడిచారు!

లోపల విశాలంగావుంది. కుడిచేతి వైపు రెండు స్తంభాలు సగానికి పై కూలిపోయి వున్నాయి. పై కప్పు పగుళ్ళలోనుండి పీచులాంటి ఏవో మొక్కలు క్రిందికి వ్రేళ్ళాడుతున్నాయి. కొన్ని స్తంభాలు ఇంకా బలంగా వుండడంవల్లే కప్పు నిలబడివుందని గ్రహించాడు ప్రభాకరన్.

తంగరాజు గన్ పొజిషన్‌లో పట్టుకొని చురుగ్గా చుట్టూ కదులుతున్నాడు! ఏ క్షణాన్నయినా శత్రువుల తుపాకులు గర్జించే పరిస్థితి అది!

అటూ ఇటూ వున్న గోడలు పైభాగాన, రాళ్ళ

చాలావరకూ పడిపోవడంతో బయటవున్న చెట్ల సందుల నుండి వెలుతురు లోపలకు స్వేచ్ఛగా పడుతుంది.

పొట్టిగా ఇరుగ్గా కనిపిస్తున్న గర్భగుడి తలుపులపై పడింది ప్రభాకరన్ దృష్టి! చెక్క తలుపులవి. మూసి వున్నాయి. వాటిని సమీపించాడు ప్రభాకరన్. చివికి పోయి ఎండిపోయి రాతి రంగులో కలిసిపోయి ఉన్నాయా తలుపులు. దగ్గరకొస్తేగానీ చెక్కతలుపులని గ్రహించడం కష్టం.

కుడిచేతితో స్టెన్‌గన్ చంకలో యిరికించుకొని ఎడం చేతిని కదియలేని తలుపులపై వేసి ముందుకు నెట్టాడు.... తేలిగ్గా తెరుచుకొన్నాయవి శబ్దం చేయకుండా!

కొద్దిపాటి చీకటినిండిన చిన్న గర్భగుడిలో ఉబ్బెత్తు ఆకారం కలిగిన రాయి కనిపిస్తూంది ఎదురుగా! వెలుతురు బాగానే వుంది. క్రింద రాతి నేల కూడా శుభ్రంగా వుంది. గర్భగుడి లోపలికి ప్రవేశించారిద్దరూ.

విగ్రహాన్ని దగ్గరగా చూస్తే, దానిపై చెక్కవున్న పెనవేసుకొన్న రెండు సర్పాల ఆకారాలు కనిపించ సాగాయి.

క్రింద నేల పరిశుభ్రంగా వుండటమే ప్రభాకరన్‌ని ఆశ్చర్యపరిచింది. శత్రుసైనికులు అందులోనికి ప్రవేశించారన్నది, ఆలోచించ నవసరంలేకుండా అర్ధమవుతూంది స్పష్టంగా!?

విగ్రహానికి వెనుక వైపు ఖాళీగా వుంది!

అటువైపు నడిచారు. మూడడుగుల దూరం వుంది విగ్రహం నుండి గోడవరకు! సరిగ్గా ఇద్దరి చూపు ఒకే ప్రాంతంమీద పడ్డాయక్కడ!?

నలుపలకలుంగా లోపలికి చదునుగావున్న అంగుళం లోతు కలిగిన గొయ్యి!!

ప్రభాకరన్ కదిలాడు. గోతి నేలపై బూటుకాలు వేసి అడుక్కి తట్టి చూసాడు గట్టిగా!

అది కదులుతూందని గ్రహించగానే చటుక్కున కాలు దాని పైనుండి తీసి వేసాడు. తర్వాత అడుగుభాగం అలాగే వుంది. ప్రభాకరన్ కాలును మళ్ళీ దాని పైనొక్కి పట్టాడు. అది కదిలింది పక్కకు. ఇద్దరికీ అర్థమయింది!

కాలుతో బలంగా దానిని అదిమాడు ప్రభాకరన్. ఈసారి స్పష్టంగా కదులుతూ పక్కకి జరిగిపోయింది ఆ రాతి పలక!?

క్రింద చిమ్మ చీకటిలో కొద్దికొద్దిగా కనిపిస్తూన్న సన్నటి ఇనుప నిచ్చెనను విభ్రాంతిగా చూస్తూండి పోయారు వాళ్ళిద్దరూ....!!

## 5

"మైగాడ్! ఏమిటీ అండర్ గ్రౌండ్! దానితో ఏమిటీ వాళ్ళకు పని?" తెల్లబోతూ అన్నాడు ప్రభాకరన్ స్వగతంగా.

"ముందు దిగి చూద్దాం....!" ఆసక్తిగా చెప్పాడు తంగరాజా.

జాగ్రత్తగా కదిలాడు ప్రభాకరన్ ముందు. ఇనుప నిచ్చెన ఇద్దరు దిగుతున్నా కదలిక లేకుండా బలంగా వుంది. అది శత్రుసైనికులు కొత్తగా అమర్చినదని అర్థమవుతుంది. రాతిపలక అడుగుభాగాన, చాలావరకూ అరిగిపోయిన గుండ్రటి ఇనుపగుళ్ళు ఉండటం చూశారు. వాటి వలనే పలక, ప్రెస్ అయితే ప్రక్కకు జరుగుతుంది.

క్రింద చీకటిలోకి దిగారు. సరిగ్గా పైన వున్న గర్భగుడి అంత గది ఉన్నట్లు చుట్టూ మసగ్గా కనబడుతూన్న గోడలవలన తెలుస్తూంది.

అప్పటికే కిట్ లోనుండి లైటర్ తీసి వెలిగించాడు తంగరాజా, పరిసరాలు కొద్దికొద్దిగా వెలుగులోనికి రాసాగాయి!

పొడవాటి గోధుమ రంగులో ఉన్న పెట్టెలు ఐదారు రెండు వరసల్లో పేర్చబడి ఉన్నాయక్కడ!

"ఏమిటివి?" అంటూ తడిమి చూశాడు ప్రభాకరన్. తంగరాజా లైటర్ ఎడం చేతిలోనికి మార్చుకుని వాటిని ప్రయత్నించాడు. ప్రత్యేకించి వాటికి తాళంకప్పులవంటివేమీ లేవు! మూతవేసినట్టున్న భాగాన పైన చిన్న చిన్న రంధ్రాలు నాలుగేసి ఉండటం గమనించారిద్దరూ ప్రతీ పెట్టెకు!

ఆ రంధ్రాలకు మాత్రమే తయారుచేయబడిన తాళాలతోనే వాటిని తెరవడం వీలవుతుంది. ఆర్మీలో అతి ముఖ్యమయిన ఆయుధాలు దాచడానికి మాత్రమే ఉపయోగించి పెట్టెలివి!

చూసిన కాసేపటికే ఇద్దరికీ ఆ విషయం అర్థమయింది. ప్రతీ పెట్టెకు అన్నివైపుల ఎర్రటి రంగులో ప్రమాదాన్ని సూచించే పుర్రె ఎముకల గుర్తులు చిన్నవిగా ముద్రించి ఉండటం గమనించారు!

"ఇవి ప్రమాదకరమైన యేవో ఎక్స్‌ప్లోజివ్స్ అని నిర్ధారణగా తెలుస్తూనే వుంది! వీటితో వీళ్ళేం చేయబోతున్నారో మాత్రం అగమ్యగోచరంగా వుంది!" సాలోచనా అన్నాడు ప్రభాకరన్.

"ఇదేదో పెద్ద కుట్రలా వుంది — ఇజాబ్ ఖాన్ ను

చూసినప్పుడే అనుమానించాను నేను! అతడి చేయి వుందంటే ధ్యానమే మరి అక్కడ....!!" టెన్షన్‌గా అన్నాడు తంగరాజా.

తర్వాత ఊపిరి బిగబట్టి లెటర్‌ను శ్రద్ధగా గది చుట్టూ తిప్పి పరిశీలిస్తూ మళ్ళీ అన్నాడు "వీళ్ళ తతంగం ఎటునుండి ఎలా సాగుతుందో అర్థం కావడం లేదు నాకు?!"

భారత — పాకిస్తాన్ బోర్డర్‌లో, వాళ్ళున్న గుడి, ఆ చుట్టుప్రక్కల కొండప్రదేశం 'ప్రొవైడ్ ఏరియా' (PROVIDE AREA) లోనికి వస్తాయి. (అంటే ఇరు దేశాల వాళ్ళు అక్కడి ప్రాంతం తమ భూభాగం లోనికే వస్తుందని వాదించుకోవడంవల్ల, అక్కడ ఎక్కువ హింసాకాండ జరిగే అవకాశం ఉండటంవల్ల ఇరు దేశాల సైనికులు ఆ ప్రాంతంలో రహస్యంగా సంచరిస్తూ క్రమంగా ఆ ప్రదేశాన్ని సొంతం చేసుకోడానికి అన్ని రకాలుగా ప్రయత్నిస్తారు.)

ఆ ప్రాంతంలో ఎక్కువగా కాల్పులు జరగడానికి కారణం కూడా అదే! నిజానికి అది భారత భూభాగం లోనికే వస్తుంది. కానీ పాకిస్తానీయుల కవ్వింపు చర్యల వల్ల కాల్పులలో భారత్ తప్పనిసరిగా జోక్యం చేసుకోవలసి వస్తుంది.

ఆ ప్రాంతంలో నిరంతరం భారత్ — పాకిస్తాన్ సైనికులు రహస్యంగా సంచరిస్తూనే ఉంటారు. అది ఇరు వర్గాల వారికీ తెలిసిన రహస్యం!!

"అరె! ప్రభాకర్ చూడిటు!" కంఠం పెంచి చెప్పాడు తంగరాజా. అతడి ముఖంపై ఆశ్చర్యం!

ప్రభాకరన్ దగ్గరగా వచ్చి చూశాడు. అతడి కళ్ళు

పెద్దవయ్యాయి. సన్నటి లైటర్ కాంతిలో లోపలికి కనిపిస్తున్న సొరంగ మార్గాన్ని గమనించి!!

“ఐ థింక్ ఎగ్జాట్లీ దిసీజ్ బిగ్ మిస్టరీ?!” అప్రయత్నంగా ప్రభాకరన్ పెదాలు కదిలాయి.

మిస్టరీ కొద్ది కొద్దిగా విడిపోతున్న ఆనందం ఇద్దరి ముఖాల్లోనూ లీలగా గోచరిస్తూంది. ముందుకు వెళ్ళడానికి సంసిద్ధులయ్యారు ఇద్దరూ........పాకిస్తానీయులు ఆపరేషన్‌ను డిటెక్ట్ చేయడం ప్రాణాలతో చెలగాటం అని తెలుసు వాళ్ళకు! ప్రభాకరన్, తంగరాజు చేతిలో నుండి లైటర్‌ను అందుకున్నాడు.

ఇద్దరు మనుషులు పట్టే వెడల్పుగల సొరంగం క్రింద చదునయిన నేలతో ప్రయాణించడానికి సౌకర్యంగా వుంది. అది శత్రువులు దానిని క్లియర్ చేయడంవల్లనే సాధ్యపడిందని తెలుస్తూనే వుంది!

సొరంగం గోడలు వాటిపై వున్న గీతలు, నేల వాసననుబట్టి ప్రభాకరన్, అది ఎన్నో సంవత్సరాల క్రితం తొల్చబడిన అతి పురాతనమైన సొరంగం అని గ్రహించాడు. అతడు లైటర్ పట్టుకొని ముందు నడుస్తున్నాడు!

రానురాను సొరంగం పైభాగం క్రిందకు దిగిపోతూ వున్నట్టు ఉండటం గమనిస్తున్నారిద్దరూ.

## 6

ఆరయ్యింది—

వెడల్పు వున్నా ఎత్తు లేకపోవడంవల్ల పాకుతున్నట్టు నడవవలసి వస్తూంది. క్రింద నేలకూడా ఎగుడుదిగుడుగా ఉంది!

గంట క్రితమే లైటర్ ఆర్పేశారు. ఎక్కడినుండో

వెలుతురు మసగ్గా పడుతూంది.

అప్పటికి దాదాపు తొమ్మిది మైళ్ళు పైనే నడిచారు వాళ్ళు! మధ్యలో అక్కడక్కడా ఆగారు. మిగిలిన బ్రెడ్‌తో భోజనం కూడా పూర్తి చేశారు. కాళ్ళంతా నొప్పులతో పీకుతున్నప్పటికీ, అతికష్టం మీద పళ్ళ బిగువున బాధను ఓరుస్తూ నడుస్తున్నారిద్దరూ.

ఇంతలో ముందున్న ప్రభాకరన్ ఉలిక్కిపడి బోర్లా పడుకున్నాడు. అతడి మనసు ప్రమాదం గ్రహించింది. అది చూసి తంగరాజు పక్కకు తప్పుకున్నాడు.

"ఏయ్ ఎవరది?" అంటూ ఉరుములా అరుస్తూ ఎగుడుదిగుడుగా వున్న మట్టిదిబ్బల వెనుకనుండి, పాకిస్తాన్ సైనికుడు ముందుకు వచ్చాడు. అతని కళ్ళు పరిసరాల్ని తీక్ష్ణంగా పరికిస్తున్నాయి! చేతిలో స్టెన్‌గన్ శత్రువులకోసం వెదుకుతూంది.

ఊపిరి బిగబట్టి చూశాడు ప్రభాకరన్. దూరంగా ఉన్న సైనికుడు మరి కాస్త ముందుకు వచ్చాడు. కాసేపు ఆగితే అతడి కేకలకు మరికొద్దిమంది సైనికులు వచ్చి పడతారని అతడికి తెలుసు! సైనికుడు అనుమానం బలపడ్డంతో గబగబా ముందుకు దూసుకొచ్చాడు.

ప్రభాకరన్ చేతిలో గన్ నిప్పులుకక్కింది శబ్దంతో! సన్నటి కేక గొంతులోనుండి వెలువడకముందే దబ్బున క్రిందికి జారిపోయాడా సైనికుడు. ఇద్దరూ త్వరగా ముందుకు కదిలి సైనికుడి బాడీని ఓ మూలకు సర్దారు.

అదృష్టవశాత్తూ మరెవరూ వాళ్ళకు ఎదురుపడలేదు. ప్రభాకరన్‌కి అనుమానం మనసులో పీకుతోంది. మరి కొంతమంది తప్పనిసరిగా అక్కడ ఉంటారని!

మరో పదడుగులు నడిచాక దారి పాల్వ అయింది.

అర మైలు దూరం ముందే వెలుతురు కనిపించినప్పుడే, దగ్గరలో సొరంగం అంతమవడానికి అవకాశం వుందని గ్రహించారిద్దరూ.

దారి ప్రారంభంలో వలె ఎత్తు పెరిగింది. అటూ ఇటూ విశాలంగా ఏర్పడింది. రిలీఫ్ గా నిట్టూర్చాడు తంగరాజా.

సొరంగ మార్గం అంతటితో అంతమయ్యింది. పైకి ఇనుపనిచ్చెన కనపడుతూంది! స్వచ్ఛమైన గాలి వస్తున్నప్పటికీ, అప్పటికే చీకట్లు ముసురుకోవడం వలన వెలుతురు తగ్గిపోతూంది.

ఈసారి నిచ్చెన బాగా ఎత్తుగా ఉంది. పైన మూత లాంటిది ఏదీ లేకుండా ఖాళీగా విశాలంగా వుంది. సొరంగ మార్గానికంతటికీ గాలి అక్కడి నుండే వస్తూంది.

ఇద్దరూ నిచ్చెన ఎక్కి పైకి చేరుకొన్నారు. పగలంతా సొరంగం లోపలే గడవడం వల్ల ఇద్దరి దుస్తులు చెమటతో తడిసిపోయి జిడ్డుగా ఒంటికి అతుక్కొని పోయాయి. ముఖాలు నల్లగా కమిలిపోయాయి సరైన గాలిలేక.

చుట్టూ ఆకాశాన్నంటే చెట్లు వాళ్ళను చుట్టుముట్టి నట్లున్నాయి! నాలుగడుగులు వేసీ వేయగానే ప్రభాకరన్ దూరంగా పొదలో కదలిక పసిగట్టాడు....!

“తంగా ...!” అంటూ త్వరిత్వరగా తంగరాజాని హెచ్చరించి పక్కనున్న చెట్లలోనికి దొర్లిపోయాడు. తంగరాజా కూడా అక్కడినుండి కదలిన వెంటనే ‘జ్జ్ జ్జ్ జ్జ్....’ మంటూ స్టెన్ గన్ బుల్లెట్లు ఆకులతో కప్పబడిపోయి ఉన్న నేలలోనికి దూసుకొని పోయాయి.

ఆలస్యం చేయలేదు ప్రభాకరన్....మంట కనిపించిన వైపు తన గన్నుని ఓపెన్ చేసి—చటుక్కున అక్కడి నుండి తప్పుకున్నాడు!!

ఎత్తయిన చెట్టు మధ్యభాగంనుండి ఇసుకమూటలా చప్పుడు చేస్తూ పడిందొక ఆకారం. తర్వాత మరి లేవ లేదు! మరో శత్రువు మరణించాడని గ్రహించాడు ప్రభాకరన్.

ఎక్కడున్నాడో అక్కడే ఉండిపోయాడు తంగ రాజా. నేలమీద ఆకులెక్కువగా ఉన్నాయి! ఎండుటాకులు మరీ ఎక్కువున్నాయి. కాలుకదిపితే అవిచేసే శబ్దానికి శత్రువుల బుల్లెట్లు తన వంటిని జల్లెడ చేయడం ఖాయమని గ్రహించి రాయిలా అక్కడే వుండిపోయాడు.

ప్రభాకరన్ ఆలోచించసాగాడు. శత్రువులు ఎంత మంది వున్నారో తెలీకుండా పోరాడ్డం కష్టమని గ్రహించాడు. బాగా ఎక్కువమంది వుంటే కొంతమందిని కోల్పోయినప్పటికీ దొమ్మీగా కలబడి తామిద్దర్నీ క్షణాల్లో మట్టుపెట్టేయగలరు!

వాళ్ళలో అతడాశించినంత ఉధృతం లేకపోవడంవల్ల - వాళ్ళ సంఖ్య తక్కువేనని అతడి కర్థం అవుతూంది!

క్రిందనున్న రాయితీసి ఎడం పక్కగా ఎత్తునుండి పరేలా విసిరాడు దూరంగా! శబ్దం అయింది....!

శత్రువుల నుండి రెస్పాన్స్ ఏమీ లేదు. ప్రస్తుతం అతడున్న స్థానం సురక్షితమైందే! కదిలి దాన్ని పోగొట్టుకోవడం అతడికిష్టంలేదు. అందుకే కాసేపు ఓపికపట్టాడు.

అంతలో ఎదురుగా ఉన్న చెట్టుపైనుండి ఒక ఆకారం క్రిందికి దూకింది! అతడికి రెండు మూడు అడుగుల దూరం నుండి, వరుసగా బుల్లెట్లు పేల్చుకుంటూ మెరుపులా

పరిగెత్తి చీకట్లో కలిసిపోయింది. కాలిన బుల్లెట్ల పొగ చీకట్లో అస్పష్టంగా పైకిలేస్తూ వాసనను వెదజల్లుతూంది.

ప్రభాకరన్ తన గన్ను ఓపెన్ చేయలేదు. వెలుతురు ఆరిన వెంటనే తనపైకి బుల్లెట్లు వర్షంలా కురుస్తాయని ఖచ్చితంగా తెలుసతడికి!

చటుక్కున లేచి ఆకారం వెళ్ళినవైపు చురుకుగా కదిలాడు....ఆ ఆకారం చేసిన చప్పుడులో, ప్రభాకరన్ అడుగుల చప్పుడు మరుగున పడిపోయింది!

## 7

విశాలమైన చెట్టువెనుక దాగి నిశితంగా చూశాడు.

ఇందాక వెళ్ళిన ఆకారం మెల్లగా చెట్టెక్కుతూంది. గన్నుతో గురిపెట్టి శత్రువు పొజిషన్‌లోనికి రాగానే ఓపెన్ చేశాడు ప్రభాకరన్....శబ్దం చేస్తూ బుల్లెట్ ఎర్రని మంటనుండి దూసుకెళ్ళాయి!!

వికృతంగా అరుస్తూ క్రిందపడ్డాడు వాడు. మరుక్షణం ప్రభాకరన్‌వైపు మూడుచోట్లనుండి ధగధగ మండాయి స్టెన్‌గన్స్!!

బుల్లెట్లు అతడున్న చెట్టును సగానికి చీల్చేశాయి. కొన్ని అతిడి చెవుల ప్రక్కలనుండి, భుజాల ప్రక్కనుండి వెచ్చగా దూసుకొని పోయాయి....క్షణంలో ప్రభాకరన్ అక్కడినుండి కదిలి, తంగరాజు వద్దకు వచ్చిపడ్డాడు.

"ఆర్ యూ రైట్!" గొణిగాడు తంగరాజు.

"రైట్!" చుట్టూ పరికిస్తూ చెప్పాడు ప్రభాకరన్.

ఇందాక వెలుతురునుబట్టి శత్రువులు ముగ్గురున్నారని పసిగట్టాడు అతడు.

తర్వాత చెప్పాడు "తంగా! ఇటువైపు ఇద్దరూ ఫినిష్. వాళ్ళు ముగ్గురూ ఇలా వచ్చేలోపలనువ్వు తిన్నగా పోయి

అటునుండి క్రమ్ముకొనిరా!" హెచ్చరిస్తూ చెప్పాడు.

అతడి వ్యూహం అర్థం చేసికొని తంగరాజు చురుగ్గా కదిలాడు! మెరుపులా పరిగెత్తి దూరంగా వున్న చెట్ల చాటుకు పారిపోయాడు. తంగరాజు చేసిన చప్పుడుకి అతడి కూడా గన్సు గర్జించాయి...తంగరాజు క్షేమంగా అటు చివరికి చేరుకున్నట్టు ప్రభాకరన్ గ్రహించాడు.

తమను పట్టుపెట్టలేక పోవడమేకాక తమవల్ల సహచరుల్ని పోగొట్టుకోవడం, శత్రువులకు వెర్రెత్తిందన్న విషయం చూచాయగా తెలుస్తూంది ప్రభాకరన్‌కు!

చటుక్కున చిన్న రాయితీసి తంగరాజు వెళ్ళిన వైపుకి దూరంగా విసిరాడు. సిగ్నల్ అది తంగరాజుకి!

కాసేపు గడిచింది. తంగరాజు ఇందాకటి సైనికుడి మాదిరిగా, గన్ను వరుసగా పేలుస్తూ పరుగెత్తుకొంటూ చెట్లలోనికి పరుగుతీశాడు! అతడికి తెలుసు అదెంత సాహసమో!

వెంటనే దూరంగా వున్న సైనికులు ముగ్గురూ అతడి వైపే బుల్లెట్లు కుప్పించసాగారు. మెరుపులా వెలుపలికి వచ్చాడు ఆ అవకాశంకోసమే ఎదురుచూస్తున్న ప్రభాకరన్!

నిర్విరామంగా పేలుస్తున్న శత్రువుల గన్స వెలుతురును జాగ్రత్తగా గమనిస్తూ, సూటిగా ముగ్గురివైపూ కాల్పులు సాగించాడు.

సరిగ్గా ఇరవై క్షణాలపాటూ కాల్పులతో కేకలతో ఆ ప్రాంతం ప్రతిధ్వనించింది! శత్రువులు ముగ్గురు కాల్పులకు బలయ్యారు.

భారంగా ఊపిరి వదిలాడు ప్రభాకరన్. "తంగా.... తంగా!" అంటూ కొద్దిదూరం మసక చీకట్లోకి అర్చాడు.

క్షణాలలో. "ఓకే! ఆల్ రైట్!" అంటూ తంగరాజా చెట్ల చాటునుండి వెలుపలికి వచ్చాడు ఒగరుస్తూ.

"అందరూ అంతమయినట్టే!" చెప్పాడు తంగరాజా.

"ముందీ ప్రాంతం ఏమిటో తెలుసుకోవాలి!" అన్నాడు ప్రభాకరన్. గన్ను సర్దుకొని చుట్టూ పరికించ సాగాడతడు. చెట్లలోపు దాటుకుంటూ బయటికి వచ్చిన ఇద్దరూ అదిరిపడ్డారు!?

క్షణాల్లో ఆ ప్రాంతం అంతా పట్టపగలుగా మారిపోయింది ఫ్లష్ లైట్ కాంతితల్ల....! మోచేతులు ముఖానికి అడ్డు పెట్టుకుంటూ యెదురుగా ఏముందో చూడాలని విశ్వప్రయత్నం చేయసాగారిద్దరూ.

"డోంట్ మూవ్!" కర్కశంగా వినిపించిందో కంఠం.

"ఎవరు మీరు—ఏమిటీ పోరాటం?" అదే కంఠం ప్రశ్నిస్తూంది ఇద్దర్నీ.

ప్రభాకరన్ గట్టిగా అర్చి చెప్పాడు తమ ఐడెంటిఫికేషన్, అప్పటికే వాళ్ళిద్దరికీ అవగాహన అవసాగింది వాళ్ళు ఇండియన్ ఆర్మీ అని. రిలీఫ్ అయ్యారిద్దరూ.

లైట్ల కాంతి సగం తగ్గిపోయింది. వాటి దిశ క్రిందికి మారింది. ప్రభాకరన్, తంగరాజా కళ్ళు నులుముకొని ముందుకు చూశారు.... రెండు ట్రక్కులనిండా భారత మిలటరీ సైనికులు ఆయుధాలు ధరించి ఉన్నారు.

కాస్త ముందున్న మరో ట్రక్కులోని వ్యక్తి గట్టిగా చెప్పాడు "ఇద్దరూ గన్స్ పడేసి ముందుకు రండి!"

అతడు చెప్పినట్టే గన్స్ క్రింద వదిలేసి ముందుకు నడిచారిద్దరూ! తర్వాత తమవైపు ఆయుధాలు గురిపెట్టి లేకపోవడం గమనించారు.

మిగతా సైనికులు దిగి లైట్ వెలుగులో పాకిస్తాన్ సైనికుల మృతదేహాలను వెతుకుతున్నారు. ట్రక్కులోని వ్యక్తి క్రిందికి దిగివచ్చి "ఐడెంటిఫికేషన్స్ చూపించండి!" అన్నాడు.

అతను మిలటరీ చీఫ్ కమాండర్ వినాయక్‌లాల్‌గా గుర్తించాడు ప్రభాకరన్. తమ ఐడెంటిఫికేషన్స్ తీసి చూపుతూ "ప్లీజ్....మిస్టర్ వినాయక్‌లాల్!" అన్నాడు ప్రభాకరన్.

వెంటనే ప్రభాకరన్ ముఖంలోనికి చూశాడు వినాయక్‌లాల్. తర్వాత కార్డ్స్ పరిశీలించి తృప్తిగా నిట్టూర్చాడు.

పాకిస్తానీయుల మృతదేహాలను వెనుక ట్రక్కులోనికి చేర్చిన తర్వాత చెప్పాడు ప్రభాకరన్‌తో "కమాన్ ఫ్రెండ్స్ లెట్స్ గో టు అవర్ టెనమెంట్స్!"

వినాయక్‌లాల్ ప్రక్కనే ట్రక్కులో కూర్చున్నారిద్దరూ. సుమారు ఇరవై గజాల దూరంలో....బాగా ఎత్తుగా విశాలంగా చీకట్లో కలిసిపోయి కనిపిస్తున్న గొడౌన్స్‌ని చూశాడు ప్రభాకరన్! ఏదో అనుమానంతో అతడి కనుబొమ్మలు ముడిపడ్డాయి.

వినాయక్‌లాల్‌ని చూసి "ఏమిటవి కమాండర్?" అనడిగాడు.

చెప్పాడు వినాయక్‌లాల్ "అవి మన ఆర్మీ ఆయుధ పాతరాలు!"

మరుక్షణం ఏదో అర్ధంకాగానే "మైగాడ్!" అంటూ అప్రయత్నంగా అర్చాడు ప్రభాకరన్.

"వాట్స్ ది మేటర్?!" తెల్లబోతూ చూశాడు వినాయక్‌లాల్.

# 8

రాత్రి తొమ్మిది దాటింది—

ప్రభాకరన్ చెప్పింది విని నిలువెల్లా కంపించిపోయాడు చీఫ్ కమాండర్ వినాయక్‌లాల్.

"మన ఆయుధ స్థావరాలు ఇంత పెద్ద ట్రాప్‌లో ఇరుక్కుపోయాయని ఇంతవరకూ మాకు తెలీకపోవడం మిక్కిలి దురదృష్టం. ఇప్పటికి ఇరవై మంది సెక్యూరిటీ గార్డులు చంపివేయబడ్డారు ఆయుధాల గొడౌన్స్‌వద్ద! అది గొడౌన్స్ స్వాధీనం చేసుకోవడానికి పాకిస్తానీయుల చిన్నపాటి దుశ్చర్యగా భావించడమే తప్ప, ఇంతదూరం ఊహించలేదు....!

....సహజంగా ఏర్పడిన ఆ సొరంగాన్ని ఆధారం చేసుకొని పాకిస్తానీయులు, మన ఆయుధ స్థావరాల లోనికి ప్రవేశించి వాటిని బ్లాస్టింగ్ చేయడానికి ప్లాను వేయడం వాళ్ళ కుత్సిత తత్వాన్ని నిరూపిస్తూంది!" అన్నాడు వినాయక్‌లాల్.

వినాయక్‌లాల్ రెస్టురూంలో వున్నారు వాళ్ళు. మరో నలుగురు ఆర్మీ ఆఫీసర్లు కూడా ఉన్నారక్కడ.

మళ్ళీ వినాయక్‌లాలే అన్నాడు "ఎనీ హౌ ప్రాణాలకు తెగించి ఈ రహస్యాన్ని ఛేదించిన మీ బి. ఎస్. ఎఫ్ కు ఆర్మీ యెంతో ఋణపడి వుంది—థాంక్యూ వెరీ మచ్!" ఆఫీసర్లు ప్రభాకరన్ తంగరాజుల వంక కృతజ్ఞతా పూర్వకంగా చూశారు.

"సర్! మనం ముందు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి ఆలోచించండి—అసలు మన ఆయుధాగారం ఎంత ప్రమాదంలో ఉందో గ్రహించారు కదా!"

ప్రభాకరన్ ముందుకు వంగి చెప్పాడు. అతడి కంఠంలో ఆదుర్దా.

"డోంట్ వర్రీ! ఈ విషయంలో ఆలస్యం చేస్తే కలిగే పర్యవసానం ఊహించగలను. ఇప్పుడే కమాండర్ జనరల్ కి కూడా ఫోను చేస్తాను!" టెన్షనుగా చెప్పాడు వినాయక్ లాల్.

తర్వాత వెనక్కి తిరిగి నలుగురు ఆఫీసర్లను ఆయుధ స్థావరాలను పూర్తిగా చెక్ చేయమని చెప్పాడు నలుమూలలా. వాళ్ళు శల్యూట్ చేసి వెళ్ళిపోయారు.

వినాయక్ లాల్ వెంటనే ఫోను అందుకొన్నాడు. కమాండర్ జనరల్ కి రింగు చేసి జరిగినదంతా చెప్పాడు... అవతలి నుండి జనరల్ చెప్పేది క్షుణ్ణంగా విన్నాడు. దాదాపు పదిహేను నిమిషాల తర్వాత "ఓకే సార్ అలాగే!" చెప్పాడు చివరగా.

ఆసక్తిగా చూస్తున్న ప్రభాకరన్, తంగరాజు వంక చూసి చెప్పాడు "ముందు పాకిస్తాన్ వాళ్ళు వచ్చే సొరంగాన్ని సీల్ చేయమంటున్నాడు జనరల్—ఆయుధ స్థావరాల్ని డిటెక్ట్ చేయడానికి ఎక్స్ప్లోజివ్ నిపుణుల్ని నియమించమంటున్నాడు! ఈ పనికి దేశంలో అతి ముఖ్యులైన కొందరు ఎక్స్ప్లోజివ్ నిపుణుల్ని డిఫెన్స్ మినిష్టరుతో మాట్లాడి పంపిస్తానంటున్నాడు."

"అలాగే చేద్దాం! నా అభిప్రాయం ప్రకారం ముందు స్థావరాల్లో కంప్యూటింగ్ డిటెక్టర్ల ద్వారా శోధించడం మంచిది. ఎక్స్ప్లోజివ్స్ ఏమయినా అక్కడే వుంటే ఎంత ప్రమాదం వాటిల్లుతుందో ఊహించడానికే భయంగా వుంది!" అన్నాడు ప్రభాకరన్.

వినాయక్ లాల్ సాలోచనగా తల ఊపాడు....

# 9

రాత్రి పన్నెండయింది—

గోడౌన్సుకి రెండు కిలోమీటర్ల దూరంలో తాత్కాలికంగా వేసిన మిలటరీ గుడారం అది! అక్కడి ప్రదేశం అంతా, చెట్లూ చేమలూ లేని విశాలమైన బీడు భూములు ప్రాంతం కావడంతో చలిగాలి గట్టిగా విసురుతోంది.

గాలికి గుడారంలో పైన అమర్చిన తెల్లటి నాలుగు విద్యుత్ బల్బులు కొద్దిగా ఊగుతున్నాయి. ఛీఫ్ కమాండర్ వినాయక్‌లాల్‌తో పాటూ నలుగురు ఆఫీసర్లు, పద్దెనిమిదిమంది ఎక్స్‌ప్లోజివ్ నిపుణులు—ప్రభాకరన్ తంగరాజులు కూడా వున్నారు. అందరూ చలికి ఉన్నితో తయారుచేయబడిన ఓవర్ కోట్లు ధరించి వున్నారు....

వెపన్స్ గోడౌన్స్‌లో దొరికిన రెండు టన్నుల బరువుగల మొత్తం ఎక్స్‌ప్లోజివ్స్ వున్నాయక్కడ! నోరు వెళ్ళబెట్టాడు వినాయక్‌లాల్ అవి చూసి!

డిస్‌మిసల్స్ (నిరుపయోగం) చేయబడిన ఆ ఎక్స్‌ప్లోజివ్స్ అన్నీ వాళ్ళ ఎదురుగా గుట్టలా పోయబడి వున్నాయి. ఆఫీసర్లతో పాటూ ప్రభాకరన్ కూడా నిశితంగా వాటిని పరిశీలించసాగాడు.

వాటిమీద ఎరుపురంగులో అమెరికా దేశపు పేరూ, అవి తయారైన కంపెనీకి సంబంధించిన కోడ్ నంబర్లు గుర్తులు వేయబడి వుండటం అందరూ గమనించారు!! అవన్నీ పూర్తి అధునాతనమైన ఎక్స్‌ప్లోజివ్స్!

అప్పుడు చెప్పాడు నిపుణుల బృందంలోని ఒకవ్యక్తి చల్లగా "సార్! ఇప్పుడు దొరికిన ఎక్స్‌ప్లోజివ్స్ కంటే, అతి చిన్నసైజులో వుండే అత్యంత ప్రమాదకరమైన ఎక్స్‌ప్లోజివ్స్ కూడా మన గోడౌన్సులో వున్నాయి....

వాటిని మన డిటెక్టర్స్ లీలగా కనిపెట్ట గలుగు తున్నాయి. కానీ అవి వున్న ఖచ్చితమైన స్థలాన్ని సరిగా చూపలేకపోతున్నాయి. చాలా ప్రమాదభరితమైన ఆ ఎక్స్ప్లొజివ్స్ అమెరికానుండి పాకిస్తాన్ లేటెస్టుగా ఇమ్పోర్టు చేసుకొని వుంటుందని మా అంచనా....!

నిపుణుడు చెప్పింది అర్థంకాగానే అక్కడున్న ఎక్స్ప్లొజివ్స్ అన్నీ ఒకేసారి పేలినట్టు అదిరిపడ్డారు అంతా!?!

శరీరం చలనాన్ని కోల్పోయినట్టు నిస్సత్తువగా చూస్తూండిపోయాడు వినాయక్ లాల్. అతనికంటే దేశభక్తునికి నిజంగా ఇది వజ్రఘాతమే అనిపించింది ప్రభాకరన్ కి.

"మిస్టర్ ప్రభాకర్! ప్లీజ్ టెల్ మీ ది ఐడియా.... పరిస్థితి ఎంత క్లిష్టంగా తయారయ్యిందో మీరూ విన్నారు! ఎలాగయినా మనం మన ఆయుధాల్ని, గోడౌన్నని కాపాడుకోవాలి. ఇప్పుడే ప్రైమ్ మినిష్టర్ కి, డిఫెన్స్ మినిష్టర్ కి ఫోను చేస్తాను....

పాకిస్తానుకి ఈసారి గట్టిగా బుద్ధి చెప్పండే ఊరుకోను నేను?" అన్నాడు ఆవేశంగా వినాయక్ లాల్.

ప్రభాకరన్ నిపుణుడివైపు చూశాడు "సుమారు అవి ఎన్ని వున్నట్టు తెలిసింది మీ పరిశోధనలో?" అడిగాడు.

నిపుణుడు "వందపైనే వుండొచ్చు. అన్నీ హై పవర్! రిమోట్ కంట్రోల్డ్ అయ్యుంటాయని మా అంచనా. అవి పేటీలాగ టైమ్ బాంబులు కాదు. ఖచ్చితంగా రిమోట్ కంట్రోల్డ్!" అన్నాడు.

హతాశులయ్యారు అందరూ!! రిమోట్ కంట్రోల్డ్ అంటే ఏ క్షణాన్నయినా గొడౌన్స్ మని కావచ్చునని

అర్థమయింది వాళ్ళకు!

కొద్ది క్షణాలు ఆలోచించి వినాయక్ లాల్ వైపు తిరిగాడు ప్రభాకరన్ "సర్! చనిపోయిన పాకిస్తానీ సైనికుల మృతదేహాలు ఎన్ని దొరికాయి మనకు...." అనడిగాడు.

రిమోట్ కంట్రోల్డ్ ఎక్స్‌ప్లోజివ్స్ గురించి గుస గుసలుగా మాట్లాడుకొంటున్న నలుగురు ఆఫీసర్లు కూడా, అతడి ప్రశ్నకు ఆశ్చర్యపడి సంభాషణ నిలిపివేశారు!

ప్రస్తుతం అది అసందర్భపు ప్రశ్నే అయినా, ప్రభాకరన్ మీద అప్పటికే ఏర్పడిన నమ్మకం చేత చిరాకు పడకుండా సమాధాన మిచ్చాడు వినాయక్ లాల్ "ఆరు దేహాలు! ఏం?!" అడిగాడు మళ్ళీ.

వాళ్ళవద్ద ఏం ఆధారాలు లభించలేదని అందరికీ తెలుసు!....కాసేపు ఆగి వినాయక్ లాల్ తో చెప్పాడు ప్రభాకరన్ ఏం చేయాలో!"

# 10

మర్నాడు రాత్రి పదకొండు దాటింది—

ఆయుధ ప్రాకారానికి ఇరవై గజాల దూరంలో వున్న చెట్లతోపు లోపల సొరంగమార్గం అప్పటివరకూ నిశ్శబ్దంగా వుంది. ఇంతలో బిలబిలమంటూ వెలుపలికి వచ్చారు పాతికమంది పాకిస్తానీ సోల్జర్లు!!

వాళ్ళు రాగానే అక్కడ కాపలావుండే తమ వాళ్ళకోసం చూశారు....వాళ్ళలో కొంతమంది ముఖాలకు గాజు మాస్క్‌లు ధరించి వున్నారు.

చీకటిలో చెట్లచాటు నుండి ఆయుధాలు ధరించిన ఆరుగురు సోల్జర్లు బయటికి వచ్చారు. పాకిస్తానీ ఆర్మీ దుస్తులు ధరించిన భారతీయ సైనికులు వాళ్ళంతా! అ

చీకటిలో అక్కడున్నవాళ్ళెవరి ఆకారాలు పూర్తిగా కనిపించడంలేదు!!

ముందు నిలబడివున్న మిలటరీ ఆఫీసర్ ఆరుగుర్నీ చూసి తృప్తిగా తల పంకించాడు. ఉర్దూలో చెప్పాడు "మేము గొడౌన్సుకి పోయి వస్తాము ఈ రోజుతో మనందరి డ్యూటీ పూర్తవబోతుంది.... తెల్లవారు జామునే మన 'ఆపరేషను బ్లాస్టింగ్' పూర్తవుతుంది....

దీంతో ఆయుధాలన్నీ కోల్పోయిన ఇండియను ఆర్మీ, కాశ్మీర్ భూభాగాన్ని మనం స్వాధీనం చేసుకొంటుంటే నిస్సహాయంగా చూడడం తప్ప ఏమీ చేయలేని స్థితిలోనికి జారబోతూంది!!"

మిగతా సైనికులు ఆనందంతో గుసగుసలుగా ఏదేదో మాట్లాడుకొన్నారు ఉర్దూలో ఉర్దూ వచ్చిన ఆరుగురు భారతీయ సైనికులు కూడా వాళ్ళతో పాటూ ఆనందాన్ని ప్రకటించారు!

ఆరుగురిని వదిలి బృందం కదిలింది గొడౌన్సువైపు.... భయంకరమైన ఎక్స్‌ప్లోజివ్స్‌ని కడుపులో దాచుకొన్న గొడౌను, ఎప్పటిలాగే ఎత్తుగా గంభీరంగా చీకట్లో కలిసి పోయి వుంది!!

• • •

ఎత్తుగా పొడవుగావున్న ఇనుపపెట్టెలు అతి పెద్దవి. దాదాపు అరవై డబ్బై అడుగుల ఎత్తున పది కిలోమీటర్ల పొడవునా పేర్చబడి వున్నాయి ఉక్కు గోడల్లా! మసక చీకటి క్రమ్ముకొని వుందక్కడ! అవసరమైన కొన్ని ప్రదేశాల్లో చిన్న చిన్న కరెంట్ దీపాలు వెలుగుతున్నాయి.

ఆర్మీకి కావలసిన సర్వాయుధాలు సప్లయి చేయగల

భారతీయ ఆయుధ భాండాగారమది. ఐదారు గంటల్లో మంటల్లో మునిగిపోయే ప్రమాదాన్ని ఎదుర్కొన బోతూంది....!

ఒక మనిషి మాత్రమే నడవడానికి వీలున్న సన్నటి సందు అది. పిల్లికంటే మెత్తగా అడుగులు వేస్తూ కదులు తున్నారు ప్రభాకరన్, తంగరాజా అందులో! అటూ ఇటూ ఎత్తుగా పేర్చబడిన ఇనుప పెట్టెల మధ్యనున్న సన్నటి బాటలు చాలా వున్నాయా గోడౌన్లో.

అయితే ఖచ్చితమైన అంచనా ప్రకారం మాత్రమే అక్కడ సంచరించాలి.... లేడా జరిగితే శత్రువులకు ముఖాముఖి ఎదురయ్యే ప్రమాదం వుందని తెలుసు ఇద్దరికీ!

ఇంతలో చప్పుడు వినిపించింది! ప్రక్క బాటలోనికి తప్పుకొన్నారిద్దరూ. ఇద్దరు సోల్జర్లు ఆ మార్గం గుండా వస్తున్నారు వాళ్ళు పాకిస్తాను సైనికులని స్పష్టంగా అర్థమవుతూంది!

అంచుదగ్గర ఆగి ఏదో తడుముతున్నారు వాళ్ళు! వారిద్దరి ముఖాలకు సన్నటి గాజామాస్కులు వుండటం గమనించారు!! రెండు నిమిషాలు గడిచాయి. వాళ్ళు కదిలారు!

మరుక్షణం ముందుగా నిర్ణయించుకొన్న పథకం ప్రకారం—ప్రభాకరన్, తంగరాజా మెరుపులా వాళ్ళ పైకి లంఘించారు!

సైనికులు తత్తరపడి తమ గన్‌లు పేల్చే లోపల, ఇద్దరి చేతుల్లోనూ సైలెన్సర్స్ అమర్చిన రివాల్వర్లు నిశ్శబ్దంగా పేలాయి! ముఖానికి మాస్కులుండటం వల్ల అరిచే అవకాశం లేకుండా సైనికులిద్దరూ నేలకూలారు.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా ఆ మాస్కులు

తొడుక్కున్నారిద్దరూ ముఖాలకు. రహస్యం అంతా వాటిలోనే వుందని తెలుస్తోంది వాళ్ళకు!?

మాస్క్ గ్లాసు పైకి తెల్లరంగులోనే కనిపిస్తున్నా ముఖానికి తొడుక్కుంటే నీలం రంగులో పరిసరాలు కనిపిస్తున్నాయి! ఇందాక సైనికులు నిలబడ్డ అంచుదగ్గర ఆగి చూశారు....!

అప్రయత్నంగా ముఖముఖాలు చూసుకొన్నారిద్దరూ! మాస్క్‌లో నుండి ఎదురుగా నీలం రంగులో కనిపిస్తున్నది చూసి!!

## 11

నలుపలకలుగా అరచేతి సైజులో మూడంగుళాల మందపాటి బాక్స్ ఒకటి కనిపిస్తోందక్కడ!? ఎరుపు రంగులో వుందది.

"అరె!?" ఆశ్చర్యంగా అన్నాడు ప్రభాకరన్, మాస్క్ తొలగించి. వరుసగా పేర్చబడిన పెద్ద పెద్ద ఇనుపపెట్టెలు తప్ప అంచుదగ్గర మరేం కనిపించడం లేదు!

అప్పటికే తంగరాజు కూడా మాస్క్ తొలగించి పరీక్షించాడు. ఇద్దరూ తిరిగి మాస్క్‌లు ధరించారు.... మెల్లగా అర్థమయింది వాళ్ళకు!

అత్యంత ప్రమాదభరితమైన ఆ ఎక్స్‌ప్లోజివ్స్ వాళ్ళు ధరించిన మాస్క్‌లో మాత్రమే కనిపిస్తాయి. ఆయుధాలు దాచివుంచిన ఇనుపపెట్టెను అంచుదగ్గర జాగ్రత్తగా ఎక్స్‌ప్లోజివ్ పరిమాణంలో కట్ చేసి వాటిని అమర్చారక్కడ!

మామూలుగా కళ్ళకుగానీ నిపుణుల వద్దనున్న కంప్యూటింగ్ మెషీన్స్‌కుగానీ, ఉనికి కొద్దిగా తెలుస్తుంది తప్ప

పూర్తిగా బయట పడవవి!

ప్రభాకరన్ గ్లాస్ తొడుక్కున్న తన చేతుల్ని మెల్లగా దానిపై వేసి జాగ్రత్తగా తడిమాడు....ఎక్స్‌ప్లోజివ్ దేని ద్వారా అంటించబడలేదు. రంధ్రంలో యిరికించబడిందంతే!

నెమ్మదిగా వేళ్ళతో కదుపుతూ అక్కడినుండి దాన్ని బయటికి తీసాడు. వీపుకు తగిలించుకొన్న బాగ్ లో పడేసుకొన్నాడు దానిని. ప్రస్తుతం దానిని పరిశీలించి చూడవలసిన అవసరంగానీ, ప్రమాదంగానీ లేదని గ్రహించాడు.

తర్వాత మిగతా మార్గాలు వెదకసాగారు ఇద్దరూ... కాసేపటికి నలుగురు సోల్జర్స్‌ని కనిపెట్టారు. నలుగురూ బాగా చీకటిగా వున్న ఒకచోట రంధ్రాలు చేస్తూ కనిపించారు!

కొత్తగా అక్కడ ఎక్స్‌ప్లోజివ్స్‌ని అమర్చడానికి సిద్ధమవుతున్నారు వాళ్ళు. మొదట ఇద్దరి మాదిరిగానే మాస్కులు ధరించిన వాళ్ళంతా అవి అమర్చడానికి శిక్షణ పొందారని తెలుస్తోంది.

ఇద్దరూ సడెనుగా ఎటాక్ చేసి వాళ్ళను మట్టుపెట్టడానికి నిర్ణయించుకొన్నారు. కళ్ళతో సైగ చేసుకొని కదిలారు!

తంగరాజా అటువైపునుండి తిరిగివచ్చాడు. ప్రభాకరన్ ఎదురుగావున్న సందుకి కుడివైపు తిరిగి మెరుపు వేగంతో దూసుకొని వచ్చాడు!!

సోల్జర్లు ఉలిక్కిపడి చేతిలో రంధ్రాలు చేయడానికి ఉపయోగించే మెషీన్సు క్రింద పడవేసి, స్టెన్‌గన్‌లు ఓపెను చేశారు కంగారుగా....!

ప్రభాకరన్ నేర్పుగా కదులుతూ ముందున్న ఇద్దర్నీ కాల్చేశాడు—ఇంతలో అవతలివైపు నుండి తంగరాజు మూలుగు వినిపించింది! అప్పటికే అతడు ఒక సోల్జర్ని నేల కూల్చాడు....

ప్రభాకరన్ వెంటనే నాలుగో వ్యక్తి వెనక్కి తిరగక ముందే అతడివైపు షూట్ చేశాడు! వెనుకనున్న పెట్టెలపై వాలిపోయి క్రిందకు జారిపోయాడా సోల్జరు.

పరుగులాంటి నడకతో ప్రభాకరన్, తంగరాజుని చేరుకొన్నాడు! అప్పటికే పైకి లేచాడు తంగరాజు. "తంగా! ఆర్యూ ఓ.కె!" ప్రభాకరన్ ఆదుర్దాగా ప్రశ్నించాడు. "ఓ కే....ఓ.కే....!" అంటున్నాడు తంగరాజు. అతడి ఎడమ భుజంపైనా, ముంజేతికి క్రిందగా చివర్న బుల్లెట్లు రాసుకొని పోవడంతో అక్కడి చర్మం చీరుకొనిపోయింది.

స్టెన్‌గన్ను పేలిన శబ్దానికి మిగతా సోల్జర్లు అక్కడికి వచ్చే అవకాశం వుంది! కాబట్టి ఇద్దరూ చచ్చిపడున్న సోల్జర్ల దగ్గరనుండి ఎక్స్‌ప్లోజివ్స్ అన్నీ తీసుకొని, చకచకా కదిలి ఒక చాటలో నుండి మరో చాటలోనికి మారుతూ దూరంగా వెళ్ళారు....

రక్తంతో తంగరాజు చేతిదగ్గర చొక్కా తడిసి పోతూంది! వెంటనే ప్రభాకరన్ బాగ్‌లోనుండి వేస్ట్‌గా వున్న క్లాత్ వెదికి త్వరగా తీసి చింపి, తంగరాజు చేతిపై రెండుచోట్లా బలంగా కట్టుకట్టాడు.

చేయి నొప్పిగావున్నా స్వాధీనంలోనే ఉండడంతో ఇద్దరూ సంతోషించారు. మిగతా సోల్జర్ల అంతు చూడడానికి—ఎక్స్‌ప్లోజివ్స్ పూర్తిగా తొలగించడానికి కదిలారిద్దరూ....గొడౌన్లో మరోవైపు నుండి యోధులైన

ఆర్మీ ఆఫీసర్లు దాదాపు పాతికమంది అదే పనిలో వున్నారు....

## 12

తెల్లవారుజామున నాలుగు దాటింది—

భారతదేశం పతాక గుర్తు వున్న ఆర్మీ హెలికాప్టర్ ప్రొపెల్లర్ చేసే శబ్దంతో బరువుగా పైకిలేచింది! హెలికాప్టర్ క్రిందిభాగంలో తెల్లటిలైటు అర్చి వేయబడివుంది.

మొత్తం నలుగురు కూర్చున్నారు అందులో. పైలట్ కాకుండా ఇద్దరు ఆర్మీ ఆఫీసర్లు. ప్రభాకరన్ వున్నారు! బయలుదేరిన పదిహేను నిమిషాలలోనే క్రమంగా ఆయుధ పాతరాల్ని దాటి రెండు మైళ్ళ ముందుకు వచ్చేసింది హెలికాప్టర్! అది ప్రయాణించే మార్గం సొరంగం వున్న ప్రదేశంగుండా సాగుతూంది.

ఆంతక్రితమే గొడౌన్‌లోకి ప్రవేశించిన పాతికమంది పాకిస్తానీ సోల్జర్లు, చనిపోగా మిగిలిన వాళ్ళు మిలటరీ స్వాధీనంలోనికి తీసుకోబడ్డారు.

ఎగురుతున్న హెలికాప్టర్‌లోనుండి ప్రభాకరన్, బాగ్‌లోనుండి గొడౌన్లో సేకరించిన ఎక్స్‌ప్లోజివ్స్ తీసి సూటిగా సొరంగం వున్న నేల పొడవునా వరుసగా పడేస్తూ పోసాగాడు....

అరగంట ప్రయాణం పూర్తయ్యేసరికి రాతి గుడి దగ్గరకు వచ్చేసింది హెలికాప్టర్! ప్రభాకరన్ క్రిందికి చూశాడు....ఐదారు ట్రక్కులవరకూ ఆగి ఉన్నాయి క్రింద!!

హెలికాప్టర్ కోట దగ్గరలోనే ఎగురుతూండడం వల్ల క్రింద పాకిస్తానీ సోల్జర్లు చాలామంది ఉండడం కన

బడుతూంది. ఇజాల్ ఖాన్ కూడా అక్కడ వుండడం లీలగా గమనించాడు ప్రభాకరన్! అప్పటికే వాళ్ళందరూ తలలు పైకెత్తి పరిశీలిస్తున్నారు. వాళ్ళకేమీ అర్థం కావడం లేదు... !?

ప్రభాకరన్ ప్రక్కనున్న ఆఫీసరు హెచ్చరించాడతడిని "మిస్టర్ ప్రభాకర్! 'ప్లీజ్ ఫినిష్ ది వర్క్. వాళ్ళు మనల్ని గమనిస్తున్నారు. చాలా ప్రమాదం!!"

ప్రభాకరన్ తల పంకించి బాగ్ లో మిగిలిన ఎక్స్ప్లోజివ్స్ ని గుడికి అతి సమీపంలో పడేశాడు....అది చిన్న వస్తువు కావడంతో అంత దూరాన ఉన్న వాళ్ళు అది గమనించే అవకాశంలేదు.

క్రమంగా హెలికాప్టర్ పైకి లేచింది. బాగా పైకి వెళ్ళిపోయింది! క్రిందనున్న వాళ్ళకు అది అతి చిన్నదిగా కనిపించసాగింది.

సరిగ్గా అప్పటికి క్రింద—

ఇజాక్ ఖాన్ ఎక్స్ప్లోజివ్స్ రిమోట్ కంట్రోల్డ్ నిపుణుల్ని బ్లాస్టింగ్ చేయడానికి, ఆర్డర్ రిలీజ్ చేశాడు. ఒకటి.... రెండు.... మూడు నాలుగు.... ఐదు.... ఆరు... ఏడు, సరిగ్గా ఏడు సెకన్లు గడిచాయి!!!

అక్కడి భూభాగాన్నంతా వణికిస్తూ ప్రభాకరన్ పడవేసిన ఎక్స్ప్లోజివ్స్ పేలి, మంటల్ని తాటి ప్రమాణం ఎదజల్లాయి!! రాతి గుడి, అక్కడి పాకిస్తానీయులు నామరూపాలు లేకుండా మట్టిలో కలిసిపోయారు.

సొరంగం కొంత పెళ్ళలుగా విరిగిన మట్టిలో కూరుకొనిపోగా మరికొంత ఓపెన్ గా కనిపిస్తూంది. మంటలు ఇంకా మండుతూనే ఉన్నాయి....

— అయిపోయింది —

సీరియల్ -

# విషాదకోయిల

[illegible]

(గత సంచిక తరువాయి)

"అవి చీడా అనే ఒకరకమైన కీటకాలు చేస్తున్న రొద. అవి గుంపుగా ఓచోటునుంచి మరోచోటికి వెళ్తూంటాయి. అవి మనిషి శరీరంమీద వాలితే చాలు శరీరంలో రకరకాల మార్పులు వస్తాయి. ముందుగా అది వాలినచోట విపరీతంగా వాచిపోవటం, పొడలు పొడలుగా బొబ్బలు లేవటం జరుగుతుంది.

అదిగాని కుడితే నోటి నుంచి, ముక్కు నుంచి రక్త స్రావం జరుగుతుంది. ఒకటికన్న ఎక్కువ కుడితే శరీరంలోని రక్తం విరిగిపోయి, క్షణాల్లో ప్రాణం పోతుంది." ఆ మాట చెప్తున్నప్పుడు కోయిల గొంతు కొద్దిగా వణికింది.

"అయితే ఎలా వాటి నుంచి తప్పించుకోవటం?" అడిగాడు సిద్ధార్థ.

ఝుమ్మన్న శబ్దం మరింత సమీపంగా వినిపిస్తోంది. అంటే ప్రమాదానికి చాలా చేరువలో వున్నారన్నమాట తాము.

"దానికీ పోకచెట్లే విరుగుడు" అంటూ ఒంటెమీది నుంచి ఛెంగున కిందికి దూకింది కోయిల. "నువ్వుకూడా దిగు. ఈ చెట్ల బెరడు నోట్లో వుంచుకుని పోకలా నమలడమే ఈ చీడా కాట్లనుంచి మనల్ని రక్షిస్తూంది" అంటూ బాణంతో పోకచెట్ల బెరడు తీసి కొంత తను నోట్లో వేసుకొని, మరో ముక్క సిద్ధార్థ కందించింది.

ఇద్దరు బెరడు నమిలి రసాన్ని మింగేలోపల వారి కతిసమీపంలో వలయాకారంగా చక్కర్లు కొడుతూ వేగంగా దూసుకొస్తూన్న చీడాదండు కనిపించింది.

"ఇప్పుడు వాటి కాటుకూడా మనల్ని బాధించదు" అని కోయిల చెప్తూండగానే చీడాలు వాళ్ళిద్దరి శరీరాల మీద వాలటం జరిగిపోయింది. అయితే వాళ్ళ దగ్గర నుంచి పోకచెట్లు బెరడు వాసన రావటం గుర్తించగానే వచ్చినంత వేగంగానూ మళ్ళీ గాల్లోకి లేచి క్షణాల్లో మాయమయ్యాయి.

సిద్ధార్థకి చాలా అబ్బురంగా అనిపించింది.

"సమయానికి మనమీ పోకచెట్ల దగ్గరకు చేరుకుని వున్నాం కాబట్టి సరిపోయింది. లేకుంటే వాటి కాట్లకి బలైపోయేవాళ్ళమే కదూ....!?" అన్నాడు.

"అవును. నిస్సందేహంగా. అవి మనల్ని కుట్టివుండేవి. ఈపాటికే రక్తస్రావంతో ప్రాణాలు వదిలిపెట్టే వాళ్ళం. మనం తిన్నగా వెళ్ళేదారిలో అఘాతం ఏర్పడి వుండకపోతే పోకచెట్లు మనకి దొరికేవి కావు. ఇప్పుడిక అవి వేరేదారిలో యెదురైనా వాటినుంచి ప్రమాదం లేదు. బెరడు బుగ్గన అలాగే ఉండనివ్వు" అన్నది కోయిల ఒంటె నధిరోహిస్తూ.

సిద్ధార్థకూడా ఒంటెపై కెక్కాడు.

మళ్ళీ ప్రయాణం కొనసాగింది. అతనికి వేసటగా వుంది. వేదనగా వుంది. మూడు రోజులుగా నిద్రలేదు. సరైన ఆహారంలేదు. దాంతో శరీరావయవాలు సహకరించటంలేదు.

నోరంతా చేదుగా జ్వరం వచ్చినప్పుడుండేలా అరుచిగా వుంది పోకచెట్టు బెరడు నోటపెట్టుకోవటం వల్లనేమో ననుకున్నాడు కాని, అది కారణం కాదు. బహుశా తనకీ ఎడారి వాతావరణం అలవాటులేక శరీరం తట్టుకోలేక పోతోంది. అందుకే ఏదో మార్పు వచ్చింది.

కాని తన పరిస్థితి నతడు కోయిలతో చెప్పలేదు. ఆమె ఇప్పటికన్నోసార్లు తనని మృత్యు ముఖం నించి కాపాడింది. ఆమె ప్రతిన చెల్లించుకోవటానికి తన చేతనైన సాయం చెయ్యాలి. అప్పుడు ఎడారి నుంచి బయటపడటానికి ఆమె సాయం తీసుకోవచ్చు. తెల్లారేవరకు ఓపిక పట్టాలి.

ఆలోచనల్నించి బయటపడ్డాడు సిద్దార్థ. తన ఒంటె నడకలో ఏదో స్పష్టమైన మార్పు వచ్చింది. ఏమిటది?

ఒంటె కుడికాలు ఎత్తి ఎత్తి వేస్తోంది. ఏదో విపరీతమైన బాధతో అది తలను అటు ఇటూ వేగంగా ఊగిస్తోంది.

దాని కుడికాలువైపు చూశాడు సిద్దార్థ. కాలికి ఏదో తాడులా చుట్టుకొనివుంది. అయితే అది తాడుకాదని భయంకరమైన విషసర్పమని, అది ఒంటె కాలి నప్పటి కన్నోసార్లు కరిచిందని, ఒంటె రక్తం పూర్తిగా విషపూరితమైపోయిందనీ అతను గ్రహించేసరికి ఒంటె నోటి నుంచి నురగలు వస్తూన్నాయి.

అమాంతం ఒంటె ఇసకలో కూలబడిపోవటం, విష సర్పం తల అతి వేగంగా సిద్ధార్థ కాలివైపు దూసుకు రావటం ఒకేసారి జరిగాయి.

సిద్ధార్థ ప్రమాదాన్ని గుర్తించిన మరుక్షణం చేతనున్న కత్తితో దాని తల ఒక్క వేటుకు నరికేశాడు.

కోయిల ఒంటెమీదినుంచి చెంగున కిందికి గెంతి అతన్ని సమీపించింది.

"సమయానికి మెరుపుకన్న వేగంగా కత్తి నడిపించావ్. చాలా ప్రమాదం తప్పిపోయింది నీకు. కాని ఒంటె బలైపోయింది" అన్నది విచారంగా కోయిల.

అప్పటికే ఒంటె అవయవాలు నిస్తేజమైపోయాయి.

"ఎడారుల్లో మాత్రమే తిరిగే ఈ సర్పాలు మామూలు విష సర్పాలకన్న వందరెట్లు విషపూరితమైనవి. విశేషమేమిటంటే దీని కోరల్లోనే కాదు, శరీరం ప్రతి అణువునా విషముంటుంది. అందుకే ఒంటెవంటి మహాకాయం కూడా దీని కాటుకి నేలకూలిపోయింది." చెప్పింది కోయిల.

"అయితే ఇప్పుడెలా?"

"ఇద్దరం నా ఒంటెమీదనే ప్రయాణం సాగించాలి." అన్నది కోయిల.

* * *

ఇద్దరు ఒకే ఒంటె నధిరోహించారు. ముందు కోయిల, ఆమె వెనక సిద్ధార్థ.

ఆమె శరీరంలోని అనాచ్ఛాదితమైన భాగాలు అతని శరీరానికి తగులుతున్నాయి. ఆమెను ఆనుకుని అంత సమీపంగా కూచోవటం అతనికి ఇబ్బందిగా, సిగ్గుగావుంది.

కాని కోయిల అదేమీ గమనించే స్థితిలోలేదు. ఆమె

ఏకైక లక్ష్యం ఘోర్క్ జాతిని సమూలంగా నాశనం చెయ్యటం. అంతే! తక్కిన విషయాలేవీ ఆమె మనసును స్పృశించటం లేదు.

సిద్ధార్థ వాచీ చూసుకున్నాడు.

రెండుగంటల పదినిమిషాలు. వాతావరణం మరీ చల్లగా వుంది. చలేస్తోంది. వుండీ వుండీ గాలి చేస్తున్న వింత ధ్వని సన్నగా పైకి లేస్తున్న ఇసుక చేస్తున్న శబ్దం తప్పితే అంతటా ప్రశాంతంగా వుంది.

"ఇప్పుడు మనం కుడికి తిరగాలి. మనకి ఆఘాతం అడ్డొచ్చిన దారికి మళ్ళుతున్నాం. నా అంచనా ప్రకారం మరో గంట, గంటన్నరలో గమ్యం చేరుకోగలుగుతాం" చెప్పింది కోయిల

"మీకు వాచీలు, గడియారాలు వుండవు కదా! గంటలు ఎలా లెక్కిస్తారు?"

"పగలైతే సూర్యుడి గమనాన్ని బట్టి రాత్రిళ్ళు ఝాముల్ని బట్టి లెక్కిస్తాం. మా పెద్ద వాళ్ళకి ఇవన్నీ లెక్కకట్టడం బాగా తెలుసు."

సిద్ధార్థ మౌనంగా వింటున్నాడు.

వారికి సమీపంలో సన్నటి వెలుతురు మినుకు మినుకు మంటూ కనిపిస్తోంది.

సిద్ధార్థ ఆ వెలుతురు చూపించి, "అదేనా ఘోర్క్ జాతి నివసించే ప్రదేశం?" అనడిగాడు.

కోయిల తేరిపార అటు చూసి, "ఊహూఁ! అది మాలాంటి మనుషులే నివసించే మరో గూడెం. ఈ ఎడారి ప్రాంతంలో దాదాపు ఇరవై ఎనిమిది గూడేలున్నాయని మా వాళ్ళు చెప్తుంటారు." అన్నది.

అయితే కోయిల అంచనా ఇక్కడే ఘోరంగా

తప్పింది. అంతక్రితమే వెళ్ళవలసిన దారి తప్పింది. అలవాటులేని దారిలో అంతదాకా సాగిన ప్రయాణం వల్ల, సహజంగానే ఆమె పొరబడింది.

అది తను గూడేల్లాంటి గూడెంకాదని, తన పెద్ద వాళ్ళకూడా తెలియని అతి అనాగరికమైన జాతి మనుషులుండే నరక కూపమని, అక్కడ తాను ఘోరమైన పరిణామాన్ని ఎదుర్కోవలసి వస్తుందని ఆమె గ్రహించలేదు.

సరిగ్గా వాళ్ళు ఆ వెలుగును సమీపిస్తుండగానే ఎక్కడినుంచో గాల్లో రివ్వు రివ్వున దూసుకొచ్చాయి బాణాలు.

ప్రమాదం గ్రహించగానే కోయిల సిద్ధార్థతో పాటు కిందికి గెంతేసింది. బాణాలు వాళ్ళ తలలమీదుగా అతి వేగంగా దూసుకుపోయి ఇసకలో కూరుకుపోయాయి.

ఆమె ఇలాంటి పరిస్థితి నెదుర్కోవటానికి సిద్ధంగా లేదు. అయినా క్షణాల్లో ఎలర్టుగా అయిపోయింది.

“ఎవరో మనమీద తెలియక బాణాలు వదులుతున్నారు. నువ్వూ బాణాలు వదులు.” అంటూనే నారి ఝుంకారం చేస్తూండగా తమవైపు బాణాలు వచ్చిన దిశలో వున్న గుబురుగా పెరిగిన చెట్టువైపు శరపరంపర వదిలింది.

పెద్దగా కేక పెడుతూ ఇద్దరు నేలమీద పడిపోయారు. వాళ్ళ శరీరాల్లో గుచ్చుకున్న బాణాల కొసలు స్పష్టంగా కనిపించాయి సిద్ధార్థకి.

అయితే ఆ చెట్టుమీద ఇంకా మనుషులున్నారనిటానికి సూచనగా మళ్ళీ బాణాలు దూసుకొచ్చాయి వాళ్ళవైపు.

అయితే ఈసారి రెండో ఒంటె శరాఘాతాలకి బలైపోయింది. దాని శరీరంనిండా బాణాలు గుచ్చుకున్నాయి.

చెదిరిపోయి తన ఇష్టమైన దిశలో గెంతులు వేస్తూ వార పోయింది ఒంటె.

కోయిల ఆగ్రహాన్ని అణచుకుంటూ బాణాలు సంధించింది. సిద్దార్థ కూడా ఆమెకు తీసిపోకుండా వదులుతున్నాడు బాణాలు.

మరో ఇద్దరు చెట్టుమీదినుంచి పక్షుల్లా నేలకూలి పోయారు. అయితే నేల కూలుతూ వాళ్ళు చేసిన సంకేతం గాలిలో ప్రతిధ్వనించి ఎక్కడో వున్న వాళ్ళ మనుషులకి వార్త చేరిపోయింది.

బాణాలవర్షం తాత్కాలికంగా ఆగిపోయింది.

"మనం వెంటనే ఇక్కడ్నుంచి తప్పించుకుపోవాలి. వీళ్ళు మా గూడెం మనుషులకి భిన్నంగా వున్నారు. వీళ్ళు మనమీద శత్రుత్వంతో వ్యవహరించారు. తమ మనుషుల్ని చంపినందుకు ఆ గూడెం వాసులు మనమీద ప్రతీకారం తీర్చుకుంటారు. పరుగెత్తు" అంటూ ఇసకలో పరుగందుకున్నది కోయిల.

ఆమెతోబాటు పరుగెత్తుతూ, "ఇలా ఎంతదూరం పరుగెత్తిపోగలం? మనం తలదాచుకోవటానికి మరుగైన ప్రదేశం ఏదీ కనుచూపు మేరలో కనిపించటంలేదే....!" అన్నాడు సిద్దార్థ.

"అదిగో ఆ చెట్టు చూశావా? చాలా దట్టమైన కొమ్మలు. ప్రస్తుతానికి మనకి అదే రక్షణ నిస్తుంది." అన్నది కోయిల.

పది నిమిషాల్లో ఆ చెట్టు సమీపించారు.

కోయిల చకచక ఎక్కేసింది చెట్టు.

కాని సిద్దార్థ నాలుగైదు సార్లు జారిపోతూ మళ్ళీ ప్రయత్నిస్తూ చివరికి కోయిల చేయి అందించగా ఎలాగో

చెట్టెక్కాడు.

ఇద్దరు గుబురు కొమ్మల్లోకి ఎగబాకి కూచోవటానికి అనుకూలంగా వున్న ఓ కొమ్మమీద కూచున్నారు.

వాళ్ళకిప్పుడు చాలా దూరంవరకు కనిపిస్తోంది ఆ ప్రాంతమంతా. దూరంగా వెలుగు కనిపించింది. ఆ వెలుగు క్రమంగా కదులుతూ వస్తోంది.

• • •

సిద్ధార్థ కళ్ళు చికిలించి చూశాడు.

అనుమానం లేదు. ఇందాకా ఆ మనుషులు నేల కూలి పోతూ పెట్టిన కేకలకి జవాబుగా వాళ్ళ మనుషులు పరుగెత్తుకొస్తున్నారు. క్షణాల్లో తమ ప్రాకారంలోకి శత్రువులెవరో ప్రవేశించినట్టు గ్రహిస్తారు. ఆ తర్వాత తమ కోసం వేట ప్రారంభమవుతుంది.

కోయిల మనసు నలిగిపోతోంది. తాననుకున్నదేమిటి, జరిగిందేమిటి? మరో గంటలో ఘోర్క జాతి బందిపోట్ల ప్రాకారం చేరుకోగలనని, వాళ్ళని సమూలంగా నాశనం చెయ్యగలిననీ ఎంతగానో అనుకొన్నది. తన ప్రతీకారం చెల్లించుకోవాలని ఆరాటపడింది.

కాని అనుకోకుండా ఎదురైన అవాంతరంవల్ల తనపని అసంపూర్తిగా మిగిలిపోయింది. వీళ్ళ చేతుల్లో చిక్కితే తనని ప్రాణాలతో వొదలరు, అది నిశ్చయం! తనుకూడా ప్రాణం పోయేవరకు ఎదిరించి పోరాడి వీళ్లైనంతమందిని హతమార్చగలదు. కాని, ఏం సాధించినట్టు? తను హతమార్చవలసింది వీళ్ళని కాదు.

దీర్ఘంగా నిట్టూర్చింది కోయిల.

ఆ వెలుతురు కాగడాల వెలుతురని గ్రహించారిద్దరు. జంతు కొవ్వునుంచి చమురుతీసి దాని సాయంతో

కాగడాలు తయారు చేస్తారు ఎడారి వాసులు.

"వాళ్ళు ఇటే వస్తున్నారు. బాణాలు ప్రయోగించి నేలకూలుద్దామా?" అన్నాడు సిద్ధార. అతని మాటల్లో ఆత్మవిశ్వాసం, కోటి మందిని ఒకేసారి నేలకూల్చగల నన్న ధైర్యం ధ్వనించాయామెకు.

"అది చాలా ప్రమాదం. వాళ్ళు దాదాపు ఏభైమంది వున్నారు. అదిగో కాగడాల వెలుతురులో ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నారు, గమనించావా?"

సిద్ధార అవునన్నట్టు తలూపాడు.

"మనం ఇద్దరం, మన దగ్గిర బాణాలు కూడా ఖర్చయి పోయాయి. వాళ్ళ కెదురునిలిచి బతికి బయటపడలేం. తప్పనిసరి పరిస్థితి యెదురైతే ఇక అదే దారి!" అన్నది కోయిల.

తమ మనుషులు నేలకూలిన చెట్టును చేరుకున్నారు ఆ ఏభైమంది వ్యక్తులు.

వాళ్ళ ఒంటిమీద గోచీలుతప్ప మరేవిధమైన ఆచ్ఛాదనా లేదు. వాళ్ళు నల్లగా లావుగా పొట్టిగా వున్నారు. మరుగుజ్జులా అనిపించేలా వాళ్ళందరి చేతుల్లోను విల్లంబులున్నాయి. వాళ్ళ కళ్ళు రక్తంతో తడిసినట్టు ఎర్రగా మెరుస్తున్నాయి కాగడాల వెలుతురులో.

వాళ్ళు దయ, జాలి అనే మాటలకర్థం తెలియని కర్కశులని వాళ్ళ రూపమే చెపుతోంది.

తమ మనుషులు చచ్చిపడుంటం చూడగానే వాళ్ళలో వీరావేశం పెల్లుబికింది. గట్టిగా దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు. ఆ భాషేమిటో వాళ్ళిద్దరికీ అర్థం కాలేదు.

కోయిల జాతివాళ్ళు యాసతోనైనా అర్థమయ్యే

హిందీలోనే మాట్లాడారు. వాళ్ళ వేషభాషలు మరీ అనాగరికమైనవి కాదు. కాని అదే ఎడారిలో మరో మూల ప్రాంతంలో నివసిస్తున్న ఆ మరుగుజ్జా మనుషుల వేషభాషల్లో ఎంత విపరీతమైన మార్పు?

వాళ్ళు నలువైపులా నాలుగు భాగాలుగా చీలి పోయారు. తమ శత్రువులకోసం వేట ప్రారంభించారు.

సిద్ధార్థ, కోయిల ఇక తమ అంతిమ క్షణాలు సమీపించాయని అర్థం చేసుకున్నారు. ప్రాణాలు పోయే ముందు వీలైనన్ని ప్రాణాల్ని బలితీసుకోవాలి. అదే వాళ్ళ స్థిర నిర్ణయం!

వాళ్ళు కాగడాల సాయంతో ఆ ప్రదేశమంతా క్షుణ్ణంగా ప్రతీ అంగుళం వెతుకుతున్నారు.

వాళ్ళలో ఓ బేచ్ వెతుక్కుంటూ తిన్నగా కోయిల సిద్ధార్థలు కూచున్న చెట్టుకిందికి వచ్చారు.

కోయిల సిద్ధార్థ కళ్ళతోనే ఒకరికొకరు సంకేతాల నందించుకున్నారు. ఊపిరి బిగబట్టి కూర్చున్నారు కొమ్మ మీద. అప్పుడో మరుక్షణంలోనో వాళ్ళు తమని చూడటం ఖాయం!

ఇద్దరు బాణాలు చేతపట్టుకున్నరు.... విల్లు ఎడమచేత, బాణం కుడిచేత సిద్ధంగా వున్నాయి. సిద్ధార్థ భుజమ్మీది గాయం నుంచి అంతకితమే రక్తం మళ్ళీ స్రవించటం మొదలయ్యింది. అయినా పళ్ళబిగువున బాధను అణచు కుంటూ అలాగే కూచున్నాడు. పట్టాకత్తి కొమ్మమీద అనువుగా పెట్టుకున్నాడు.

మరుగుజ్జా వాళ్ళలో తెలివితేటలు అధికంగా వుంటా యనటానికి నిదర్శనంగా అందులో ఒకడు ఇసకలో చెట్టుకిందపడ్డ తమ కాలి గుర్తుల్ని పసికట్టేశాడు. తన

వాళ్ళతో ఉద్రేకంగా ఏదో చెప్పాడు.

అంతే! అందరి దృష్టి చెట్టుమీదకి తిరిగింది. వాళ్ళు సరిగా పన్నెండుమంది వున్నారు. బాణాలు ప్రయోగించినా బలంగా నాటుకొనేంత దగ్గరగా వున్నారు.

వాళ్ళు నాగడాలు పైకెత్తిపట్టుకున్నారు. చెట్టు కొమ్మలు చాలా గుబురుగా వున్నాయి. పైన ఎవరైనా దాక్కుని వున్నదీ లేనిదీ కనిపించటంలేదు. అయితే పైనుంచి సిద్ధార కోయిల వాళ్ళని స్పష్టంగా చూడగలుగుతున్నారు వెలుగులో ఉండటంవల్ల. ఏ క్షణంలోనైనా అగ్నిపర్వతం బద్దలవుతుందని వాళ్ళు గ్రహించారు.

వాళ్ళలో వాళ్ళేదో గోలగా మాట్లాడుకుంటున్నారు. ఒకేసారి నలుగురు చెట్టెక్కటం మొదలెట్టారు.

సిద్ధార కోయిలలకు గుండెలు గొంతులో కొట్టుకుంటున్నాయి. ఇక సమయం ఆసన్నమయింది.

సిద్ధార పట్టాకత్తి చేత్తో అందుకున్నాడు. చెట్టెక్కిన వాడినల్లా దాంతో తెగనరికెయ్యటానికి నిర్ణయించుకున్నాడు.

వాళ్ళు నలుగురు చకచక చెట్టెక్కి పైకి వచ్చేశారు. సిద్ధార, కోయిల వాళ్ళ దృష్టిలో పడిపోయారు. వాళ్ళు ఆనందంతోను ఆవేశంతోను పెద్దగా కేకలు పెట్టారు.

అంతే! కింద నించున్న వాళ్ళలో చైతన్యమొచ్చింది. గోలగా అరిచారు.

సిద్ధార చేతిలోని పట్టాకత్తి విసురుగా లేచింది. అదే సమయంలో కోయిల పైకొమ్మలకెక్కి అక్కడ్నుంచి బాణాలు సంధించింది.

చకచక నలుగుర్ని నేలకూల్చేశారు సిద్ధార, కోయిల. కింద పెద్ద కోలాహలం!

సరిగ్గా అప్పుడే ఒక్కసారిగా పదుల సంఖ్యలో చుర్చ్యా మృగాలు అక్కడ ప్రత్యక్షమయ్యాయి. కింద నిల్చున్న ఎనిమిదిమంది మరుగుజ్జుల్ని క్షణాల్లో విష వాయువు వదిలి హతమార్చేశాయి.

అంతటితో అవి శాంతించలేదు. ఎడారి నలువైపులా కాగడాలతో తిరుగుతున్న తక్కిన మరుగుజ్జుల మీద దాడి చేశాయి. ఒక్కడిని కూడా వదిలిపెట్టకుండా అందర్నీ వెంటాడి వేటాడాయి.

వాటి ముక్కులనుంచి వెలువడుతున్న విషవాయువు ఘాటు సిద్ధార్థ, కోయిలల నాసికా పుటాలని సోకాయి. వెంటనే శ్వాసను బంధించారు ఇద్దరూ.

కొద్ది క్షణాల తర్వాత చుర్చ్యా మృగాలు తమ విశ్వ రూపాన్ని ఉపసంహరించుకుని శాంతించాయి. వచ్చినవి వచ్చినట్లే ఎటో మాయమయ్యాయి.

కోయిల, సిద్ధార్థ అప్పుడు ఊపిరి వదిలారు. ముక్కుకి ఘాటు వాసనలు తాకలేదు. గుండెనిండా స్వచ్ఛమైన గాలిని పీల్చుకున్నారు.

ఘోర ప్రమాదాన్ని వెంట్రుకవాసిలో తప్పించుకో గలిగినందుకు ఒకరినొకరు అభినందించుకున్నారు.

అప్పుడు సమయం తెల్లవారుఝామున నాలుగు గంటలయింది.

కోయిల ముఖంలో నిరాశను స్పష్టంగా గుర్తించాడు సిద్ధార్థ.

"ఉత్సాహం తెచ్చుకో! ఎలాగైనా ఆ ఘోర క్రూ జాతి నంతంచేసి తీరతాం. నీ తండ్రి ఆత్మకు శాంతి చేకూర్చుతాం." అన్నాడు సిద్ధార్థ ఆమెను ప్రోత్సా హిస్తూ.

కోయిల కళ్ళు మెరిశాయి. ముఖంలో మళ్ళీ కళాకాంతులు చోటు చేసుకున్నాయి.

"నిజంగా మనం ప్రతీకారం చెల్లించుకోగలమంటావా?" అన్నది.

"ఖచ్చితంగా. ఈ రోజు కాకున్నా రేపయినా సాధిస్తాం.... ఇక వెళ్దామా?"

"వెళ్దాం. మనం దారి తప్పామని ఇప్పుడర్థమయ్యింది నాకు. తెల్లవారితేనే గాని ఈ పరిసరాల్ని గుర్తించలేను. ఈ ప్రాంతాని కిదివరలో ఎప్పుడూ వచ్చిన గుర్తులేదు."

"అయితే తెల్లారేవరకు ఈ చెట్టుమీద ఇలాగే గడిపేద్దామా?"

"అది ప్రమాదం. ఆ మరుగుజ్జ జాతివాళ్ళింకా చాలా మంది వుండొచ్చు. ఈ ఏభైమంది తిరిగి రాకపోవటం చూసి వాళ్ళు బయల్దేరి రావచ్చు."

"అందు కవకాశముంది. అయితే మనం వెంటనే ఈ ప్రాంతం వదిలి వెళ్ళిపోవటమే శ్రేయస్కరం. మనమీది పగను ఈ మరుగుజ్జుల మీద చూపి, మనల్ని రక్షించిన చుర్యాలు వీళ్ళకన్నా ఎంతో నయం! వాటికి మన కృతజ్ఞతలు తెలియ చేసుకుందాం."

కిలకిల నవ్వింది కోయిల.

"గమ్మత్తుగా మాట్లాడతావు" అన్నది.

ఇద్దరూ చెట్టు దిగారు.

• • •

మరో గంటసేపు గమ్యంలేని ప్రయాణంలా అలా ముందుకు సాగిపోయారిద్దరూ.

తూర్పున తొలి తెలిరేకలు విచ్చుకునే సమయం. చలి గాలి రివ్వున ముఖానికి ఈడ్చికొడుతోంది.

ఇద్దరు ఇసకలో కాలినడకన నడుస్తున్నారు. కోయిల సువాయాసంగా సాగిపోతుంటే, కూరుకుపోతున్న కాళ్ళను కూడదీసుకుంటూ బాగా వెనబడిపోయాడు సిద్ధార.

వాళ్ళ భుజాలకు ధనుస్సులు వేలాడుతున్నాయి. చాలా తక్కువ బాణాలు మాత్రం వీపుకు కట్టుకున్న అంబులపొదల్లో వున్నాయి. పట్టాకత్తిని జాగ్రత్తగా ఎడమచేతిలో పట్టుకునే వున్నాడతను. కుడిభుజం నుంచి రక్తం వుండి వుండి స్రవిస్తోంది.

కోయిల రక్త స్రావాన్ని గుర్తించింది. కాని, వైద్యానికి కావలసిన ఆకులు అందుబాట్లో లేకపోవటంతో ఏమీ చెయ్యలేక ఊరకుండిపోయింది.

కొద్ది కొద్దిగా వెలుగు పరచుకొంటున్న ఆ ప్రభాత వేళ హఠాత్తుగా, మేట వేసిన ఇసక పక్కనుంచి ఓ ఆకారం లేచి కోయిలమీద కెగిరి దుమికింది.

ఆమెను కొన్ని గజాల వెనకగా వస్తూన్న సిద్ధార కళ్ళబడిందా దృశ్యం. ఒక్క క్షణం తొట్రుపడ్డాడు. అంతే! వెంటనే చాలా వేగంగా బాణం సంధించి వదిలాడు.

ఇంకో క్షణం ఆలస్యమైతే కోయిల జీవితం అంతమై పోయేది! సరిగ్గా బాణం ఆ ఆకారం గొంతులో బలంగా నాటుకోవటం, వెంటనే అది దబ్బున ఇసకలో పడి పోవటం, కోయిల ఎలర్ట్ కావటం వెంట వెంటనే జరిగి పోయాయి.

సిద్ధార నాలుగడుగుల్లో ఆమెను చేరుకున్నాడు. కిందపడ్డ ఆకారాన్ని ఆశ్చర్యంగా చూశాడు. ఒంటినిండా నల్లటి బొచ్చుతో, పొడవాటి మూతితో

కోరపళ్ళతో చాలా వికృతంగా వుందా ఆకారం. గొంతులో నాటుకున్న బాణం దాని ప్రాణాన్ని పూర్తిగా తియ్యలేకపోయింది. ఇంకా డొక్కలు ఎగరేస్తూనే వున్నది.

"చాలా ఘోర ప్రమాదంనించి కాపాడావు, నీకు నా కృతజ్ఞతలు." అన్నది కోయిల అతనివంక ఆరాధనగా చూస్తూ.

"దీన్నేమని పిలుస్తారు? ఇది కూడా మనుషుల్ని చంపి తింటుందా?" అడిగాడు సిద్ధార్థ.

కోయిల అతనివంక ఆశ్చర్యంగా చూసి, "ఇది చాలా ప్రమాదకరమైన జంతువు. దాన్ని ఎడారి భల్లూకం అని పిలుస్తాం. ఒక దెబ్బతో మనిషినిగాని ఏదైనా జంతువునిగాని క్షణంలో చంపి ఆరగిస్తుంది. నీవు ప్రమాదాన్ని చాలా తొందరగా గుర్తించి నన్ను రక్షించావు." అన్నది.

"నువ్వు నన్ను రెండుసార్లు రక్షించావు, లేకుంటే నేనంటూ వుండేవాడినా?"

"అయితే నాకిప్పుడు ఘోర్క జాతి నివసించే పాథరానికి సరైనదారి తెలిసిపోయింది. ఎడారి భల్లూకాలు నివసించే ప్రాంతానికి సమీపంలోనే ఘోర్క జాతి నివసిస్తోంది." అన్నది కోయిల ఆనందంగా.

"గుడ్ ....అయితే ఇప్పటికి మనం సరైన దారిలోకి వచ్చామన్నమాట!"

"అవును. నా ప్రతిన చెల్లించుకునే అవకాశం కొద్ది గంటల్లో నాకు లభించబోతోంది." అన్నదామె అతని చెయ్యి పట్టుకుని భావావేశంతో ఊగిపోతూ.

తన చేతిని వెనక్కి తీసుకోవాలనుకున్నాడు సిద్ధార్థ.

కాని ఆమె సంతోషాన్ని భగ్నం చెయ్యలేకపోయాడు.

కోయిల చటుక్కున అతని చేతిని గాఢంగా చుంబించింది.

ఆశ్చర్యంతో అతని కళ్ళు పెద్దవయ్యాయి. ఏమిటీమె అంతర్యం? కేవలం తన కోరిక నెరవేర బోతున్నదన్న సంతోషంతో అలా చంటిపిల్లలా కేరింతలు కొడుతూ, తనతో ఆ ఆనందాన్ని పంచుకుంటోందా? లేక ....!?

తల విదిలించాడు. ఆమె వైపు తల తిప్పి సూటిగా ఆమె ముఖంలోకి చూశాడు.

కోయిల కళ్ళు వింత కాంతితో ప్రకాశిస్తూన్నాయి. అలాంటి కాంతి, తను సుస్మిత కళ్ళలో చూశాడు, ఆమె తనతో గడిపిన చివరి క్షణాల్లో. తనమీది ప్రేమను వెల్లడించిన అపురూప క్షణాల్లో ఇలాగే వున్నాయామె చూపులు. అంటే, కోయిలకూడా ....!?

అతనికి తన ప్రేయసి దివ్యకూడా అదే క్షణంలో గుర్తొచ్చింది. ఆమె తనతో గడిపిన సాయంత్రాలు ఎన్నో సార్లు తన కళ్ళలో కళ్ళుపెట్టి ఇలాగే చూసేది. ఇదే కాంతి ఆమె కళ్ళలో కూడా!

ఊహు, కోయిల కళ్ళలో మెరుస్తున్న కాంతి అలాంటిది కాదు, కానేకాదు. ఆమె అమాయకురాలు. ఇలాంటి వేమీ తెలియని పసి మనస్తత్వం. తను అనవసరంగా ఆమె చర్యలకి భాష్యం మరోలా చెప్పుకుంటున్నాడు.

తనని తాను సమాధాన పరచుకోవటానికి ప్రయత్నిస్తూ చూపులు తిప్పుకున్నాడు. కాని కోయిల ఇంకా తదేకంగా అతనివైపే ఆర్తిగా, ఆరాధనగా, అపురూప వస్తువును చూసినట్టు చూస్తోంది.

సిద్ధార్థకి సిగ్గనిపించింది. కాని, కోయిల ఏ మాత్రం సంకోచం లేకుండా అతన్నే చూస్తోంది.

అయిదు నిమిషాలు భారంగా గడిచాక, "ఇక తెల్లవారటానికి ఆట్టే సేపు లేదు. కదులుదామా?" అన్నాడు.

కోయిల అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్టు అతని మీది నుంచి చూపులు తిప్పుకుని, "బయల్దేరుదాం." అన్నది.

ఇద్దరు మళ్ళీ ముందుకు సాగారు.

కోయిల చాలా ఉత్సాహంగా వుంది. తన కోరిక త్వరలో నెరవేరబోతున్నందుకు, సరైన దారిలో సే తమ ప్రయాణం సాగుతున్నందుకు ఆమె కెంతో ఆనందంగా వుంది.

కాని, ఆ ఆనందం ఎంతో సేపు ఆమెకు దక్కలేదు. ఎడారి భల్లూకాలు సంచరించే ప్రాంతానికి ఘోరక జాతి బందిపోట్లుండే ప్రాంతం చాలా దగ్గరని ఆమె భావించిందే గాని, ఆ భల్లూకాలు తనదారి కడ్డు తగులుతాయని కల్లో కూడా అనుకోలేదు.

ప్రమాదాన్ని ఈసారి కూడా సిద్ధార్థే ముందుగా గ్రహించాడు. "కోయిలా!" అంటూ హెచ్చరికగా అరిచాడు.

కోయిల ఉలిక్కిపడి వెనుతిరిగి చూసింది.

ఒకటి కాదు, రెండు కాదు, పదుల సంఖ్యలో ఎడారి భల్లూకాలు వారివైపు వేగంగా దూసుకొస్తున్నాయి.

కోయిల వెంటనే తయారయింది. అంబుల పొది నుంచి బాణం తీసి సంధించింది. కాని బాణం వదలటానికి సంకోచించింది.

ఒకటో రెండో అయితే ఫరవాలేదు. అధిక సంఖ్యలో వున్నవాటిని హతమార్చటం తమిద్దరి తరంకాదు. దెబ్బ తిన్న భల్లూకాలు ఎలా రెచ్చిపోతాయో ఆమెకు బాగా తెలుసు.

వాళ్ళకు ఆ భల్లూకాలకు కేవలం కొన్ని అడుగుల దూరం మాత్రమే వుంది.

దిక్కుతోచని స్థితిలో ఇద్దరూ అలాగే నిల్చుండి పోయారు.

* * *

దివ్య మాటిమాటికీ వాచీ చూసుకుంటూ గుమ్మం వైపు చూస్తోంది.

ఈ పాటికి రావల్సిందే సిద్ధార్థ. ఎందుకని రాలేదు చెప్మా? ...డ్యూటీ దిగగానే ఏర్‌పోర్టు నించి సరాసరి తనని చూడటానికే వస్తానని ఢిల్లీ వెళ్ళేముందు తనకి ప్రామిస్ చేశాడు.

సిద్ధార్థ మాట నిలుపుకునే మనిషి! అందులో అవంతైనా అనుమానంలేదు. ఇంకా ఢిల్లీనుండి రాలేదేమో !?

అతని గురించి తలుచుకొనే కొద్దీ ఆమెకు అతన్ని చూడాలనే కోరిక అధికమవుతోంది.

పదే పదే అతని చిలిపిమాటలు, అతని సుందరవదనారవిందం, అతని చేష్టలు గుర్తొస్తున్నాయి,

అతను ఢిల్లీ వెళ్ళేముందు రోజు సాయంత్రం అతనితో గడిపిన క్షణాలు గుర్తొచ్చాయి. మనసు గిలిగింతలతో పులకించిపోయింది....

ఇద్దరు పబ్లిక్ గార్డెన్స్‌లో పక్క పక్కనే కూచుని

వుండగా అతను తనని ఏడిపించటానికి ఏర్‌హోస్టెస్‌ల ప్రస్తావన తెచ్చి వాళ్ళ అందాలని వూరకే పొగడటం మొదలెట్టాడు.

తనకి సహజంగానే ఉడుకుమోత్తనం వచ్చేసింది. మూతి బిగించుకుని పక్కకు ముఖం తిప్పుకుని కూచుంది.

సిద్ధార్థ భయం నటించి, శిరస్సు అలవోకగా వంచి నాటక ఫక్కీలో, "భక్తుడ్ని అనుగ్రహించు దేవీ, కోపించకు!" అన్నాడు. అతని కళ్ళు అల్లరిగా నవ్వుతున్నాయి.

చిరుకోపంతో అలవోకగా అతనివంక చూసింది తను. అతనా మాటలు పలికిన తీరు, నిల్చున్నతీరు చూసి నవ్వేసింది ఫక్కున.

"హమ్మయ్య, కరుణించావా దేవీ! అంతే చాలు ఈ దీనుడికి!" అన్నాడు సిద్ధార్థ తన కళ్ళలో కళ్ళు కలిపి, కనుబొమ్మలు కొద్దిగా పైకి లేపుతూ.

"ఛీ, ఏమిటా రౌడీ చూపు? అందరమ్మాయిల వంక అలాగే చూస్తూన్నావా?" అన్నది తను.

"అపచారం, అపచారం! అసలు నేను అమ్మాయిల వంక కన్నెత్తి చూడనే—నిన్ను తప్ప!"

"ఉహూ, అలాగేం? ఈ డైలాగ్ ఎంత మంది అమ్మాయిలతో వల్లించావో !?"

"హతోస్మి! అంత ఘోరంగా అనుమానించటం న్యాయంకాదు దివ్యా! నేనలాంటి చపలచిత్తుణ్ని, గ్రంథసాంగుడ్ని కాను. నామాట నమ్మలేవా ప్రియా!?"

"చేయి చాస్తే అందేంత దూరంలో, అందంగా అలంకరించుకుని ఫ్యాషన్ పెరేడ్‌లో పాల్గొనడానికి

సిద్ధంగా వున్నట్టు వోయిలు ఒలకబోస్తూ, ప్యాసింజర్లని ఆహ్వానిస్తూ చిరునవ్వుల్లో వసుం చెలిస్తూ ఎయిర్ హోస్టెస్ లు కళ్ళముందు మెరుపుతీగల్లా మెరుస్తూంటే చలించలేక పోవటానికి నువ్వేమైనా ఋశ్యశృంగుడివా, ఇనప కచ్చడాలో ధరించిన మునిపుంగవుడివా....!?" తన కసినంతా ఆ మాటల్లో కళ్ళబోసుకుంది తను.

"స్టాప్. స్టాప్! నా తెలుగు పరిజ్ఞానమే అంతంత మాత్రం. నీ సంస్కృత సమాసాల్ని అర్థం చేసుకుని జీర్ణించుకోవటం అంత సులభసాధ్యమా? దయచేసి, అచ్చ తెలుగులో బుల్లి వాక్యాలు మాట్లాడు సఖీ!" అంటూ వాపోయాడు సిద్ధార్థ

"నేను మాట్లాడేది అచ్చ తెలుగే విమాన చోదకా!"

"అదేమిటి, మళ్ళీ మరో కొత్తమాట! అర్థంకాలేదు చెలీ!"

"పైలట్ కి తెలుగు అనువాదం, సంస్కృత మిశ్రితమైన తెలుగు మాట!"

"అదేం వద్దు ప్రాణేశ్వరీ! పైలట్ గా నీ వ్యవహరించు, చాలు!"

"నువ్వేమిటి—సఖీ. చెలీ, ప్రియా ప్రాణేశ్వరీ అంటూ అలా కలవరించిపోతున్నావ్....!?"

"ఏం చెయ్యను మరి! అలా కలల్లో కలవరించటమే గాని, నువ్వు వరించటంలేదు కదా...."

"అక్కడికి తప్పంతా నాదేనంటావు....! నువ్వు ఎప్పంటే నేను కాదంటావా? గ్రీన్ సిగ్నల్ రావలసింది నీవైపునుంచే! నీ చెల్లెళ్ళ పెళ్ళి అయ్యాకనే మన పెళ్ళి అన్నావు మరచిపోయావా."

ఒక్కసారిగా అతను మౌనం వహించాడు. అతని ముఖంలో యెన్నో భాషకందని భావాలు కదలాడాయి.

"అవును దివ్యా....!? నా తర్వాత వాళ్ళిద్దరు ఆడపిల్లలేనని, వాళ్ళ పెళ్ళిళ్ళు జరిపించాల్సిన బాధ్యత ఇంటికి పెద్దకొడుకుగా నా మీద నే వుందని నాన్నగారు రిటైరై నాలుగేళ్ళయిందనీ— ఇవన్నీ తెలిసి తెలిసి, మన పెళ్ళి గురించి ఒత్తిడి తేవటం న్యాయమా దివ్యా?"

అతని గొంతులోని ఆర్ద్రత తనని కదలించి వేసింది.

చటుక్కున అతని అరచేతిని తన చేతుల్లోకి తీసుకుని "సారీ సిద్ధూ! నీ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళయ్యాక నే మన పెళ్ళి. సరేనా!?" అన్నది తను చిన్నగా నవ్వుతూ.

నియాన్ లైట్లు పబ్లిక్ గార్డెన్స్‌ని పట్టపగలుగా మార్చేశాయి. ఒకరొకరు మెల్లగా ఇంటిముఖం పడ్తున్నారు.

"ఇక వెళ్దామా?" అన్నాడు సిద్ధార్థ.

"మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావు?" అన్నది తను. అతని కళ్ళలో దేనికోసమో వెతుకుతున్నాయి తనకళ్ళు ఆత్రంగా. అతనితో విడిపోయే ప్రతిసారీ మళ్ళీ అతన్ని చూడలేనేమోనని భయం వేస్తోంది. మళ్ళీ అతను తనని చూడటానికొచ్చేవరకు అంతులేని టెన్షన్ మనసుని నొక్కి పడ్తుంది.

"రేపురాత్రి ఫ్లైట్‌లో ఢిల్లీ వెళ్తున్నాను. ఎల్లుండి ఢిల్లీ నుంచి తిరిగొస్తాను. డ్యూటీ దిగగానే సరాసరి మీ ఇంటికి వచ్చేస్తాను. యెక్కడికి వెళ్ళాలో ఏం షాపింగ్ చెయ్యాలో ప్రోగ్రాం ఫిక్స్ చేసి వుంచు నేనొచ్చేసరికి!" అతని కళ్ళు చిలిపిగా నవ్వుతున్నాయి.

తను దిగులుగా తల వూపింది.

అతను వెళ్ళిపోయాడు.

అదంతా గుర్తొచ్చి మనసింకా భారంగా అయిపోయింది దివ్యకి.

ఈ రోజు ఉదయానికే అతను ఢిల్లీ నుంచి తిరిగి రావలసి వుంది.

చీకటి పడిపోయింది. అయినా అతను తిరిగిరాలేదు. ఏమైంది? ఫ్లైట్ నిర్ణీత సమయానికి బయల్దేరలేదా? లేక ఏ కారణం చేతనైనా ఢిల్లీలో ఆగిపోయి తర్వాతి రోజు బయల్దేరుతున్నాడా?

అసహనంగా తల విదిలించింది దివ్య.

అతన్ని చూసి ఎన్నో నెలలయిపోయినట్లుంది. మూడు రోజులే అయినట్టులేదు. అతన్ని చూడాలని మనసు ఆరాటపడుతోంది. అతనితో యెన్నో కబుర్లు చెప్పుకోవాలని, జోక్స్ కట్ చేసుకుంటూ హాయిగా నవ్వుకోవాలని చాలా తపనగా వుంది.

కాని అతను రాలేదు. ఇంట్లో అమ్మతో చెప్పి రకరకాల పిండివంటలు కూడా చేయించి సిద్ధంగా వుంచింది. అమ్మకి, నాన్నకి కూడా సిద్ధార్థ అంటే చాలా ఇష్టం. అతని వ్యక్తిత్వం వాళ్ళకి బాగా నచ్చింది.

అతను చెల్లెళ్ళ పెళ్ళి బాధ్యతలు తీర్చుకున్న మరుక్షణంలో అతనితో తన పెళ్ళి జరిపించటానికి తనవాళ్ళు సిద్ధంగా వున్నారు.

నాన్నగారు పెద్ద హోదాలో వున్నారు. నిజానికి సిద్ధార్థకన్నా చాలా పెద్ద సంబంధాలు కూడా వచ్చాయి తనకి. కాని, తన మనసెరిగిన నాన్న అప్పుడప్పుడే

తన పెళ్ళి చేయబోవటం లేదని వాళ్ళని సున్నితంగా తిరస్కరించారు. అలాంటి తండ్రి కడుపున పుట్టడం తన పూర్వజన్మ సుకృతం!

టెన్షన్‌తో, నిరాశతో హాల్లో లేచి పచార్లు చేస్తున్న దివ్య టెలిఫోన్‌ని చూడగానే చటుక్కున అటు కదిలింది.

ఛ. ఇంత సేపూ తన కెందుకు తట్టలేదు? ఏర్ పోర్టుకి ఫోన్ చేసి కనుక్కుంటే పోయేదిగా! ఒక్కోసారి మెదడు మొద్దుబారిపోయి ఆలోచనలేరావు.

ఒక్క అంగలో ఫోన్ అందుకుని, డైరెక్టరీలో నంబరు చూసి ఎర్ పోర్టుకి రింగ్ చేసింది దివ్య.

అటు ఎవరో ఫోన్ ఎత్తారు.

"హలో, ఈజిట్ ఏర్ పోర్టు?" అడిగింది దివ్య.

* * *

ఏదో అద్భుతం జరిగితే తప్ప తమని, ఆ ఎడారి భల్లూకాల బారినుంచి ఎవరూ రక్షించలేరని భావించాడు సిద్ధార్థ.

కోయిల మెదడు పాదరసంలా పని చేసింది.

"ఎడారి భల్లూకాలు శవాల్ని ముట్టవు. వెంటనే నేల మీద పడుకుని ఊపిరి బిగబట్టు!" అన్నది కోయిల.

మరుక్షణం ఇద్దరు ఇసకలో వెల్లకిలా పడుకుని ఊపిరి బంధించారు.

వాళ్ళని సమీపించిన భల్లూకాలు కదలిక లేకుండా పడున్న వాళ్ళని సంశయంగా చూశాయి.

సిద్ధార్థ కళ్ళుకూడా గాఢంగా మూసేసుకున్నాడు.

భల్లూకాల శరీరం మీదుగా వస్తున్న దుర్వాసనతో

బాటు వాటి ఊపిరి వాటి సామీప్యత అతనికి స్పష్టంగా తెలుస్తూన్నాయి.

ఓ భల్లూకం అతని ముఖంమీద తన ముఖాన్ని పెట్టడం కూడా అతను గుర్తించాడు. ఏ మాత్రం చలించలేదు. కోయిల పథకం ఫలిస్తే తామిద్దరు బతికి బయట పడతారు. లేదా, ఎలాగూ చావు తప్పదు!

భల్లూకం ఒంటిమీదున్న బొచ్చు అతని ముక్కురంధ్రాల దగ్గర ఇర్రిటేషన్ కలిగించింది. తుమ్మురాబోతే బలవంతాన ఆపుకున్నాడు.

కొన్ని క్షణాలు చాలా భయంకరంగా, అతి భారంగా గడిచాయి.

భల్లూకాలు తమాషేం చెయ్యకుండానే అక్కడ్నుంచి వెళ్ళిపోయాయని గ్రహించాడు సిద్దార్థ.

ఇప్పుడు వాటి శరీరాల దుర్గంధంగాని, వాటి ఉచ్ఛ్వాస నిశ్వాసాల సవ్వడిగాని వినిపించటంలేదు.

"అవి వెళ్ళిపోయాయి" అన్నది కోయిల చెవిదగ్గర.

కళ్ళు తెరిచాడు సిద్దార్థ. అప్పటికే వేడెక్కిపోయిన ఇసక వీపును కాల్చేస్తోంది. గాలిలో వేడి సెగలు వ్యాపించాయి. కళ్ళు విపరీతంగా మండుతున్నాయి. అలవాటు లేని వాతావరణం తన ప్రభావాన్ని శరీరంమీద చూపిస్తోంది.

కోయిల ముఖంవైపు చూశాడు. ప్రశాంతంగా వుంది. చిన్నగా నవ్వుతోంది.

"నీ సమయస్ఫూర్తి మెచ్చుకోదగ్గది." అన్నాడు సిద్దార్థ.

"మన భుజబలం ఎందుకూ కొరగాదనుకున్నప్పుడు

బుద్ధిబలాన్నే ఆశ్రయించాలి కదా!" అన్నది కోయిల.

ఆమె తనూహించినట్టు అమాయకురాలు కాదని, తెలివి, చురుకుపాలు, తెగువ, అభిమానం, పౌరుషం, కార్యదీక్ష అన్నీ సమపాళ్ళలో వున్నాయామెలో. నాగరికులకన్న ఆ ఎడారిపిల్లే ఎంతో నయం అనుకున్నాడు.

సరిగ్గా అప్పుడే బుస్ మంటూ ఛీత్కారాలు వినిపించాయి.

ఉలిక్కిపడి చూశాడు సిద్ధార్థ.

ఎదురుగా తోకమీద నిల్చుని నాట్యం చేస్తున్నాయి. ఇసకరంగులో కలిసిపోయి రక్షకవర్ణం కలిగివున్న క్రూర సర్పాలు!

అసలు ఇంతసేపూ అవి తమపక్కనే ఇసకలో ఎక్కడో దాగొని వుండొచ్చుననే ఊహ రాగానే అతని ఒళ్ళు గగుర్పొడిచింది.

చటుక్కున వెనక్కి జరిగాడు. సరిగ్గా అతన్ని కాటందుకోబోయిందో సర్పం. దాని ప్రయత్నం సగంలో వుండగానే ధనుస్సుతో దాని తలమీద గట్టిగా మోదింది కోయిల.

టప్ మనే శబ్దంతో అల్లంత దూరంలో పోయిపడిందా సర్పం.

ఈ లోపల తన చేతిలోని కత్తికి పని చెప్పాడు సిద్ధార్థ.

దాదాపు పది పన్నెండు సర్పాలు కుల కుల లాడుతూ వాళ్ళని చుట్టుముట్టాయి.

"ఇక్కడ చాలా విషపూరితమైన కాలనాగు లుంటాయనే విషయం ముందుగా నీకు హెచ్చరించటం మరి

చాను. బహుశా. నువ్వు దేన్నో తోక తొక్కి వుంటావు. అందుకే అవి పేట్రేగిపోతున్నాయి. నేను దారిచేస్తాను వీటి మధ్యనుంచి. నువ్వు నా వెనకే పరుగెత్తుకొచ్చెయ్యి." అంటూ తమ కెదురుగా తోకలమీద నాట్యం చేస్తున్న ఆ సర్పాల వైపు ఓసారి చూసి ధనుస్సుతో అడ్డుగా వున్న రెండు సర్పాల్ని దూరంగా విసిరేసింది కోయిల. ఎగిరి గెంతింది అవతలకి.

ఆమె వెనకనే సిద్ధార్థ కూడా గెంతాడు. ఇద్దరూ కొన్ని గజాలవరకు ఆగకుండా పరుగెత్తారు.

"తమకేదైనా హాని కలిగిస్తే ఈ సర్పాలు పగపడతా యని మేమంతా నమ్ముతాం. నన్ను పాము కాటు వెయ్యదు. వేసినా విషం ఎక్కదు." ముంజేతికి కట్టు కున్న ఓ మూలికను చూపించింది కోయిల.

సిద్ధార్థ ఆమె నమ్మకాన్ని కాదనటం ఇష్టంలేక తల పంకించి వూరుకున్నాడు.

అప్పుడు మధ్యాహ్నం పదకొండున్నర గంటలయింది. అతనికి చాలా ఆకలిగావుంది. నిస్త్రాణగాను వుంది. అంతసేపు పైకి చెప్పుకోలేదుగాని, దాహం విపరీతంగా వేస్తోంది.

కోయిల అతని పరిస్థితిని గుర్తించింది.

"నన్ను క్షమించు. నా హడావిడిలో నీ విషయం పట్టించుకోలేకపోయాను. ఎడారికి కొత్తవాడివైన నువ్వు ఆకలిదప్పులకు తట్టుకోలేవన్న నిజాన్ని విస్మరించాను. నా అంచనా ప్రకారం ఇక్కడికి దగ్గర్లోనే ఒయాసిస్ వుండాలి. చల్లటి నీరు కడుపునిండా తాగొచ్చు. అంతే కాదు, ఆ పక్కనే కమ్మటి ఖర్జూరపళ్ళు కూడా

వుంటాయి. ఆకలి తీర్చుకోవచ్చు" అన్నది.

ప్రాణం లేచి వచ్చింది సిద్ధార్థకి.

అయితే ఆ దేసమయానికి వాళ్ళకి చాలా సమీపంలో ఇసక గాల్లోకి లేపుకుంటూ అటే వస్తూన్న నాలుగు ఒంటెలు కనిపించాయి.

కళ్ళు చిట్లించి చూసింది కోయిల. ఆమె చూపు చాలా సునిశితమయ్యిందనటానికి సూచనగా ఆమె క్షణాల్లో ఎలర్టయిపోయి సిద్ధార్థ వంక అలజడిగా చూసింది.

"వాళ్ళు....వాళ్ళు ఘోర్కా జాతి బందిపోట్లు. ఏదో సమీప గ్రామానికి దోచుకోవటానికి బయల్దేరారు. చూడు, వాళ్ళేం చేస్తారో." అంటూ అంబుల పొదినుంచి బాణంతీసి వింటికి సంధించి చెవిదాకా నారి లాగి వదిలింది.

గాలిని సర్న కోసుకుంటూ మహావేగంగా దూసుకు పోయింది బాణం.

ఆ వెనువెంటనే బాధాకరంగా ఓ ఆర్తనాదం వెలువడింది.

ఒంటెమీదినుంచి అమాంతం నేలమీదికి పడిపోయాడో బందిపోటు.

ఒకటి తర్వాత మరొకటిగా ఆమె నాలుగు బాణాలు వదిలి నలుగుర్నీ నేలకూల్చేసింది.

ఆమె లాఘువానికి, గురికి నిశ్చేష్టుడైపోయాడు సిద్ధార్థ.

ఆమె ముఖంలో అనిర్వచనీయమైన సంతృప్తి అంతకుమించిన ప్రశాంతత గమనించిన సిద్ధార్థ ప్రశంసాపూర్వకంగా చూశాడామె వంక.

"పద, మన ప్రయాణానికి మళ్ళీ ఒంటెలు దొరికాయి" అన్నది చిరునవ్వుతో కోయిల.

ఇద్దరు ఒంటెల్ని సమీపించారు.

నేలకూలిన బందిపోట్లను కాలితో తన్ని వాళ్ళు మరణించిన విషయం ధృవపరచుకొంది కోయిల.

నలుగురి గుండెలమీద రెండుకాళ్ళతోను కుమ్ముతూ కసిదీరా వికటాట్టహాసం చేసింది కోయిల.

ఆ సమయంలో ఆమె ముఖంవైపు చూడటానికి భయపడిపోయాడు సిద్ధార్థ. మహిషాసుర మర్దనం చేస్తూన్న కాళీమాతలా కనిపించింది. కళ్ళు అప్రయత్నంగా మూసుకున్నాడు.

ఓ పది నిమిషాలవరకు ఆమె ముఖం అలా నెత్తురు గడ్డలా ఎర్రగానే వుంది. ఆ తర్వాత తన ప్రశాంత, ప్రసన్నవదనం అతనివైపు తిప్పి చిన్నగా నవ్వింది.

తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు సిద్ధార్థ.

"మనం సాయంత్రానికల్లా వాళ్ళ స్థావరం చేరిపోతాం. దగ్గరకొచ్చాం" అన్నది కోయిల.

తల పంకించాడు సిద్ధార్థ.

ఆమె బందిపోట్ల శరీరాలనుంచి బాణాలను లాక్కొని మళ్ళీ అంబులపొదిలో పెట్టుకుంది—వాళ్ళ రక్తాన్ని వాళ్ళ దుస్తులకే తుడిచి—

"ఇవి ప్రత్యేకంగా తయారుచేసిన వాడి బాణాలు. బాణం శరీరానికి తగిలిన మరుక్షణం వెన్నులోంచి బయటకు పొడుచుకు వెళ్తుంది. తక్షణం శత్రువు ప్రాణం వదులాడు" చెప్పింది కోయిల.

రెండు ఒంటెలను ఆమె ఎన్నుకుంది. ఓ దానిమీద సిద్ధార్థను కూర్చుండజేసి, రెండో దానిమీద తను అధిరో

హించింది. ఒంటెలను అవి వచ్చిన దిశలోనే మళ్ళించింది. ఇప్పుడు బందిపోట్ల స్థావరాన్ని తాము వెతుక్కోవలసిన శ్రమ తప్పింది. అలవాటుపడ్డ ఒంటెలు ఘోర్క బందిపోట్ల నివాసస్థలానికి సరాసరి సాగిపోతున్నాయి.

* * *

ప్రయాణం ఒక గంటసేపు సాఫీగా సాగింది.

సిద్ధారను ఆకలిదప్పులతో బాటు గాయపడిన భుజం కూడా బాధపెడుతోంది. పళ్ళబిగువున బాధలన్నీ భరిస్తూన్నాడు.

కోయిల ఒకచోట చటుక్కున ఒంటెనాపింది. చెంగున కిందికి దూకింది. అర్థంకాక చూశాడామె వంక సిద్ధార.

కోయిల ఓ పక్కగా నేలబారుగా వున్న ఓ మరుగుజ్జు మొక్కను సమీపించి దాని ఆకుల్ని తెంచింది.

ఆ మొక్క తప్ప కనుచూపు మేరలో ఎక్కడా ఎలాంటి మొక్కలుగాని, చెట్లుగాని లేవు. సిద్ధారకు వింతగా తోచింది.

కోయిల అతన్ని సమీపించి చెంగున ఒంటెమీద కెగిరి కూచుంది.

"ఇలా పట్టు" అంటూ భుజంపైన ఆకురసం పిండింది. చల్లగా నవనీతంలా సోకింది ఆకుపసరు. సిద్ధార బాధ చేత్తో తీసేసినట్టయింది ఉపశమనం కలిగింది.

కృతజ్ఞతగా ఆమె వంక చూసి, "నువ్వు అనుక్షణం నా క్షేమం గురించే ఆలోచిస్తూన్నావని అర్థమయింది. కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

"నాకు కృతజ్ఞతలు చెప్పొద్దు ఈ గాయం నా శత్రువుల్లో ఒకడైన ఘూర్క బందిపోటు చేసినది. ఆ

జాతిమీద ప్రతీకారం తీర్చుకునేవరకు మనం విశ్రమించం"
అన్నది కోయిల దృఢంగా.

సిద్ధార్థకు కూడా ఆ మాటలతో వీరావేశం వచ్చింది. అవును, దెబ్బకు దెబ్బతియ్యాలి! సుస్మితవంటి అన్నెం పున్నెం ఎరగని అమాయకురాలి ప్రాణాలు పొట్టన పెట్టుకొన్న ఆ రాక్షసుల అంతు చూడాలి!

సుస్మిత, కోయిల — యిద్దరూ తన ప్రాణదాతలే! చనిపోయిన సుస్మితకి ఆత్మ శాంతి, బతికున్న కోయిలకి మనశ్శాంతి కలిగించటం తన విధ్యుక్త ధర్మం!

పసరుపిండటం పూర్తి చేసి అతని కళ్ళలోకి చూసి వెన్నెల్లా నవ్వింది కోయిల. బదులుగా సిద్ధార్థ కూడా నవ్వాడు.

ఏమిటో, ఈ ఎడారిపిల్ల మనసు! అప్పటికప్పుడే క్రోధంతో అపరకాళిలా కనిపిస్తుంది. అంతలోనే అమాయకమైన ముఖంతో అప్పుడే పుట్టిన పసిపాపలా అనిపిస్తుంది. ఆమె, ఈమె ఒకరేనా అని సందేహాన్ని కలిగిస్తుంది.

కోయిల అతని ఒంటెమీదినుంచి కిందికి దూకి తిరిగి తన ఒంటెపై కెక్కింది.

సరిగ్గా అప్పుడే వాతావరణంలో అనుకోని విపరీతమైన మార్పు వచ్చింది. ఆ మార్పు ఏమిటో వాళ్ళు గ్రహించేలోపల ఒక్కసారిగా ప్రళయ ఝంఝా మారుతం మహోధృతంగా వీచింది.

గాలికన్న వేగంగా ఎర్రగా కాలుతున్న ఇసుక తుఫాను లేచింది పైకి. హోరుమని సముద్ర ఘోషలా, ఒక్కసారిగా వేయిమంది రాక్షసులు హోయని అరుస్తున్నట్టు చెవులు చిల్లులు పడే రొద వాళ్ళని చెవిటి

వాళ్ళనుగా మార్చేసింది.

రెండు చేతుల్తోను కళ్ళు మూసేసుకున్నా నోట్లోకి, ముక్కుల్లోకి ఇసక ఊడ్చి కొడుతోంది. కాల్తున్న ఇసక సున్నితమైన ముఖ భాగాలని తాకగానే నిప్పులు ముఖాన కుమ్మరించినట్టనిపించింది.

కళ్ళు తెరవటానికే మాత్రం అవకాశం లేదు. ఒళ్ళంతా ఇసక. నెత్తిమీద ఇసక. గుడ్డల్లోనించి శరీరం మీదికి ఉధృతంగా పాకుతున్న ఇసక. ఎటూ కదల్లేని అగమ్య స్థితి.

ఒకరి కొకరు ఎక్కడున్నారో తెలియదు. ఏమై పోతున్నారో, ఏం జరగబోతోందో అంతా అయోమయ పరిస్థితి.

అయితే అతనికి తెలుస్తూనే వుంది—అది ఇసక తుఫాన్ అని, అలాంటిదే గతంలో సుస్మిత, తాను పారాచూట్‌లో గాల్లో తేలివస్తున్న సమయంలో సంభవించిందనీను. అయితే, అప్పుడు తామిద్దరు భూమికి చాలా ఎత్తులో ఎగురుతున్న కారణంగా తుఫాను తాకిడి తమ కంతగా సోకలేదని ఇప్పుడు తెలిసి వచ్చింది.

అంతకంతకు గాలి హోరు హెచ్చింది. ఇసక సముద్ర కెరటాల్లా ఉవ్వెత్తున లేచి మేటలు వేస్తోంది. వర్షంలా కురుస్తోంది.

ఉన్నట్టుండి తాను గాల్లో తేలిపోతున్నట్టు గ్రహించాడు సిద్ధార్థ. కళ్ళు తెరిచి చూద్దామనుకున్న అతని ప్రయత్నం ఏ మాత్రం ఫలించలేదు. శాశ్వతంగా గుడ్డివాడైపోతానని గ్రహించాడు. కళ్ళు మూసుకునే గాలి ప్రచండ వేగానికి పైకి పైపైకి యెక్కడికో తేలిపో

తున్నాడు. విమానంలో పయనించేటపుడు ఎలాంటి కదలికలు అనుభవిస్తాడో అదే అనుభూతి!

అంటే....తను గాలిలో బాగా ఎత్తులో తేలిపోతున్నాడా? గాలికింత వేగముంటుందని విమానాలని నడిపే తనకే ఇన్నాళ్ళు తెలియదు.

కోయిల ఏమయింది? ఆమె కూడా తనలాగే గాలిలో తేలిపోతూ ఎక్కడికో ఎగిరిపోతోందా?....ఏమో!....

ఆ సమయంలో అతను, నూరు యోజనాల విస్తీర్ణం గల సముద్రాన్ని దాటడానికి గాలిలో ఎగిరి వెళ్ళిన హనుమంతుడిలా వున్నాడు.

దాదాపు పది నిమిషాలు అలా గాలిలో ఎగురుతూ ఎక్కడికో విసిరి వేయబడ్డాడు సిద్ధార్థ.

అయితే నేలమీద పడిపోతుండగా అతని శరీరానికి తాకింది ఇసక కాదు—ఒత్తుగా పెరిగిన పచ్చిక!

నేలని తాకుతుండగానే సిద్ధార్థకి స్పృహ తప్పిపోయింది.

• • •

"వ్వాట్, సిద్ధార్థ ఫ్లైయిట్ నించి జారి పడిపోయాడా? నెవ్వర్, ఇట్స్ నాట్ ట్రూ!" ఫోన్‌లో గట్టిగా అరిచింది దివ్య.

"మేమే వచ్చి మీకు స్వయంగా ఈ విషయం తెలియచెయ్యాలనుకుంటున్నాం మేడమ్! మాకిప్పుడే ఇన్ఫర్మేషన్ వచ్చింది...." ఏర్‌పోర్టు అధికారి చెపుతున్నాడు.

ఆ మాటలేమీ వినిపించటంలేదామెకు. ఎలా జరిగింది? పారాచూట్‌లో విమానం నించి ఎప్పుడు గాలిలోకి ఉరుకుతారో ఆమెకు తెలుసు.

కాని....విమానంలో అందరు క్షేమంగా వుండగా,

విమానానికలాంటి ప్రమాదం లేని సమయంలో కావాలని యెందుకు సిద్ధార్థ మాత్రమే పారాచూట్‌లో విమానం నించి తప్పించుకున్నాడు?

అదే విషయమడిగింది టెన్షన్ అణచుకుంటూ దివ్య.

"మేడమ్....మాకూ అదే అంతుబట్టడంలేదు— అతనితో బాటు ఓ ఏర్ హోస్టెస్ కూడా ఉరికింది పారాచూట్‌లో."

వింటున్న దివ్య చేతివేళ్ళు రిసీవర్‌ని గట్టిగా పట్టుకున్నాయి. అంతకన్న బలంగా చెవికి అదిమిపట్టింది రిసీవర్.

"ఏమిటి మీరనేది? ఏర్ హోస్టెస్‌తో బాటు సిద్ధార్థ ఉరికాడా? సిద్ధార్థతో బాటు ఏర్ హోస్టెస్ ఉరికిందా?"

"అమ్మా, మీరేం మాట్లాడుతున్నారో నా కర్థం కావటంలేదు. యెవరు ముందు వురికినా యెవరు తర్వాత ఉరికినా, జరిగింది మాత్రం ఇది."

దివ్యకి అప్పుడు అర్థమయింది. తను అర్థరహితంగా మాటలాడుతున్నానని!

"సర్....సిద్ధార్థ గురించి క్షేమ సమాచారమేదైనా తెలిస్తే నాకు తప్పక రింగ్ చెయ్యండి. మా ఫోన్ నంబర్...." చెప్పింది దివ్య.

"ష్యూర్, ష్యూర్! మేం కూడా అతన్ని వెతికించటానికి ప్రయత్నిస్తున్నాం. అతనెక్కడో క్షేమంగా ల్యాండయి వుంటాడని మా విశ్వాసం!"

"భగవంతుడు దయామయుడు. అతను క్షేమంగా వుంటాడు, నాకు తెలుసు." ఆమె గొంతు వణికింది.

"ఉంటాం మేడమ్, గుడ్‌నైట్!" చెప్పాడా అధికారి.

అతను ఫోన్ పెట్టేస్తుండగా కంగారుగా అడిగింది దివ్య! "సర్ .... సిద్ధార్థ ఏ ప్రాంతంలో ప్లేన్ నుంచి బయట పడిందో చెప్పగలరా?"

ఓ రెండు క్షణాల తర్వాత చెప్పాడాయన.

దివ్య థేంక్స్ చెప్పి ఫోన్ పెట్టేసింది.

ఒక్కసారిగా ఉధృతంగా దుఃఖం తన్నుకొచ్చిందామెకు. సోఫాలో కూలబడి చేతుల్లో ముఖం దాచుకుని బావురుమన్నది.

"సిద్దూ, నువ్వెందుకలా చేశావు? ఎందుకోసమని, ఎవరికోసమని....?!" ఆమె హృదయం ఆక్రోశించింది.

అంతలోనే ఆమె స్త్రీ హృదయంలో ఓ అనుమాన బీజం పడింది.

సిద్ధార్థతో బాటు ఓ ఎయిర్ హోస్టెస్ కూడా పారాచూట్‌లో బయటపడిరికింది. యెందుకు? యెవరామె? సిద్ధార్థకి ఆమెకి ఏమిటా బంధం? యెందుకూ ఇద్దరూ ఒకేసారి గాలిలోకి ఉరికేశారు?

ఎందుకు?

ఆమెకి యెంతకీ అంతుబట్టలేదు.

దుఃఖాన్ని నిగ్రహించుకుని, కళ్ళు తుడుచుకుని శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది దివ్య.

• • •

కంటిమీద చల్లటి స్పర్శ తగిలి చటుక్కున కళ్ళు తెరిచాడు సిద్ధార్థ.

తనో మెత్తటి ఒడిలో వున్నట్టు గ్రహించాడు. ఆ ఒడి తాలూకు స్త్రీమూర్తిని కళ్ళెత్తి చూసి నిర్ఘాంతపోయాడు.

దేవతాస్త్రీలను తలదన్నే లావణ్యం, సౌకుమార్యం

సంతరించుకున్న దివ్యాంగనలా వుందామె.

గులాబిరంగు శరీరకాంతి మిరుమిట్లు గొలుపుతోంది. తీర్చిదిద్దినట్లున్న కనుముక్కుతీరు పదేపదే ఆ ముఖాన్ని చూడాలనే కోరికను రేకెత్తిస్తూంటే, సిగ్గు దొంతరలు అలనల్లన ఆమె ముద్దు మోమును రాగరంజితం చేస్తూంటే ఆమె ముఖంలోకే చూస్తూ ఆమె ఒడి స్పర్శలోని సుఖాన్నమభవిస్తూ కొంతసేపు అలాగే వుండిపోయాడు సిద్దార్థ.

ఆ తర్వాత వివేకం వెన్నుతట్టగా చటుక్కున లేచి కూచున్నాడు.

"ఘబరాతేగు పడుకోండి" అన్నదా యువతి తియ్యటి స్వరంతో, హిందీలో.

ఆమె రూపంలాగానే గొంతు కూడా చాలా సమ్మోహనకరంగా వుంది. ఆమెను చూస్తూ, ఆమె మాటలు వింటూ యుగాలు క్షణాల్లా గడిపెయ్యవచ్చుననిపించిందతనికి.

"ఏమిటలా చూస్తున్నావు?" అతనివైపు కొంటెగా చూస్తూ చనువుగా అడిగింది ఆ సుందరి.

"మీరు....మీరెవరు? నేనిక్కడికెలా వచ్చాను?" అన్నాడు సిద్దార్థ. ఆమె ఒడిలోనుంచి లేచి పక్కకు జరుగుతూ.

ఆమె మనోహరంగా నవ్వింది.

"నన్ను 'నువ్వు' అని పిలవొచ్చు లేదా నా పేరుతో పిలు. నేను నిన్ను నువ్వని పిలవటంలేదూ....?"

"మీ....నీ పేరేమిటి?"

"ప్రమద్వర."

"గుడ్ నేమ్."

"నాకు ఇంగ్లీ రాదు."

విస్తుపోయి చూశాడామె వంక.

"ఇంగ్లీషు రానిదానివి, నేను వాడిన మాట ఇంగ్లీషు పదమని ఎలా గ్రహించావు?"

ఆమె గుంభనగా నవ్వింది గాని, సమాధానం చెప్పలేదు.

"ఇంతకీ నే నిక్కడి కెలా వచ్చి చేరానో, ఇదే ప్రాంతమో, నువ్వెవరో చెప్పనే లేదు."

"అన్నీ ఒకటొకటిగా నీకే తెలుస్తాయి. నువ్వు నా వెంటరా. నిన్ను మా తండ్రిగారికి పరిచయం చేస్తాను."

ఆమె లేచి నిల్చుంది.

అప్పుడు చూశాడు సిద్ధార్థ ఆమెను పరీక్షగా.

ఆమె చాలా ఖరీదైన పట్టువస్త్రాలు ధరించింది. ఆమె చేతులకు, చెవులకు, చేతివేళ్ళకు, నడుముకు మెడకు రకరకాల బంగారు ఆభరణాలు ధగధగ మెరిసిపోతూ ఆమె శరీరాన్ని పచ్చటి కాంతితో ముంచెత్తుతున్నాయి. ఆమె తలమీదుగా పల్చటి మేలిముసుగు ధరించి రాణీవాసం స్త్రీలా కనిపిస్తోంది.

బహుశా ఏ జమిందారు వంశానికో చెందిన స్త్రీ అయివుంటుందనుకున్నాడు సిద్ధార్థ. ఆమె వయసు నిండా పద్దెనిమిదేళ్ళు కూడా వుండదని గ్రహించాడు. అతి గారాబంగా, మురిపెంగా పెరిగిన సుకుమారి అని చూడగానే తెలిసిపోతోంది.

ఆమె ఒక్కొక్క అడుగు అలనల్లన ముందుకు వేస్తూంటే ఆమె పాద మంజీరాలు శ్రావ్యమైన సంగీత ధ్వనులను పలికిస్తూన్నాయి. ఆమె సుకుమార పాదాలు నేలను తాకి కందిపోతాయేమో ననిపించింది సిద్ధార్థకు.

ప్రమద్వర నాలుగడుగులు వేసి వెనుతిరిగి చిరునవ్వుతో

అతన్ని చూసి, "ఆగిపోయావేం? రా.... నా వెంట నడచి రా!" అన్నది.

అప్పుడే ఈ లోకంలోకి వచ్చినవాడిలా ముందు కదుగు వేసి మంత్రముగ్ధుడిలా ఆమె ననుసరించాడు సిద్ధార్థ.

ఎటు చూసినా ప్రకృతి దృశ్యాలు అందంగా కని పిస్తున్నాయి. తనుచూపు మేర ఎక్కడా ఇసక కనిపించ లేదతనికి.

చాలా అద్భుతమనిపించింది సిద్ధారకి.

ఏం జరిగిందో గుర్తుకు తెచ్చుకున్నాడు. ఇసక తుఫాను రావటం, తను గాల్లోకి లేవటం, ఎటో ఎగిరి పోవటం—అంతవరకే గుర్తుంది!

అంటే గాల్లో ఎంతదూరం అలా ఎగురుతూపోయాడు తను? ఎక్కడికి చేరుకున్నాడు? ఈ ప్రమద్వర ఎవరు? ఈమె ఒళ్ళోకి ఎలా వచ్చిపడ్డాడు?

అంతా వింతగా, నమ్మలేని విషయంలా అనిపించిం దతనికి.

ఆమె ఓ పెద్ద గేటుముందాగింది.

అది మామూలు గేటు కాదని, కోట ముఖద్వారమని, దానికున్న తలుపులు చెక్కవి కాదని గ్రహించాడు సిద్ధార.

అయితే....ఇది ఏ రాజుల కోట?

చుట్టూ పరికించి చూశాడు.

కోట తలుపులు ఓ బ్రహ్మాండమైన రాతికట్టడంలో ఇమడ్చబడి వున్నాయి.

అప్పటికే కనుచీకటి పడినందువల్ల తను సరిగా గుర్తించలేక పోయాడుగాని రాతితో కట్టబడిన కోట ప్రాకారం అది! మెడ ఎక్కించి చూస్తేనేగాని కనిపించ

నంది ఎత్తులో వుంది.

ప్రమద్వర కోట తలుపులమీద టక్ టక్ మంటూ మునివేళ్ళతో శబ్దం చేసింది.

మరుక్షణం పెద్దశబ్దంతో తలుపులు తెరుచుకున్నాయి. శబ్దాన్నిబట్టి అవి యెంత బరువైన తలుపులో అర్థమయ్యింది. అవి ఉక్కు తలుపులు! ఫిరంగి గుళ్ళకు కూడా యేమాత్రం చెక్కుచెదరని బ్రహ్మాండమైన తలుపులవి!

కుచ్చుతలపాగాలతో రాజభటుల్లా వున్న ఇద్దరు కాపలావాళ్ళు ప్రమద్వరని చూసి ఒంగి సలాం చేశారు.

ప్రమద్వర గర్వంగా తలెగరేసి వాళ్ళ అభివాదాన్నందుకుని హుందాగా ముందుకు అడుగు వేసింది. ఎత్తయిన గడపను కాలు ఎత్తివేసి దాటవలసి వచ్చింది.

సిద్ధార్థకు అంతా ఇంద్రజాలంలా వుంది.

ఇప్పుడు రాజులు, రాచరికాలు యెక్కడున్నాయి? ఈమె చూడబోతే నిజంగానే రాకుమారిలా వుంది. వాళ్ళు రాజభటుల్లా వున్నారు. ఇది చూడబోతే ఆకాశాన్నంటే గోడలతో, ఉక్కుతలుపులతో కట్టబడిన కోట!

సందేహంలేదు, ఖచ్చితంగా ఇదేదో రాజ్యానికి సంబంధించిన రాచకుటుంబమే!

నోరు తెరిచి ఏదో అడగబోయాడుగాని ఆమె 'ఇష్' అంటూ నోటిదగ్గర వేలుంచి వారించటంతో ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

ముఖద్వారం దాటి పది గజాలు వెళ్ళేసరికి అక్కడ ముద్దులొలికే పూల బాలలు స్వాగతం పలికాయి వారికి. అది సుందర నందనోద్యానవనంలా వుంది. అందులో లేని పూలజాతి లేదు.

అప్పుడే ఉదయించిన చంద్రుడి వెలుగు కిరణాలు

పూల మొక్కలపై ప్రతిఫలించి కనువిందు చేస్తున్నాయి.

ఉద్యానవనంనుంచి దాదాపు వంద గజాల దూరంలో ఆకాశాన్నంటే శిఖరంతో మరో కట్టడం కనిపించింది. చూడటానికి అలనాటి రాజుల భవనంలా వుంది.

సిద్ధార్థ మళ్ళీ ఏదో అడగబోయాడు. కాని ప్రమద్వర అతనికా అవకాశమివ్వలేదు.

అంతులేని ఉత్కంఠ నణచుకుంటూ ఆమె వెంటనంటి నడుస్తున్నాడు సిద్ధార్థ.

ఉద్యానవనంలో తోటమాలిలాంటి ఓ మనిషి ప్రమద్వరని చూసి వంగి వంగి అభివాదం చేశాడు. ఆమె చిరునవ్వుతో హుందాగా తలెగరేసింది.

సిద్ధార్థ మౌనంగా అంతా చూస్తున్నాడు. అతనిలో ధర్మ సందేహం వచ్చింది.

ఎదురుపడిన వాళ్ళంతా అదేదో మూకీ చిత్రంలోలా నోరు మెదపకుండా అలాగే నిల్చుని వుంటున్నా రెందుకని? ఆమెపట్ల గౌరవంతోనా, లేక వాళ్ళందరు మూగవాళ్ళా? ఏమో...!? ఏ విషయమైనా అడగటాని కామె అవకాశమిస్తే కదా!

వెన్నెల కాంతిలో రాజభవనం బంగారు మలాము పూసినట్టు తళతళ మెరిసిపోతోంది.

వాళ్ళిద్దరు ఆ భవనం సమీపించారు.

భవనం ముందుభాగంలో ఇద్దరు భటుల్లాంటి వ్యక్తులు నిల్చుని వున్నారు. ప్రమద్వరని చూసి వాళ్ళుకూడా సగం వంగిపోయి అభివాదం చేశారు.

అయితే ఏ ఒక్కరు కూడా తనవైపు కొత్త వ్యక్తిని చూసినట్టుగాని, లేక తనని గుర్తించినట్టుగాని భావ ప్రకటన చేయకపోవటం అతనికి విస్మయాన్ని కలిగిం

చింది.

ప్రమద్వర భవన ప్రాంగణంలోకి అడుగు పెట్టింది. సిద్ధార్థ ఆమె అడుగులో అడుగు వేస్తూ మరబొమ్మలా కదులుతున్నాడు.

లోపల దీపకాంతి అస్పష్టంగా కనిపిస్తోంది. వెలుతురు ఎక్కడినుంచి పడుతున్నదో తెలియదు గాని, డిమ్ లైట్స్ వేసివున్న ఖరీదైన గదుల్లా హుందాగా, దర్జాగా వున్నాయా గదులు.

గదుల గోడలకి అమూల్యమైన పెయింటింగ్స్ సజీవమైన చిత్రణతో తళుకు లీనుతున్నాయి.

అది అంతఃపురం అయివుండొచ్చు ననుకొన్నాడు సిద్ధార్థ. అంతలోనే తను పూర్తిగా అది రాజభవనమనే భ్రమపడుతున్నందుకు తనలో తాను నవ్వుకున్నాడు.

ప్రమద్వర అలాంటి నాలుగు గదులు దాటిం తర్వాత అయిందో దాని ముందాగింది.

ఆ గది చాలా అందంగా, ఆకర్షణీయంగా అలంకరించబడివుంది. హంసతూలికా తల్పంలాంటి పట్టుపరుపు, పందిరి మంచం ఓ పక్కగా వున్నాయి.

మత్తెక్కించే పరిమళం ఆ గదినంతా వింత సువాసనలతో ముంచెత్తివేస్తోంది.

ఇద్దరు పరిచారికలు, అంతదాకా ఆ గది నలంకరిస్తూ వున్నవారల్లా, వాళ్ళు లోపలకు రాగానే ప్రమద్వరకి వంగి నమస్కరించి అక్కడినుంచి బయటకు చకచక వెళ్ళిపోయారు.

"కూచో!" అన్నది ప్రమద్వర నవ్వుతూ. మంత్రముగ్ధుడిలా ఆమె చూపిన బెడ్ మీద కూచున్నాడు. ఆమె అతనికి దగ్గరగా, అతన్ని అనుకునేంత సమీపంగా

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 80/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

కూచున్నది.

లేచి నిల్చుండిపోవాలనుకున్న సిద్ధార్థ మళ్ళీ తన ఆలోచన విరమించుకుని అలాగే కూచుండి పోయాడు.

ఎదురుగా నోరూరించే పదార్థాలు వెండిపళ్ళెంలో పెట్టి మేజామీద పెట్టబడున్నాయి. మరో మేజా మీద మరో వెండి పళ్ళెనిండా పండ్లు వున్నాయి.

వాటిని చూస్తూనే సిద్ధార్థ ఆకలి విజృంభించింది. తన విశ్వరూపం చూపించటం మొదలెట్టింది. కడుపునిండా భోంచేసి ఎన్నో సంవత్సరాలయినట్టుంది.

ప్రమద్వర వెండి పళ్ళాలలోని పదార్థాలు కొసరి తినిపించిందతనికి. వద్దు వద్దంటూనే కడుపునిండా తిన్నాడు.

“ఇప్పుడు చెప్పు. నువ్వెవరు? ఈ మహాలు ఎవరిది? నేన్నీకెలా దొరికాను?” ప్రశ్నలవర్షం కురిపించాడు సిద్ధార్థ.

ప్రమద్వర సమ్మోహనకరంగా నవ్వింది. అతనికళ్ళల్లో కళ్ళు పెట్టి చూసింది. కలవరపడ్డాడు సిద్ధార్థ.

అదే చూపు....సుస్మిత తనవైపు ఆరాధనగా ఆర్తిగా చూసిన చూపు....దివ్య తనవైపు ప్రేమగా, అభిమానంగా చూసే చూపు కోయిల తనవైపు అమాయకంగా అనురాగ దృక్కులతో సారించిన చూపు....

అంటే, ప్రమద్వర కూడా తనను ప్రేమిస్తోందా? తనంటే ఇష్టపడుతోందా? తనపట్ల ఆకర్షితురాలయిందా?

తల విదిలించాడు సిద్ధార్థ.

ఏమిటీ ఆకర్షణ? ఈ యువతులందరు తనపట్ల ఆకర్షితులయ్యేంత గొప్పదనమేముంది తనలో? ఎర్రగా పొడవుగా పొడవుకితగ్గ పర్సనాల్టీతో హుందాగా వుండటమేనా?

కాని....కాని....,ఎంత గొప్ప సుందరీమణుల్ని

చూసినా, అప్సరసలాంటి అమ్మాయిల్ని చూసినా తన మనసు వారిపట్ల అణుమాత్రం కూడా మొగ్గుచూపదు. చలించదు.

తన మనసునిండా పరచుకుని సుస్థిర స్థానమేర్పరచుకుని తన హృదయాన్ని కొల్లగొట్టిన దివ్యకు మాత్రమే తన పక్కన చోటుంది.... కాని, సుస్మితతో తను చేసిన పొరపాటు కారణంగా తనకే దివ్య పక్కన నిలబడే అర్హత లేదు!

అవును తనిప్పుడు అపవిత్రుడు. తనకి దివ్య చేయినందుకునే హక్కు లేదు. ఆ అమృతమూర్తిని మోసం చెయ్యలేడు. శీలం ఆడదానికెంత ముఖ్యమో, మగాడికీ అంతే ముఖ్యం!

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నది ప్రమద్వర అతని చేతిమీద మృదువుగా నొక్కి.

అంత సమీపంలో అప్సరసలని ధిక్కరించే అందాన్ని స్వంతం చేసుకున్న రాజకుమారిలాంటి ఆ సుకుమారి తనని స్పృశిస్తుంటే చలించక పోవటానికి అతను మహర్షి కాదు. సాధారణమైన మనిషి.

అందుకే ఆ స్పర్శకతను పులకించాడు. అతనిలోని సున్నిత భావాల్ని ఆ స్పర్శ సుతిమెత్తగా తాకి అతని శరీరానికంతటికీ విద్యుత్తును ప్రవహింపచేసింది.

ఆమె ఈసారి అతని భుజాల్ని పట్టి కుదిపింది.

"ఏంలేదు.... నా గుడ్డలు బాగా మట్టికొట్టుకు పోయాయి. అక్కడక్కడ చినిగిపోయాయి కూడా. దాదాపు వారం రోజుల్నించి స్నానంలేదు. చాలా చిరాకుగా వుంది." అన్నాడు సిద్ధార్థ పాతం అప్పచెప్పి

నట్టు.

అయితే అతనిలో చెలరేగుతున్న భావాల్ని ఆమె గుర్తించకపోలేదు. చిన్నగా నవ్వుతున్నది.

"కడుపునిండిన తర్వాతగాని నీ శరీరం శుభ్రంగాలేని విషయం గుర్తురాలేదన్నమాట! క్షణంలో నీ స్నానానికి ఏర్పాట్లు జరుగుతాయి." అంటూ చప్పట్లు చరిచింది ప్రమద్వర.

వెంటనే ఇద్దరు పరిచారికలు ఆ గదిలోకి వచ్చి వినయంగా అభివాదం చేసి నిల్చున్నారు.

"స్నానాలగదిలో పన్నీటి తొట్టెలతో నీరు సిద్ధం చేయండి....." అన్నది ప్రమద్వర.

వాళ్ళు మౌనంగా తలలూపి, వెళ్ళిపోయారు.

సిద్ధార్థకి మళ్ళీ అనుమానం వచ్చింది. నిజంగానే వీళ్ళకు మాటలు రావా? మూగవాళ్ళా?

"పద, వెళ్దాం" అంటూ లేచింది ప్రమద్వర. ఆమె కావాలనే, తను అడిగేందుకు కవకాశ మివ్వటంలేదని గ్రహించాడు సిద్ధార్థ.

విశాలమైన హాలుగుండా ఓ పాలరాతి గదిలోపలికి తీసుకు వెళ్ళింది ప్రమద్వర.

సిద్ధార్థ ఆ గదిలోని సరంజామాని చూసి ఆశ్చర్యంతో స్థాణువులా నిల్చుండిపోయాడు.

విశాలమైన ఆ గదిలో నాలుగు పాలరాతితో చేసిన తొట్టెలనిండా సుగంధాలని విరజిమ్ముతున్న పన్నీరు నింపబడివుంది. ఆ గదిలోనే కాకుండా గోడలు కూడా పాలరాతితో తాపటం చేయబడున్నాయి.

(ఇంకావుంది)

